

తథాగతుని శిరస్సు

గాంధార శిల్పం

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి కథలపోటీ

ఆంధ్రసచిత్ర వారపత్రిక 1961 నవంబరు 8 వ తేదీ సంచిక దీపావళి ప్రత్యేకసంచికగా వెలువడుతుంది ఈ సంచికలో ప్రత్యేక ఆకర్షణగా కథలపోటీ నిర్వహిస్తున్నాము మాతో సహకరించి పోటీని జయప్రదం చేయవలసిందని రచయితలను అర్థిస్తున్నాము

## మొదటి బహుమతి రు. 100

## రెండవ బహుమతి రు. 75

## మూడవ బహుమతి రు. 50

**నిబంధనలు**

- కవరుపైనా వ్రాత ప్రతిపైనా దీపావళి కథలపోటీకి అని స్పష్టంగా వ్రాయాలి
- ఇతివృత్తం ఏదైనా కావచ్చు
- రచనలు 10 12 అరఠావు పేజీలు మించి ఉండకూడదు ఒకవైపునే వ్రాసి ఉండాలి
- రచనలు మా కార్యాలయానికి 30 9 61 తేదీలోగా చేరాలి
- బహుమతులకు అర్హమైనవి కాకపోయినా ప్రచురణయోగ్యమైన కథలను వీలువెంట ప్రచురిస్తాము
- పోటీలో తుదినిర్ణయం సంపాదకులదే. ఈ విషయమై ఉత్తరప్రత్యుత్తరాలు ఏ సందర్భంలోను జరుపబడవు
- కథలు తిప్పిపంపటానికి రచయితలు తగు పోస్టేజి పంపాలి

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కు

## వాడి స్నానానంతరపు తాజాదనము మరియు సువాసనతో రోజంతా ఉండండి




నవోత్సాహము చేకూర్చే మరియు సువాసనగల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరు రోహిణీకార్తి ఎండవంటి ఎండగల రోజునైనా, చల్లదనమును మరియు తాజాదనమును రోజంతా యిస్తుంది ఈ మెత్తని పౌడరును ఒళ్లంతా జల్లుకోండి అది ఎంతో త్వరగా చెమటను పీల్చినట్లు చూస్తారు. అది మిమ్మల్ని ప్రొద్దున్న ఉండే తాజాదనముతో మరియు సువాసనతో రోజంతా ఉంచుతుంది చాలసేపు ఉండే తాజాదనమునకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును వాడండి

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు ఎస్ ఎ లో స్థాపించబడినది)

JWT-P-1873

# ఉత్తరాలు

## ముఖచిత్రం

5—7—61 వ తేదీ పత్రిక ముఖ చిత్రం అర్థంసరిగా బోధపడడంలేదని సీతాఫల్‌మండినుండీ శ్రీ ఈశ్వరచంద్రవిద్యాసాగరుగారు వ్రాశారు అర్థంకాకపోవటంలో వింతలేదు గాని ఇరువురు గర్భిణి స్త్రీల నెత్తిమీద ఒకే రకంగా అరిగిన గ్రామఫోను ప్లేటుపడి పగలటం వింతగాలేదూ?

శిరం చంద్రగుప్త (కొల్లూరు)

* * *

ముఖ చిత్రములు అందమైన ఆడ తారలనే వేయుచున్నారు అది మా మగజాతిని అవమానపరచినట్లున్నది అందమైన మగ నటుల చిత్రాలను హాస్యనటుల చిత్రాలను వేసి మగజాతికి మెప్పు కూర్చుదురని మనవి చేయుచున్నాను

టి ఎం రాము (అంగల్లు)

## కార్టూనులు

28 వ తేది సంచికలోని ఉమెన్ కార్టూన్ 'మద్య నిషేధం, చాలా సందర్భముగానే ఉన్నది ఒక పాఠకుడు ఆ కార్టూన్ బాగులేదని వ్రాశారు తప్పు నిజంగా మన తెలంగాణాలో మద్యపానంవల్ల ఎంతమంది కుటుంబాలు నాశమవుతున్నాయో తెలిసుండి కూడా ఆ విధంగా వ్రాయడం ఏమీ బాగోలేదు

పి రాంబాబు (నిర్మల)

* * *

జ గణేశ్‌గారి కార్టూన్ సందర్భోచితంగా లేదని, ఆయన దేవుడ్ని హేళన చేస్తున్నారని ఎస్ సుబ్రహ్మణ్యంగారు విమర్శించారు అసలు కార్టూన్ అంటే ఏమిటి ? హేళన హాస్యం మొదలగు వాటితో నిండి మనకు నవ్వు తెప్పించేదే కార్టూన్ అదీగాక 'దేముడే ఆ మునికి తెలియువర్చి ప్రత్యక్షమవుతాడు' అని ఆయనకు ఆ విషయంలో ఎంతో అనుభవం ఉన్నట్లు వ్రాశారు ఎవరైనా గాని ఎంతో నిశ్చలతతో, ఏకాగ్రతతో తపస్సు చేస్తే గాని 'దేముడు ప్రత్యక్షమవ'డని మనం చదువుకున్నాం భగవంతుడినే సాక్షాత్కరింప చేసుకున్న ఆముని చాలా గొప్ప శక్తిగలవాడని మనకు అర్థమవుతుంది అటువంటి సమయంలో ఎవరైనాగాని (భగవంతుడైనాసరే) ఆ ముని తపస్సును ఆపేయటం కష్టం ఒకవేళ అవు చేసినా తన తపస్సును భగ్నం చేశారనే కోపంలో ఎవరైనదీ ఆలోచించక ఆ భగవంతునికేశాపం ఇవ్వవచ్చు ఋషులకు ఎక్కువగా కోపం ఉంటుందన్న సంగతి మనం చదువుకున్నదే కదా ఆ కార్టూన్‌ని మేం ఇలా అర్థం చేసుకున్నాం! ఇటువంటి కార్టూన్ సృష్టించిన గణేష్‌గారు అభినందనీయులు

యన్ ఆర్ కృష్ణ (రాజమండ్రి)

* * *

మీ పత్రికలో ప్రచురించే కార్టూనులు చాలా చవకబారుగా ఉన్నాయి బొమ్మలు గీయడం ఏమాత్రం రానివారు కూడా కార్టూనులు వేస్తు

## ఉత్తరాలు

స్నట్టు ఉంది కార్టూన్‌లో భావమే కాకుండా, చిత్రం కూడా నవ్వు పుట్టించాలి దానికి ఎంతో ప్రతిభ అవసరం అది మీ పత్రికలో వచ్చే కార్టూన్లలో పూర్తిగాలోపిస్తున్నది అసలు యింతకు మునుపు కార్టూన్ మొహమే ఎరుగని వారెవరైనా అవి చూసి ఆనందించాలి కాని, యింగ్లీషు పత్రికల ద్వారా కార్టూను చిత్రాలు చూసి ఆనందించినవారు మీ కార్టూన్లుచూసి రోత చెందడంలో ఆశ్చర్యంలేదు కార్టూన్ డ్రాయింగ్‌లో అభిరుచి తెలుగు పాఠకులకు కల్పించాలనే మీ ఆదర్శం మంచిదేకాని, అంత చవకబారు చిత్రాలు మీ పత్రికకే కళంం యీ కార్టూన్లు సెలెక్టు చేసే వారికి అసలు బొమ్మలంటే ఏమీ తెలియదా అని పిస్తున్నది

డి రామారావు ( తణుకు )

### మనమూ-మనరాష్ట్రం

కౌండిన్యగారు మనము—మనరాష్ట్రములో నేటి నాయకులను చాలా నిర్దుష్టంగా, నిష్పక్షపాతంగా విమర్శించారు ఈ విమర్శనా వ్యాసం చాల బాగున్నది "మనమూ—మన రాష్ట్రం" అన్న శీర్షిక ప్రతివారము మీరు ప్రచురించదలచినందులకు ధన్యవాదాలు

యస్ ఫిలిప్ (హైదరాబాదు)★

---

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

★

సంపుటము 53
సంచిక 48

9-8-61
బుధవారం

ప్లవనం॥ ఆషాఢ బ॥ త్రయోదశి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం: పద్మిని



48 వ పేజీలో బొమ్మ హిందీనటి 'శశికళ' అని గమనించ ప్రార్థన

## శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

ముఖ్యమంత్రి విజ్ఞప్తిని మన్నించి 'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి ఉదారంగా విరాళాలు పంపుతున్న భక్తాగ్రేసరులను అభినందిస్తున్నాము. జులై 29 వ తేదీనాటికి రు. 17,228-68 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి, ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజా సంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము.


ఎన్నికల్లో పోటీ చెయ్యాలని శ్రీ రాజాజీకి అభిలాష లేదు- వార్త
వెనుక నుండే గ్రంథం నడిపిస్తారు


నిప్పుతో చెలగాటం!
బెర్లిన్ సమస్య
అమెరికా సంసిద్ధత
రష్యా బెదిరింపులు


కాంగ్రెసు ఎన్నికల నిధికి వసూళ్లు


రాజాజీ కల
మాకూ.. వస్తుంది! రు. 1 కోటి


కమ్యూనిస్టులకా చీకూ చింతా లేదు! వారి సదుపాయాలు వారికే ఉన్నాయి
రహస్యమైన సదుపాయాలు



రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాద్ పూర్తిగా స్వాస్థ్యం పొందేవరకు వారి బాధ్యతలు నిర్వహించే నిమిత్తం నియుక్తులైన ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్‌చేత సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ సిన్హా ప్రమాణ స్వీకారం చేయించారు

**న్యూఢిల్లీ లేఖ** — **శ్రీకృష్ణ**

# ఐచ్ఛికంగా పదవులు వదులుకునే కాంగ్రెసు పెద్దలు!: ఢిల్లీ కళాశాలల్లో విద్యార్థినులకు సీట్ల కొరత

కాంగ్రెసు అధ్యక్షులు ఈ వారంలో పత్రికా విలేఖర్ల సమావేశం ఒకటి ఏర్పాటుచేశారు పదిసంవత్సరాలకు మించి అధికారంలోవున్న వారు ఈసారి ఎన్నికలలో పోటీచేయరాదని కోరడ తాము చేసిన సూచనన్ని లేచిన దుమారాన్ని సర్దుబాటు చేయుటమే ఈ సమావేశాన్ని ఏర్పాటుచేయుటంలో ఆయన అంతర్యం

కాంగ్రెస్ అధ్యక్షులు అటు మనస్తత్వశాస్త్ర పరిజ్ఞాని గాని ఇటు హిందువుల మనోవికాసం ఎలా ఉందని చూచేవాడు గాని కాకపోవటం నిజంగా విచారించదగ్గ విషయం ఏమనినీ ఐచ్ఛికంగా అధికారం వదులుకోట మనేది జరగదు ఫార్మోజాలో అనేక లక్షల ధనం వ్యయంతో శక్తివంతమయ్యే తన సింహాసనాన్ని పట్టుకుని శ్రీ చాంగ్‌కై షేక్ ఇంకా అధికారం కోసం ప్రేలాడుతూనే ఉన్నాడు ఏదో తంటాలుపడి సాలాజార్ పోర్చుగీసులో ఇంకా పదవిలోనే ఉన్నాడు సింగ్మన్ రీ కొరియా నుంచి వెళ్లగొట్టేదాకా అధికారంలో ఉన్నాడు భారతదేశంలో సర్దార్ పటేల్ మరణశయ్యపై ఉండీ కూడా ఒక సంవత్సరం పైగా మంత్రిత్వం చలాయించాడు !

హిందువుకు పదవీ విరమణ పుటకలతోటే నని కాంగ్రెస్ అధ్యక్షులు ఇంకా పూర్తిగా గ్రహించి నట్లు లేదు హిందువుగాని ముస్లిం క్రైస్తవుడు ఎవరైనా సరే ఐచ్ఛికంగా పదవిని విరమించిన కాంగ్రెస్ మంత్రి ఒక్కడైనా ఉన్నాడా ! డాక్టర్ జాన్ మత్తయ్ చింతామణి దేశముఖ్ ఆర్థికశాఖ నుంచి తమ పదవులు వదులుకున్నారు నిజమే కానీ వాళ్ళు కాంగ్రెస్‌వాళ్ళు కాదుగా ! శ్రీ టి. టి. కృష్ణమాచారి పదవినుంచి విరమించారు కాని ఏదో సంకట పరిస్థితి ఆయన్నలా వత్తిడి చేసింది గిరికి అవతల ఉన్నవాళ్ళల్లో గాడ్గిల్ రాజకుమారి అమృతకౌర్ హరికృష్ణ మెహతాబ్‌లు కాస్త హోదాన్ని పొందారు మిగిలినవాళ్ళందరు క్రింద పడి దుమ్ముదులుపుకుంటున్నారు

ప్రజాస్వామ్యం అన్నిటికి పైన రేపే అతి సున్నితమైన గాజుగుడ్డలాగా ఉండే దేశంలో మానవులకు గౌరవం వారిపలుకుబడే చలాయింపుమట్టి ఉంటుంది రాజగోపాలాచారి మన దేశానికి మొట్టమొదటి (తుట్టతుది కూడా) భారతీయుడైన గవర్నరు జనరల్ ఆయనకి కాంట్రాక్టులు ఇప్పించటంలోను ఉద్యోగాల విషయంలోను ఈరోజున ఆయనకున్న పలుకుబడేమిటి ? ఏంలేదు

సామ్యవాద సమాజ నిర్మాణం ఆచరణలో ఇప్పుడు సఫ్దర్‌జంగ్ ఆస్పత్రిలో చూడవచ్చు ఇక్కడ రాష్ట్రాల మంత్రులకు ఉపమంత్రులకు వారి ఆశ్రితులకు వైద్యులు ఆటబొమ్మ లయ్యారు వీరు (వైద్యులు) చిదవారిని మాత్రం ఒక ప్రక్కనుంచి ఇంకో ప్రక్కకు పైనించి క్రిందికి తిప్పుతూ ఉంటారు ఒక మంత్రిగారి భార్య కడుపు నొప్పితో బాధపడుతోందని ఒక సీనియర్ డాక్టర్లు ఆయన జన్మదినోత్సవపు విందునుంచి లాక్కొచ్చారు నెహ్రూ మంత్రివర్గం వారి వైద్య సదుపాయపు ఖర్చులెక్క వేయగలిగితే అది అంచనాలకు అతీతంగానే ఉంటుంది

పదవీ వ్యామోహానికి ఇది ఒక పెద్ద కారణం

* * *

ఢిల్లీలో కళాశాలవిద్యాభ్యాసం నిజంగా ఒక సమస్య అయిపోయింది ఇప్పుడు చెప్పుకొన్నది ప్రత్యేకంగా ఆడపిల్లల విద్యను గూర్చే మొదటిది ఢిల్లీకి సంబంధించినంతవరకు బి ఎ అనేది ఆడపిల్లల వివాహానికి ముందు నిబంధనల్లో ఒకటిగా తయారైంది ఇక రెండోది, ప్రతి కళాశాల దగ్గరా విద్యార్థినులుగా చేరే ఆడపిల్లలు పేరులారా చేసుకునేది ఆ వెంటనే పత్రికావిలేఖర్లు ఈ కళాశాలలన్నీ గాలిస్తూ ఎంతమంది దరఖాస్తులు పెట్టారో నిజంగా ప్రవేశం లభించిన ఆడపిల్లలు ఎంతమంది ఉన్నారో సమాచారం సేకరించటం ప్రారంభిస్తారు ప్రతి విద్యార్థిని ఒక కళాశాలకన్న ఎక్కువచోట్ల దరఖాస్తు పెట్టి ఉంటుందన్న విషయం మర్చిపోయి ఈ విలేఖర్లు ప్రవేశం దొరకని ఆడపిల్లల సంఖ్య లెక్కవేసేస్తారు వార్తాపత్రికలు చదివేవా రందరికీ సుమారు 2000 ల మందికి పైగా విద్యార్థినులకు కళాశాలలో ప్రవేశం లభించలేదని సమాచారం అందింది ఇప్పుడు విద్యార్థినీ ప్రహసనంలో రెండోరంగం ప్రారంభమవుతుంది ఈ విద్యార్థినుల్లో చాలా మందికి వారు కోరిన విద్యల్లో ప్రవేశం లభించటంతో ఇంతకుపూర్వం ప్రవేశం దొరికిన కళాశాలలను వదిలివేస్తారు ఈవిధంగా విద్యార్థినుల వలనవల్ల ఏర్పడ్డ ఖాళీలను తిరిగి భర్తీ చేయాల్సి ఉంటుంది

విశ్వవిద్యాలయాలలోని విద్యాశాఖకు ఈ తంతు అంతా తెలుసు అయినా ఈ సమస్యను పరిష్కరించేందుకు ఇంకా ఏమీ జరుగలేదు ఒక మార్గం అనుసరించవచ్చు తాము ఏఏ కళాశాలల్లో ప్రవేశానికి దరఖాస్తు పెట్టిందీ తెలుపుతూ తమవద్ద రిజిస్టరు చేసుకోవలసిందిగా విద్యార్థినీ విద్యార్థులను

(62-వ పేజీ చూడండి)



# కస్తూరిగాత్రి

ఆర్. ఎం. చిదంబరం

పెరిగిన గెడ్డం, లోతుకుపోయిన కళ్ళు, నిరాశగా గొణుక్కునే పెదవులు, గుండెలో పిచ్చి నవ్వులు, అరణ్యంలో చెట్లలా చిత్తం వచ్చినట్టు పెరిగిన జుత్తు, శుభ్రంగా ఉన్నా అలక్ష్యంగా వేసుకున్న బట్టలు

ఈ లక్షణాలన్నీ ఉన్నవాడు పిచ్చివాడు కానక్కర్లేదు దేనికోసమో అన్వేషిస్తూ లభించక, నిరాశ చెంది జీవితంమీద నిస్పృహతో పరిసరాల్ని మరిచి పోయినవాడు కావచ్చు అలాంటి వ్యక్తిలో ఏదో లోపం ఉందన్నమాట ఆ లోపాన్ని కనుక్కున్న క్షణం అతను 'జ్ఞాని' అవుతాడు

ప్రకాశం మొహం కడుక్కుంటూ అద్దంలో చూసుకున్నాడు

అతనిలో పై లక్షణా లేవీ లేవు

వంకీలు, నగిషీలు తిరిగిన జుత్తు, కళ్ళనిండా చిక్కటి వెలుగు ముద్దలు, తియ్యగా, మధువు కోసం నవ్వుతున్న పెదవులు, గుండెలో పొంగి పొరలే ఆనందం, ఖచ్చితంగా అమరిన దుస్తులు, నున్నటి ఎర్రటి బుగ్గలు

ఇది నిజాన్ని కనుక్కున్న మనిషి లక్షణాలు కావచ్చు—లేక—

'నిజ' మనేది ఉందని తెలియక మైమరపులో ఉన్న వ్యక్తి లక్షణాలు కావచ్చు

ఏది ఎలాఉన్నా ప్రకాశం రెండో తరగతికి చెందినవాడు

కాని మొదటిరకం మనిషి అద్దంలో ఉన్న ప్రకాశం మొహంలోంచి తొంగిచూశాడు అతన్నిదివరకు ఎక్కడో చూసినట్టే ఉంది

"ఎక్కడ ? ఎక్కడ ?' అని తన్ను తాను ప్రశ్నించుకున్నాక జవాబు వచ్చింది

'ఏడాది క్రితం అతనే నీవు' అని—

రైలు మంచి వేగంతో పరుగిడుతోంది

చీకటిపడింది ఉన్నట్టుండి అదృశ్యుడైన సూర్యుడికోసం ప్రకృతి చిన్న చిన్న దీపాలు పెట్టుకొని వెదుకుతోంది 'సూర్యుడు రాత్రినుండి కనపడటంలేద' ని గాలి వాడవాడలా చాటింపు వేస్తోంగి

ఆ పెట్టెలో ఎక్కువమంది జనం లేరు

ఫ్లాస్కులో ఉన్న కాఫీ తాగి, సిగరెట్టు ముట్టించి

(53-వ పేజీ చూడండి)




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

...-8-1961 బుధవారము మొదలు
...5-8-1961 మంగళవారము వరకు

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం మీకు అన్ని విధాలా ప్రోత్సాహం లభిస్తుంది మీ మాటను అనుసరించిన వారు, సంతృప్తికరమైన ఫలితం పొందగలుగుతారు శత్రు బాధ ఉంటుంది కాని, చివరకు మీకే అనుకూలత కనుపిస్తుంది పుణ్యకార్యాలలో పాల్గొంటారు ఆలోచనలు అధికం కావటంవల్ల విశ్రాంతి లోపిస్తుంది దూరమందున్న స్నేహితులు మీకు కొంతవరకు సహాయం చేస్తారు వృత్తిలో కీర్తి ప్రతిష్ఠలకు లోపంలేదు కాని, తోటివారు మీ మాటకు వ్యతిరేక భావాన్ని తెలుపుతూ ఉండటంవల్ల క్రొత్త పనులు చురుకుగా సాగక పోవచ్చు ధనాదాయం బాగుంటుంది వారం రెండవభాగంలో ముందుగా తెలుసుకొని కూడా దండగుర్చులలో దిగవలసి వస్తుంది ఒక రిద్దరు పెద్ద మనుష్యులతో నిర్లక్ష్యంగా మాట్లాడవలసిన అవసరం కలుగవచ్చు 12, 13 తేదులలో బంధు విరోధం, వృధా సంక్లేశం, వంచన.

### వృషభం

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం సుఖం తక్కువ అని చెప్పవలసి ఉంటుంది మనస్సులోని కోర్కెలు క్రమంగా పూర్తి చేసుకో గలుగుతారు తమయొక్క గొప్ప తనాన్ని ప్రదర్శించుకునే మనుష్యులతో స్నేహం చేయవలసి వస్తుంది అయితే ఓర్పుతో కార్యం సాధించు

> **గ్రహస్థితి**
>
> మిథునంలో శుక్రుడు, కర్కాటకంలో సూర్య, బుధులు, సింహంలో రాహువు, కన్యలో అంగారకుడు, మకరంలో గురు, శనులు, కుభంలో కేతువు, మిథున, కటక సింహ కన్యలలో చంద్రుడు

కొంటారు ఒకానొక సందర్భంలో మీకు అపకారం చేస్తారనుకున్న మనుష్యులతో స్నేహం కుదురుతుంది సాధారణంగా ఈ సమయంలో ఏ యే పనులు అనుకూలిస్తవో వాటిమీదికే మీ మనస్సు పోతుంది పిల్లల ఆరోగ్యం లోపించగల అవకాశాలున్నవి ధన సంబంధమైన బాధ్యతలు తొలగుతవి. వారం రెండవభాగంలో మీకార్యక్రమాలు మార్పు కొనవలసి వస్తుంది అందువల్ల ముందు ముందు ఉపయోగం ఉంటుంది వినోదకార్యములలో పాల్గొంటారు 14, 15 తేదులలో ధన సంబంధమైన కలహాలు, మనస్సులో ఆందోళన

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ధనవ్యయం అధికం అవుతుంది కుటుంబంలో శుభ సంతోషాలు బాగుంటవి బాహ్య విషయాలలో కూడా ప్రశాంత వాతావరణం కనుపించినా స్వల్ప ఫలితంతోనే తృప్తిపడవలసి వస్తుంది దూరపు ప్రయాణాలు చేయవలసి రావచ్చు మీ ఆరోగ్యాన్ని గురించిన శ్రద్ధ మాత్రం అవసరం కీళ్ళలో బాధ, రక్తప్రసారానికి సంబంధించిన లోపాలు కనుపించవచ్చు మీ మాట నేర్పుతో ఎదటివారి కుతంత్రాలనుంచి తప్పించుకుంటారు విశేషంగా డబ్బు పెట్టుబడి పెట్టటంవంటి పనులనుంచి తప్పుకొనటం మంచిది దక్షిణ దిక్కునుంచి వచ్చే వార్తలు మీ అభిప్రాయానికి వ్యతిరేకంగా ఉంటవి నౌకరుల వల్ల కార్యసిద్ధి ఉంటుంది ధర్మ కార్యాలలో అభ్యంతరాలు కనుపించగలవు 9, 10 తేదులలో ధన లాభం, స్వల్ప కారణాలతో పేచీలు, వస్తు నష్టం.

* * *

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఎన్ని సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చినా మీ ధైర్యం మాత్రం బాగుంటుంది కష్టపడి కార్యం సాధిస్తారు అధికారుల స్నేహం లభిస్తుంది వృత్తికి సంబంధించిన పనులలో మీ ధర్మాన్ని సక్రమంగా నెరవేర్చుకుంటారు ఇంతకుముందు ఏర్పడిన అపవాదులు వాటంతట అవి తొలగిపోతవి ఆదాయంకంటే ముందు ఖర్చులువచ్చి పడటంవల్ల ఇతరుల సహాయం నిమిత్తం ఎదురు చూడవలసి వస్తుంది కాని, ఉపయోగం తక్కువ బంధు వర్గంలో కష్టవార్తలు తెలియగలవు ఇంతకు ముందునుంచి ఆరంభించి చేస్తున్న భారీ కార్యక్రమాలు ఈ సమయంలో కొంత ముందంగా నడుస్తవి ఇతరుల నిమిత్తం మీ పలుకుబడిని వినియోగించవలసి వచ్చినా, సాధ్యమైనంతవరకు తప్పుకొనటం మంచిది 11, 12 తేదులలో కలహ ప్రసంగాలు, విలువగల వస్తువులు కొనటం

* * *

### సింహం

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

శక్తిసామర్థ్యాలకుతోడు కొంతవరకు యుక్తి కూడా ఉపయోగిస్తే కాని, మాట దక్కదు ముందుగా యోచించి చేసుకున్న నిరయాలు ఉపయోగించవు. పట్టుదలగా మాట్లాడే మనుష్యులతో అవస్థపడవలసిన సమయం అయితే మొత్తం మీద వ్యవహార రంగంలో మాట నిలుస్తుంది ధనాదాయంలో మధ్య మధ్య ఆటంకాలు కనుపిస్తు

ఉంటవి మీ ఆరోగ్యం గతవారంకన్నా కొంచెం బాగుంటుంది శుభకార్య ప్రయత్నాలలో మీ శ్రమ ఫలిస్తుంది వారం రెండవ భాగంలో అకస్మాత్తుగా ధనం చేతికి వస్తుంది ప్రయాణాలు అనుకూలిస్తవి తూర్పుదిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి వృత్తి ఉద్యోగాలలో మీ అంతస్తు పెరుగుతుంది 9, 10 తేదులలో శుభ సంబంధమైన ఖర్చులు, ముఖ్యమైన పనులలో పొరపాట్లు, అశాంతి

* * *

### కన్య

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1,2 పా)**

అదృష్టం కలిసి రాగల కాలం, మీరు చెప్పిన మాటకు మన్నన లభిస్తుంది ఏపని ప్రారంభించినా సాటివారి అండ దొరుకుతుంది స్త్రీరాస్తులవల్ల ఆదాయం పొందగలుగుతారు సంఘంలో మీ అంతస్తు పెరుగుతుంది ఒకటి రెండు సందర్భాలలో దండగ ఖర్చులు తగిలినా, మనస్సుకు బాధ తోచదు వారం రెండవ భాగంలో వాహనాలు నడపటం మొదలయినవిషయాలలో పొరపాట్లు రాకుండా చూచుకొనండి కుటుంబంలో శాంతి, సుఖము లభిస్తవి గత వారంలో జరిగిన లోపాలు ఈ సమయంలో సులభంగా సర్దుబాటు అవుతవి మరొకరితో కలసి చేయుపనులలో చిక్కులు రాగల అవకాశాలున్నవి అశ్రద్ధవల్ల వస్తు నష్టం కలుగుతుంది 13, 14 తేదులలో వ్యవహార విజయం, క్రొత్త మనుష్యులతో స్నేహం, ఖర్చు

* * *

### తుల

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

అదృష్టం కలసి వచ్చే సమయం ముందు ముందు మీరు చేయబోవు గొప్ప పనులను గురించి పెద్దవారి సలహా లభిస్తుంది పెద్ద మొత్తాలుగా డబ్బు చేతికి వస్తుంది స్థిరాస్తులకు సంబంధించిన వ్యవహారాలలో మీ అభిప్రాయం ప్రకారం ఉపయోగం కనుపిస్తుంది గౌరవయోగం బాగుంటుంది వినోద, సౌఖ్యాల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి వృత్తిలో ముందు పొరపాట్లు చేస్తారు దైవానుగ్రహం వల్ల అపకారం జరుగకుండా సర్దుబాటు చేసుకోగలుగుతారు బంధువులవల్ల అనుకూలత, ఆదరణ సంతృప్తిగా ఉండవు వారాంతంలో కుటుంబంలోని వారికి అనారోగ్యం చేస్తుంది నీచులతో కలహాలు రావచ్చు అగ్ని, ఆయుధాలవల్ల అపకారం జరుగకుండా చూచుకొనండి 9, 10 తేదులలో సంతోష వార్తలు ప్రయాణం

* * *

### వృశ్చికం :

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

గత వారంకన్నా మీ పరిస్థితి మెరుగుగా ఉంటుంది దేహశ్రమ ఉన్నా కార్యసిద్ధి, గౌరవము దక్కుతవి ధనాదాయము క్రమంగా పెరుగుతుంది అయితే క్రొత్త మనుష్యులను సులభంగా నమ్మతగిన సమయం కాదు అధికారులవల్ల మీ ప్రయత్నాలు ఫలిస్తవి. స్వల్ప విషయాలలో పట్టుదలలు రాగల సూచన లున్నవి వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవాటి నిమిత్తం ఖర్చులు పెరుగుతవి బంధువుల బాధ్యతలు పైన వేసుకొనవలసి వస్తుంది మాట నిలకడలేని మనుష్యులతో లావా దేవీలు జరుపటంవల్ల తాత్కాలికంగా మనో వేదన కలుగుతుంది కుటుంబంలో శుభకార్యాలు నెరవేరుతవి ఇంతకుముందు మిమ్మలను అనుసరించి నడుచుకునేవారే ప్రస్తుతం విరుద్ధంగా మసలుకొంటారు 12, 13 తేదులలో ఇతరులవల్ల మోసం, దైవకార్యాలు, ఆడంబరం

* * *

### ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

సాధారణంగా మీ మాటకు అభ్యంతరం ఉండదు వృత్తి, వ్యాపారాలలో గౌరవంతోపాటు, గౌరవ ప్రతిపత్తులు వృద్ధి అవుతవి డబ్బు సర్దుబాట్లలో వచ్చిన చిక్కులను బుద్ధి బలంతో సర్దుబాటు చేసుకొంటారు కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా ఉండదు మీ క్రిందపనిచేసే మనుష్యులవల్ల జరిగిన పొరపాట్లను సౌమ్యంగా సర్దుబాటు చేసుకొనటం అవసరం విలాసవిషయాలలో ఖర్చులు పెరుగుతవి అంచనాకు లోపం లేకుండా ఆదాయం వస్తుంది కాని చాలక పోవచ్చు ప్రయాణాలు సులభంగా జరుగకపోవచ్చు 14, 15 తేదులలో అధికారులతో పేచీలు, ఇష్ట వస్తు ప్రాప్తి

* * *

### మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ముందు జరుగవలసిన కార్యక్రమాలు నిర్ణయించుకొంటారు ప్రక్కవారి సలహాలు కొన్ని విషయాలలో ఉపయోగించినా, మిమ్మలను నిరుత్సాహపరచగల అవకాశాలున్నవి శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది అధికారులవల్ల అనుకూలత ఉంటుంది ప్రయాణాలు అనుకూలిస్తవి అవకాశాన్నిబట్టి ఖర్చులు తగ్గించుకొనవలసి వస్తుంది భూములు మొదలయిన వాటివల్ల ఫలితం పొందగలుగుతారు అవసరమైన సమయంలో ముఖ్యమైన కాగితాలు, వస్తువులు మొదలయినవి కనుపించకపోవటంవల్ల మనశ్శాంతి లోపిస్తుంది 12—13 లలో కార్యభంగం, మామూలు మాటలలో పట్టుదలలు

* * *

### కుంభం

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)**

మీ చేతిలోని వస్తువును ఇతరులకిచ్చి మరొకరి వద్దనుంచి ఎదురు చూచినట్లుగా ఉంటుంది మిమ్మలను ఆశ్రయించే మనుష్యులు అధికం అవుతారు వృత్తిలో పేరు ప్రతిష్ఠలకు లోపం రాకుండా చూచుకొనటం నిమిత్తం అవస్థ పడవలసి వస్తుంది. ఒకే సమయంలో అనేక మందిని సంతృప్తిపరచవలసిన అవసరం కలుగుతుంది ఆదాయం గతవారంకన్నా మందంగా ఉంటుంది వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు ఇతరులకు హామీ ఉండటం వంటి బాధ్యతలు పెట్టుకోవద్దు 10, 11 తేదులలో నౌకరులతో కలహాలు, అగ్ని ఆయుధముల వల్ల కష్టసూచనలు.

* * *

### మీనం

**(పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)**

సాటివారికంటె అధికంగా ఉండటానికి మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తవి వృత్తి, ఉద్యోగాలలో విశ్రాంతి, అవతలివారివల్ల మంచిమాట లభిస్తవి కుటుంబంలో కూడా మీమీద అందరికి మంచి అభిప్రాయం, అప్యాయత కలుగుతవి కష్టములయందున్న స్నేహితులకు సహాయం చేయగలుగుతారు డబ్బు వత్తిడి చాలావరకు తగ్గుతుంది ప్రతిష్ఠ అధికం అవుతుంది వృధా ప్రసంగాలతో ముఖ్యమైన పనులు భంగం కాకుండా చూచుకొనటం అవసరం వారాంతంలో లాభ వార్తలు తెలుస్తవి అయితే అకస్మాత్తుగా దేహ బాధలు రాగల సూచన లున్నవి 11, 12 తేదులలో కార్యసిద్ధి, అధికారుల ఆదరణ, శుభవార్తలు ★

---

## ఈవారము ధరలు

బంగారుధర తేజీలో నిలకడగా ఉంటుంది పెద్దమార్పు కనుపించదు పసుపు ధరలో 14, 15 లో మందీ వస్తుంది వెండి ధరలో పెద్దమార్పు కనుపించదు పసుపుధరలో మందీ సూచన లున్నవి ప్రత్తి ధర తేజీ అవుతుంది నూలు ధరలో హెచ్చు తగ్గులు వస్తు ఉంటవి వేరుశనగపప్పు ధర తాత్కాలికంగా మందీ రావచ్చు వేరుశనగ నూనెధర నిలకడగా ఉంటుంది నూవుల ధర పెరుగుతుంది నూనెధరలో కొద్దితగ్గుదల వస్తుంది మినుము ధరలో మందీ కనుపించి వారాంతంలో తేజీ వస్తుంది శనగల ధర తగ్గుతుంది మిర్చి ధర పెరుగుతుంది కాని చలామణి తక్కువ ధనియాలకు ముందే వస్తుంది

---

బడిపంతులు :- ఒరే గోపీ ! హరిశ్చంద్రుడు ఆడితప్పని వాడు అంటే అర్థమేమిటిరా?

గోపీ - హరిశ్చంద్రుడు చిన్నతనంలో ఆటలాడుకుని తప్పిపోకుండా యింటికి వచ్చేవాడని సార్ !

ఎ కృష్ణారావు

---

# హరివంశము

## సాందీపనిపర్వం - 23

ఆ సాయంతనము శ్రీ కృష్ణదేవుడు, సాగ్రజుడు, సోద్ధవుడు, సదారుకుడు, సాంధకుడు, ససాత్యకి, కాశిని చూడగా బయలుదేరెను ఆ బయలుదేరువేళ మహానందుడు తానును వత్తు ననెను శ్రీ కృష్ణదేవునకు అతనిని చూడగా అతని వేషమును చూడగా, అతని కోరికను చూడగా ఆశ్చర్యము కలిగినది నవ్వును వచ్చినది "ఆచార్య ! తాము కాశిని బాగుగా నెరిగినవారు మేము కొత్తవారము మేము కాశిని దర్శించుటలో అర్థ మున్నది మరి మీరు గూడా ఎందులకు ?" అనినాడు అని మరల నవ్వినాడు తన్ను శ్రీ కృష్ణదేవుడు "ఆచార్య" అన్న సంబోధనముచేత మర్యాద చేయుటమే మహానందునకు సంతోషమైనది అతడు సాందీపనితో అన్నాడు

"సాందీపని ! నేను చెప్పలేదా ! వీరు నాకును శిష్యులు మరి ఇప్పుడు నేను వీరికి ప్రథమ పాఠమును ప్రారంభించు చున్నాను ఆ పాఠము కాశిని గురించి అందుకే నేనును వీరితో బయలుదేరుచున్నాను నీవు ఏమందువు ! "

సాందీపని ఏమియు ననలేదు "పోయి రమ్మురా !" అన్నాడు శ్రీ కృష్ణదేవుని చూచి, తక్కుంగలవారిని చూచి మందహాసము చేసినాడు ఆ మందహాసము ఈ మహానందుని పద్ధతి ఇంతియే నన్నట్లు ఉన్నది ఆ సాయంతనము మహానందుడు, మందసములో ఎచ్చటనో దాచివుంచిన క్రొత్త వస్త్రములను దీసి కట్టుకొన్నాడు శరీరమును నిండు గంధమును అలుముకున్నాడు ముఖమున త్రిపుండ్రములతోడి కుంకుమమును ధరించినాడు ఆ త్రిపుండ్రముల నడుమ ఆ కుంకుమము శివుని మూడవ నేత్రము వలె నున్నది మరియు మహానందుడు శిరమున ఆశ్రమలతలు విరిసిన పూవులను కోసి తురుముకొన్నాడు ఆ పూవులను కొన్నింటిని మాలలుగా గ్రుచ్చుకొని మెడలో వేసుకున్నాడు ఇది యంతయు అతనియందు విచిత్రమై భాసించినది మాసిన గడ్డము, మాసిన తల, పలుచని శరీరము, దానికి ఇన్ని అందములు అతనిని చూచి అందరును నవ్వుకొనిరి మహానందుడును నవ్వుకొనెను "శ్రీ కృష్ణ ! నీకు ఒక రహస్యము చెప్పుచున్నాను నీవు వచ్చినావని నేను నేడు ఈ అలంకారములు చేసుకొన్నాను మరి నీవంటి అందగానితో బయలుదేరువేళ ఎట్లుండవలయును అట్టులు అలంకరించుకొంటిని" మరల శ్రీకృష్ణదేవుడు గల్లున నవ్వెను అందరును నవ్విరి దీక్షితాయణియు మృదుహాసితము చేసినది ఆమె ముఖమున మందహాసము ఇన్ని దినములుగా లేదు ఇప్పుడు ఆమెకును నవ్వు వచ్చినది ఆమె అన్నది :

'ఓరి ! బడుగా ! నీకు అలంకారము లేమిటిరా ! సర్వ అలంకారములను నిరసించినవానికి !"

మహానందుడు గల్లున నవ్వినాడు "దీక్షితాయణి ! బాగుగా అన్నావు నేను నిరసించనిది దేనిని ! భార్యను నిరసించితిని భార్యతోడి కన్న పిల్లలను నిరసించితిని ! ప్రపంచమును సర్వమును నిరసించుచున్నాను మరి నేను నిరసించనిది ఏమి ? కాశిని నిరసించలేదు మరి ఇప్పుడు ఈ అందగాడు ఆనందమువలె మన ఆశ్రయమునకు వచ్చినాడు వానిని ఎట్లు నిరసింతును అందుకే నేను కాశిని చూడబోవుచున్నాను" అన్నాడు

మహానందుని భార్య మెటికలు విరిచి "బాగున్నది" అన్నది మహానందుడు "ఏమి బాగున్నది" అన్నాడు మరల అందరును నవ్వుకొనిరి మహానందుని కూతురు, పది యేడుల బాలిక, వామాక్షి తానును కాశిని చూడవత్తు నన్నది ఆ పిల్లకు రాజపురుషులను చూడగా, రథములను చూడగా ఉబలాటమైనది మహానందుడు దానిని వద్దనినాడు

శ్రీకృష్ణుడు : ఆచార్య ! ఏల వద్దనుచున్నారు అది పసిపిల్ల రానిండు తప్పేమి ?

మహానందుడు శ్రీకృష్ణ ! అది పసిపిల్ల దాని కేమి తెలియును అదియునుగాక అందరి బదులును నేను వచ్చుచున్నాను నేనేమో, నిన్ను తెలిసినవాడను అది ఇంకను ఏమియు తెలియనిది అదియు నిన్ను తెలియు దినము రావచ్చును

ఈ మాటలు అని మహానందుడు సాలోచనుడైనాడు వాని మాటలకు అర్థమేమో వానికే తెలియలేదు మరి ఇతరులకు అంతకన్నను తెలియలేదు శ్రీకృష్ణదేవుడు ఒక్కడు మాత్రము మందహాసము చేసెను మందహాసము చేసి కుచేలుని వంక చూచెను "నీపేరు కుచేలుడు కాదా ? నీవును వత్తువా !" అనెను కుచేలుడు సిగ్గుపడెను "శ్రీకృష్ణ ! నాపేరు సుదాముడు నన్ను ఆచార్యులవారి పుత్రుడు కుచేలుడు" అనెడివాడు అందుచేత నేను కుచేలుడ నైతిని అతడు ప్రభాస తీర్థమున ఉగ్రగ్రాహము వాతబడిన తరువాత నన్ను ఆ పేరున పిలిచినవారు లేరు నేడు నీవు పిల్చితివి కృష్ణ ! నన్ను, దరిద్రుని, దరిద్రవేషధారిని, నీతో రానిచ్చెదవా ?" అనెను

శ్రీకృష్ణుడు అతనివంక సాకూతియై చూచెను అతనిలో రావలయునన్న ఉత్కంఠ ఉన్నది ఉత్కంఠ లేదు "సుదామా ! నీవును రావయ్యా" అన్నాడు శ్రీకృష్ణుడు

అంతలో దారుకుడు రథములను పూన్చి తెచ్చెను అందరును ఆ రథముల నధిరోహించిరి ఉద్ధవుడు, సాత్యకి, అంధకుడు ఒక రథము నెక్కిరి శ్రీ కృష్ణదేవుడు మహానందుని, అతని కుమార్తెను, సుదాముని, ఒక రథము నెక్కించెను తానును బలరామునితో నా రథమునే అధిరోహించెను దారుకుని చూచి "దారుకా ! నీవు ఆ రథమునకు సారథ్యము వహించు నేను ఈ రథమును నడిపించెదను" అనెను దారుకుడు 'చిత్తము' అనెను రథములు కదిలినవి మహానందునకు విచిత్రమైన ఆనందము కల్గినది ఎందుకు కల్గినదో ! రథములు బయలుదేరుచుండగా నతడ ప్రయత్నముగా నిట్టు లనినాడు

"ఆత్మానం సారథిం విద్ధి శరీరం రథమేవ చ
బుద్ధిం తు సారథిం విద్ధి మన ప్రగ్రహ మేవచ"

సాందీపని అతనివంక ఆశ్చర్యమై చూచినాడు రథము మరికొంచెము ముందునకు నడచినది మహానందుడు మరల ఇట్లనినాడు :

'ఇంద్రియాణి హయానాహుః
విషయాం తేషు గోచరాన్
ఆత్మేంద్రియమనోయుక్తం
భోక్తేత్యాహుర్మనీషిణ "

సాందీపని మందహాసముచేసినాడు రథము మరియు ముందునకు కదిలిపోవుచున్నది మహానందుడు మరియు ఇట్టు లనినాడు :

"యస్త్వ విజ్ఞానవాన్ భవతి
అయుక్తేన మనసా సదా
తస్యేంద్రియాణ్యవశ్యాని
దుష్టాశ్వా ఇవ సారథే "

దీక్షితాయణి విచారదృక్కై రథము పోయిన వంక చూచినది రథము ముందునకు కదిలిపోవుచున్నది శ్రీ కృష్ణదేవుడు హయములను నడుపుచున్నాడు మహానందుడు మరియు ఇట్టు లనినాడు

"యస్తు విజ్ఞానవాన్ భవతియుక్తేన మనసా సదా
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథే "

దీక్షితాయణి కన్ను కొలకులలో దుఃఖబాష్పములో ఆనంద భాష్పములో నిల్చినవి శ్రీ కృష్ణదేవుడు పగ్గములను పట్టి నడుపగా హయములు వశ్యములై ముందునకు సాగిపోవుచున్నవి రథమును సాగుచున్నది మహానందుడు మరియు ఇట్టు లనినాడు

"యస్త్వ విజ్ఞానవాన్ భవతి
అమనస్కః సదా శుచిః
న స తత్పదమాప్నోతి
సంసారం చాధిగచ్ఛతి "

సాందీపనియు, దీక్షితాయణియు, రథములు పోయిన దిక్కుననే చూపులుగా నిలిచిపోయిరి మహానందుని కంఠము వాయువీధులు కదిపిన తరంగములలో కదలాడి, కదలాడి, వారి శ్రవోరంధ్రములను తాకుచున్నది శ్రీ కృష్ణదేవుడు ప్రగ్రహములను పట్టగా రథముకు కుదుపులు లేక ముందునకు సుఖముగా సాగిపోవుచున్నది మహానందుడు మరియు ఇటుల గానముచేసినాడు

"యస్తు విజ్ఞానవాన్ భవతిసమనస్కః సదా శుచిః
సతు తత్పదమాప్నోతియస్మాద్భూయో న జాయతే"

★

హారిత శివశర్మ

కౌండిన్య

# నదీ జలాల పంపిణీ రభస: ప్రభుత్వోద్యోగుల ప్రమోషన్లు

ఆంధ్రదేశాన్ని కలవరపరుస్తున్న కృష్ణా, గోదావరీజలాల సమస్య ఈసారి కూడా శాసనసభలో వచ్చింది గవర్నరు తమ ప్రసంగంలో 1951 ఒప్పందానికి అందరూ కట్టుబడి ఉండాలన్నదే తమ ప్రభుత్వ విధానమని స్పష్టం చేశారు ప్రతిపక్ష నాయకుడు శ్రీ సుందరయ్య కేంద్ర ప్రభుత్వంవేపబుగా ప్రవర్తిస్తోందని విమర్శించారు తతిమ్మా కాంగ్రెస్, కాంగ్రెసేతర సభ్యులు ఏమైనా సరే 51 ఒప్పందం మార్చడం తగదని హెచ్చరించారు చర్చకు సమాధాన మిచ్చేప్పుడు మంత్రులు గూడా ఇదే అభిప్రాయం మరొకమారు ప్రకటించారు

ఈ వివాదంలో మన ప్రభుత్వం, ప్రజా నాయకులు ఇప్పటికి ఎన్నో ప్రకటనలు చేశారు ఎన్నో ప్రసంగాలు చేశారు అవన్నీ కృష్ణా, గోదావరుల ప్రవాహంలో కలసిపోయి కేవలం కంఠశోషవతుగా తయారైనట్లున్నది పైగా 51 ఒప్పందం మార్చడానికి వీల్లేదు, వీల్లేదు అని పదే పదే మనం ఉద్ఘాటిస్తున్నందున ఆ ఒప్పందంవల్ల మనకు న్యాయంగా రావలసిన దానికన్నా ఎక్కువ నీరు వస్తుందని అందువల్లనే "షైలాక్" లాగా ఒప్పందాన్ని అంటిపెట్టుకుని ప్రేళ్లాడుతున్నామని బయటివారిలో ఒక దురభిప్రాయం ఏర్పడుతోంది బయటివారికే గాదు మన నాయకాగ్రేసరుడైన శ్రీ సంజీవరెడ్డికే అలాంటి భావమేర్పడింది 1951 ఒప్పందం చెల్లుతుందో చెల్లదో, రాజ్యాంగ విహితమో కాదో అన్న సందేహం వారికీ కలిగింది ఆ సంగతంతా సుప్రీంకోర్టు న్యాయమూర్తి తేల్చాలని వారు సలహా యిచ్చారు పరాయివారికి నచ్చచెప్పలేకపోతే పోవచ్చు కాని మనవాళ్లనుకున్నవాళ్లే మన నిజాయితీని శంకిస్తే ప్రమాదం

ఇక కేంద్రం సంగతి సరేసరి మైసూరు, మహారాష్ట్రాల వాదానికి ప్రక్కతాళం వేయడం లాగానే ఉంది కృష్ణా, గోదావరి ప్రవాహాల లెక్కలు అనుభవజ్ఞుడైన ఖోస్లా వంటి ఇంజనీరు తయారుచేసినా అవి సరైన లెక్కలు కావు అని మైసూరు మహారాష్ట్రాలు అంటే, కాబోలు అనుకొని కొత్త లెక్కల తయారీకి గుల్హాతీ సంఘాన్ని నియమించారు మన వాదం ఈషణ్మాత్రమైన కేంద్రం చెవి కెక్కలేదనుకోవడానికి 1951 ఒప్పందానికి మన్నా చుడతారని నమ్మడానికి, ఈ సంఘం నియామకం ఒక్కటే చాలు అసలు ఈ సంఘం నియామకానికి మన మంత్రులు కూడా కొంత కారణం కృష్ణా, గోదావరులలో మిగులునీరుంటే ఇతరులు వాడుకోవచ్చు, మాకేం అభ్యంతరం లేదని శ్రీ అల్లూరి ప్రభృతులు అనడం కూడా కేంద్రానికి లోకువైంది గుల్హాతీ సంఘం ఏర్పాటు తమకు ఇష్టంలేకపోయినా మన ప్రభుత్వం నోరు కట్టుకపడిపోవడం కూడా అందుకే

1951 ఒప్పందం మార్చే ఉద్దేశ్యం లేకపోతే గుల్హాతీ సంఘాన్ని వేయడం కాని, అదివరకు మనకు కేటాయించిన నీటితో కట్టుకోదలచిన శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టులను ఆపివేయడం కాని అనవసరం 51 ఒప్పందం మార్చరాదు అంటూ మన మంత్రుల విజ్ఞప్తులు, శాసనసభ తీర్మానాలు కేంద్రం ఆలకించక పోవడంలో అంతరార్థం యిదే

ఏమైనా ఇంతవరకు జరిగినదాన్ని బట్టి చూస్తే ఈ వివాదంలో మైసూరు, మహారాష్ట్రాలదే పైచేయి అయిందని, మన ప్రభుత్వం పరాజయం పొందిందని ఒప్పుకోక తప్పదు అటు 51 ఒప్పందం విషయంలోగాని, ఇటు రాయలసీమ, తెలంగాణాలకు ప్రాణప్రదమైన శ్రీశైలం, పోచంపాడు ప్రాజెక్టుల విషయంలోగాని, కనీసం మాట మాత్రపు హామీనైనా కేంద్రం నుంచి మన మంత్రులు రాబట్టలేక పోయారు ముఖ్యమంత్రి సహా ముగ్గురేసి, నలుగురేసి మంత్రులు ఢిల్లీ వెళ్ళి ఏం సాధించారో దేవుడెరుగు

రేపు గుల్హాతీ సంఘం కూడా కొత్త లెఖ్ఖలు వేసో, లేక ఉన్న లెఖ్ఖలు తారుమారు చేసో కొంత మనకు అన్యాయం చేసినా ఆశ్చర్యంలేదు అసలు యిటువంటి సంఘాలవల్ల, మధ్యవర్తిత్వాలవల్ల మనకు న్యాయం జరిగిన సందర్భాలు ఆట్టే లేవు 1951 ఒప్పందం మార్చితే ఆరంభంలో కొంత గొడవ చేసినా, ఏదో పొరుగు రాష్ట్రాల గొడవ కోసం, స్వార్థత్యాగం చేస్తున్నాం అని సంతృప్తితో సర్దుకొంటాం ఆరంభ శూరత్వం, ఆవేశ ప్రసంగాలు నెమరువేసుకొంటూ కూర్చుంటాం

* * *

శ్రీ సంజీవయ్య ముఖ్యమంత్రి అయిన తర్వాత వారికి వెనుకచూపు ఎక్కువైంది ఇందులో కాస్త ఎన్నికల చూపు కూడా లేకపోలేదు తను వెనుకపడ్డవాళ్ల మనిషిననీ, వెనుకపడ్డవాళ్లంతా తన వాళ్లని నిరూపించడానికి గట్టిగా ప్రయత్నిస్తున్నారు

ప్రభుత్వోద్యోగాలలో ప్రమోషన్ పోస్టులకు సరాసరి రిక్రూట్మెంట్ పోస్టులకు అర్హులైన షెడ్యూల్డు తరగతులవారు లేకపోతే రెండేళ్లదాకా ఆ పోస్టులు అట్లాగే ఖాళీగా ఉంచాలని ఈమధ్య ఒక ఉత్తర్వు చేశారు దానిపై కొంత దుమారం కూడా రేగింది ఇప్పుడు ప్రభుత్వోద్యోగాలలో షెడ్యూల్డు తరగతుల రిజ

(51-వ పేజీ చూడండి)



# కంఠవ్యాధులు-చికిత్స

డా॥ గాలి బాలసుందరరావు

లింఫాయిడ్ టిష్యూ, శరీరంలో ప్రవేశించిన క్రిములనూ విషపదార్థములనూపట్టి, విడదీసి, నిర్మూలించే జల్లెడ వంటి వస్తువనీ, శరీరంలో అనేక స్థానములలో అది ముద్దలుగానో, గ్లాండులుగానో ఏర్పడిఉన్నదనీ యిదివరకే తెలుసుకొన్నాము ఆయా శరీరభాగములు, వాటి వ్యాధులూ చర్చిస్తున్నప్పుడు, ఆ విషయం వివరిస్తాను నోటిలోనే గాక, కంఠ భాగములలో అనేకచోట్ల, లింఫు గ్లాండులు ఉన్నవి కంఠ భాగములు ఇన్ఫ్లేం అయినప్పుడు లింఫు గ్లాండులు ఉబ్బి పెద్దవవుతవి ఈ లింపు గ్రంథుల వృద్ధిని తేలికగా గమనించవచ్చును లింపు గ్రంథులు పెద్దవయిన వంటే పరిసర ప్రదేశములలో క్రిమి దోషమో హానికరపదార్థములో ఉత్పత్తి అయి, రక్తం ద్వారానూ, లింఫు నాళముల ద్వారానూ శరీరంలో యితర ప్రదేశములకు పోతున్నవన్నమాట ఈ పరిజ్ఞానం ఉన్నవారు లింఫు గ్రంథుల వృద్ధిని గమనించిన వెంటనే వైద్యసహాయం పొందడానికి వీలుంటుంది గంటలలో ప్రాణహాని కలిగించే డిఫ్తీరియావంటి వ్యాధినీ తెలియకుండానే పెరిగి ప్రాణాపాయం కలిగించే కేన్సరు వంటి దుర్మాంస వృద్ధులనూ, కంఠ ప్రదేశంలో లింఫు గ్లాండుల పరిశీలన వలన అంకురావస్థలోనే గమనించడానికి వీలుంటుంది

కంఠ భాగంలో ఏయే ప్రదేశములలో లింపు గ్రంథులు గుంపులుగా ఏర్పడి ఉన్నవో 1 వ పటం చూస్తే తెలుస్తుంది చెవి ముందర, చెవి వెనక ఉన్న గ్రంథులు, చెవిలో కురుపు లేచినప్పుడు, చీము ఏర్పడినప్పుడు పెద్దవవుతవి ఒక్కొక్కప్పుడు ఆ గ్రంథులే ఇన్ఫ్లేం అయి, ముట్టుకుంటే బాధ కలుగుతుంది చెవులో కురుపులు తేలకముందే యిది గమనించి వైద్యసహాయం పొందితే, కురుపు పగిలి, చెవి డోలు పగిలి చెడిపోవడమును నిరోధించవచ్చును గడ్డం క్రింద గ్రంథులు నోటిపూత వచ్చినప్పుడూ, నోటిలో అల్సర్లు, కేన్సరు వంటి వ్యాధులు వచ్చినప్పుడూ పెద్దవవుతవి చెవి వెనక ఉన్న మేస్టాయిడ్ (Mastoid) అనే శల్యోపరిభాగమునూ మెడ మూలంలో రెండువైపులా ఉండే క్లేవికిల్ (Clavicle) అనే ఎముకనూ కలిపి, పెద్ద కండరము ఉన్నది మెడ తిరగడానికి ఈ కండరమే ముఖ్య కారణము ఈ కండరమునకు ముందు వైపునా వెనక వైపునా కూడా, లింపు గ్రంథుల కూటమి ఉన్నది అల్లాగే లేరింగ్సు ముందు కొన్ని

(51-వ పేజీ చూడండి)

# కథ కాని కథ

## గయుని గాభరా
## (మొదటి బహుమతి రు. 10 లు)

గయోపాఖ్యానం నాటకప్రదర్శనం ఆరోజు కాని గయునిపాత్రను ధరించవలసిన వ్యక్తి రానందున వేరొక ఆసామిని బ్రతిమాలి ఆ వేషం వేయించినారు తెర ఎత్తగానే గయుడు నారదునికి నమస్కరించవలసిన సన్నివేశం గయునిపాత్ర ధరించిన వ్యక్తికి వేషాలు వేయుట క్రొత్తవల్ల అతి గాభరాతో "మనస్కారములు నాదరా" అన్నాడు ఈ విపరీత ప్రతిభాషలు విన్న నారద పాత్రధారికి కూడా ఘనాపంకం చుట్టముట్టి "గయ పడకుము భయా" అన్నాడు ఈ దెబ్బకు ప్రేక్షక లోకంలో సంచలనం బయలుదేరి, పాదరక్షలతోపాటు, పాత కుర్చీలు కూడా నాటక రంగాన్ని అలంకరించినాయి

శ్రీరామమూర్తి ( తిరుపతి

*   *   *

## 'అమ్మ ఎక్కడ
## (రెండవ బహుమతి రు. 5 లు)

పోయిన సంవత్సరం నేను అనంతపురం, ప్రభుత్వ ఆసుపత్రిలో, డాక్టర్ ట్రైనింగ్ అవుతున్నాను ఒకరోజు, నేను, నాకోడాక్టర్స్ అందరమూ, కలసి, డాక్టర్స్ రూములో కూర్చోని, సరదాగా మాట్లాడుకొంటున్నాము ఇంతలోనే ఒకతను రొప్పుతూవచ్చి, "డాక్టర్! మాయమ్మ ఎక్కడండీ?' అంటూ అడిగాడు నాకేమి, దిక్కు తోచలేదు "ఎవరయ్యా? మీ అమ్మపేరేమి? ఏ రోగముతో బాధపడుతూవుంది" అంటూ అడిగాను వాడు 'అదేనండి మాయమ్మ డాక్టర్" అంటూ చెప్పాడు అప్పుడు అర్థమైంది "డాక్టర్ మాయాదేవి" అని వెంటనే "లేడీస్ వార్డులోవుంది వెళ్ళవయ్యా మీ అమ్మ" అంటూ చెప్పి ఆ వ్యక్తిని పంపి, విరగబడి నవ్వాము

డా ఎస్ గోపాలరావు (ధర్మవరం)

*   *   *

## ఒక్కటే తప్పు
## (రెండవ బహుమతి రు. 5 లు)

అవి నేను ఆరవ తరగతి చదివే రోజులు మా ఇంగ్లీషు మాస్టారు తరచుగా డిక్టేషను వ్రాయించేవారు డిక్టేషన్‌లో ఎన్ని తప్పులుంటే అన్ని దెబ్బలు కొట్టేవారు ఒకరోజు మాస్టారుగారు డిక్టేషన్ వ్రాయించి వరుసగా అందరివద్ద చెప్పిన డిక్టేషన్ చూసుకుంటూ ఎన్ని తప్పులుంటే అన్ని దెబ్బలు కొట్టేరు చివరికి ఆఖరు బెంచిలో కూర్చున్న తిరుపతి వంతు వచ్చింది మాస్టారు వానివద్దకువెళ్ళి "ఎన్ని తప్పులు" అని అడిగేరు తిరుపతి లేచి నిలబడుతూ "ఒకటే తప్పుసార్! అసలు నేను డిక్టేషన్ వ్రాయనేలే'దన్నాడు ఇక మాకు నవ్వాగలేక పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వాము మాతోబాటు మాస్టారు కూడ శ్రుతికలిపారు

కోయల్‌కర్ బన్సీలాల్ (నిజామాబాద్)

*   *   *

## షైలాక్ మతిమరుపు
## (రెండవ బహుమతి రు. 5 లు)

ఐదవఫారం చదువుచున్న రోజులవి స్కూలు వార్షికోత్సవ సందర్భములో మేమొక ఉపాధ్యాయుని సహాయముతో "ది మర్చంట్ ఆఫ్ వెనిస్" అనే ఇంగ్లీష్ డ్రామా కోర్టు సీనును రిహార్సలు ప్రతి దినము వేయుచున్నాము దీనిలో షైలాక్ దుర్మార్గుడు కఠిన హృదయుడు కూడాను అతని మాటలు చాల గంభీరముగా నుండును అందు వలన షైలాక్ పాత్రను నా స్నేహితుడు నరసింహారావు తీసుకొని నటించుచున్నాడు నరసింహారావు తన పోర్షను ఎంత చదివినను మధ్యలో తడబడుచున్నాడు రిహార్సల్ సమయములో మధ్యలోకి రాగానే 'ఇక్కడనే పోర్షను రాలేదండి' అని ఉపాధ్యాయునితో ప్రతి దినము చెవుతూండేవాడు ఎట్లాగైతేనేమి వార్షికోత్సవం రోజురానే వచ్చినది ఆ దినమున రాత్రి 9 గంటలకు మేము స్టేజీ పైకి ఎక్కాము కోర్టు సీను జరుగుతున్నది జనము కిక్కిరిసిఉన్నా నిశ్శబ్దముగా ఉన్నారు సీను సగముదాకా బాగానే జరిగినది ఇక ఆపైన మావాడు 'ఇక్కడనే పోర్షన్ రాలేదండి' అన్నాడు జనమంతా ఘొల్లుమన్నారు

పి రంగనాథం (ఒంగోలు)

*   *   *

## 'మమ్మదర్'
## (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము ఫస్టుఫారం చదివే రోజులు స్కూలు తెరచి రెండు వారాలవుతుంది అప్పుడే కొత్త పుస్తకాలు తెప్పించి పాఠాలు మొదలు పెట్టారు ఆ రోజు మా యింగ్లీషు మాష్టారు, గ్రాండు మదర్ — అమ్మమ్మ, గ్రాండ్‌ఫాదర్ తాత అని చెప్పి రేపు అడుగుతామన్నారు మర్నాడు శంకర్‌ను నిలబెట్టి 'అమ్మమ్మ అంటే యింగ్లీషులో ఏమిట్రా?' అని అడిగాడు మనవాడు క్రిందటిరోజు రాలేదు వాడు లేచి "మమ్మదర్" సార్ అన్నాడు "మమ్మదర్ ఏమిట్రా" అని అడిగారు మాస్టారు 'అమ్మ + అమ్మ = అమ్మమ్మ కనుక మదర్ + మదర్ = మమ్మదర్ అని విపులీకరించాడు అప్పుడు క్లాసంతా గొల్లుమన్నారు ఇప్పటికి వాడు కనిపిస్తే "మమ్మదర్"' అంటూనే ఉంటాము

కె సాంబశివరావు (కలపాడు)

---

**కథ కాని కథల రచయితలకు**

**విజ్ఞప్తి**

రచయితలీశీర్షికకు కేవలం 'హాస్య సంఘటనల'నే పంపుతున్నారు నిత్యజీవితంలో చిత్రవిచిత్రాలైన సంఘటనలెన్నో తటస్థిస్తూ ఉంటాయి. వాటిని గురించి కూడా వ్రాస్తే బాగుంటుందని రచయితలకు మనవిచేస్తున్నాము

# మన రాజధాని పోట్కాడ

ఎం. యల్. సత్తి

నో స్తులారా

నేను ఇంతకుముందు మీకు హైదరాబాద్‌లో మొదటిరోజును గురించి చెప్పిన ఇప్పుడు నాకు ఇంకొంచెం ఫుర్సత్ (విశ్రాంతి) దొరికింది కాబట్టి నా రెండో రోజునుగురించి చెప్తాత వినుండ్రి

ఆగుండ్రి నా రెండో రోజును గురించి చెప్పే ముందట నా గురించి జెర్ర చెప్పాలె! మీలోపట కొందరు నన్ను వట్టి తెలివిలేనోన్నని అనుకుంటు న్నారు ఆ కాలంల రెండోది చదివినంటే ఈ కాలంల పదోది చదువుతున్న పిల్లగాండ్ల కంటే కూడా ఎక్కువ తెలివిగలోడ్నే! అప్పటి చదువు లకూ ఇప్పటి చదువులకూ ఎంతో ఫరక్ (భేదం) ఉంది ఇయ్యాల్ల రేపటి చదువులు వట్టి వాన కాలపు చదువులు ...గుకని మీరు నాకు కూడా కొద్దో గొప్పో తెలివున్నదని ఇకముందటి అనుకుంటరని ఆశపడుతున్న.

ఇక ఆ సంగతి పోనిచ్చి రెండోరోజు సంగతికి వస్తాం

నేను పట్నంకు వచ్చిన మొదటిరోజంతా మామ తోటి బస్సులల్ల, రిక్షాలల్ల తిరుగుట్లనే సరి పాయె! అందుకని ఆరోజు ఏమంత గమ్మతనిపియ్య



లేదు అందుకని రెండోరోజ నేనే ఒక్కళ్ళే పట్న మంత తిరిగొస్త నసుకొన్న ఆ సంగతి మామ నడిగిన ఆయన చాన మంచోడు కాబట్టి సరే పొమ్మని వో రూపా యిచ్చిండు అంతేగాక గొలిపుర లనే ఉన్న వో సైకిల్ టెక్సికి నన్ను తీసుకపొయ్యి ఆ టెక్సిమాలక్ ( యజమాని )తోటి నాకు ములా కాత్ ( పరిచయం ) చేయించిండు మా మామ లేకున్న కూడా నాకు సైకిల్ కిరాయికి ఇచ్చేటట్టు ఒప్పించిండు

* *

నేను సైకిలెక్కి తొక్కబోయే ముందు మామ నాకు కొన్ని జాగ్రత్తలు చెప్పిండు "సైకి లెప్పటికి రోడుకు ఎడమదిక్కే నడిపియ్యాలె ! ఎవరన్న అడ్డ మొస్తే గంటి బజాయించాలె కాని గంటి బజా యించకుండనే పక్కకేలి తీసుకపోవద్దు గంటిలేని సైకిల్లూ, వెనుక డేంజర్‌లైట్ లేని సైకిల్లు కిరాయికి తీసుకోవద్దు సైకిలు మెల్లగ తొక్కాలె జోర్‌తోటి తొక్కి ఎవరికన్న టక్కరిస్తే పోలీ సోల్లు పట్టుకుంటరు నడకుమీదుండే తెల్లలైను దాటిపోవద్దు అట్ల పోతే సైకిలు కోర్టుకి పోతది" అవన్నీ విన్నంక వాటిని గట్టిగ దిమాక్ ( మెదట్లో ) ల పెట్టుకొని సైకిలెక్కిన

నా సైకిలు సిమిటిరోడ్డుమీద మోట రురికి నట్టు ఉరుకుడు మొదలుపెట్టింది మా వూర్లె సైకిలు ఎంత జోర్‌తోటి తొక్కినా ఏనుగు నడిచి నట్టు మెల్ల మెల్లగా నడిచేది కాని ఇక్కడ నున్నటి రోడుమీద సర్రున జారిపోతంది

అట్ల తొక్కుకుంట చార్‌మినార్‌దాక వచ్చిన చార్‌మినార్‌కు ఎడమచెయ్యి దిక్కు పోలిస్‌ఠాన (స్టేషన్ ) ఉంది అందుకని దాని ముందటికేలి సైకిలు మెల్లగ తొక్కుకుంట పోయిన అది దాటం గనే రోడుకు రెండు దిక్కుల వెండి, బంగారం దుకా ణాలు శురువైనై జర్రదూరం పోయేవరకు ఒక చౌరస్తా (నాలుగు రోడ్ల కూడలి) వచ్చింది దాని నడుమ ఒక పెద్ద హౌజుంది దానిమీద చుట్టూరా ఇనుప పైపులునై ఆ పైపులకు చిన్న చిన్న పొక్కలునై ఆ పొక్కలల్ల కేలి నీళ్లు మీది చిమ్మిచ్చి పోస్తునై దానిపేరు "గుల్జార్ హౌజ్" అని ఒకాయిన చెప్పిండు ఆడ నిలబడి నాలుగు రోడ్ల దిక్కు చూసిన దిక్కు కొక్కటి చొప్పున నాలుగు కమాన్లు (ఆర్చి)నై అందుకని ఆ కమాన్ల నడుమున్నంత జాగను "చార్ కమాన్" అని పిలుస్తరట !

అట్లనే ముందటికి పొయ్యి రెండో కమాన్ (దానిపేరే మచిలీ కమానట !) దాటంగనే బట్టలు దుకాణాలు శురువైనై కొన్ని బట్టల దుకాణా లను దాటంగనే ఓ సంది వచ్చింది ఆ సందికి ముందట "నానక్‌రాం భగవాన్‌దాస్ సైన్స్ కాలేజ్ " అని ఒక పెద్ద బోర్డు రాసి పెట్టుంది ఆ సందిల కేలిపోతే ఆ కాలేజీ వస్తదని తెలుసుకున్న ఆ సందికి కుడిపక్క ఒక పెద్ద పోస్టాఫీసుంది దాని ముందట "జాబిలీ పోస్టాఫీస్" అని రాసుంది మూసీనదికి ఇవతలి దిక్కున బస్తీ లన్నిటికి ఈ పోస్టాఫీసే పెద్ద దట వచ్చే కారట్లూ, పొయ్యే కారట్లూ మొదట ఇండ్లకే రావాల్నట !

ఆ పోస్టాఫీసునూ, దాని పక్కకున్న బట్టల దుకా ణాలను దాటుకుంట వచ్చి నా సైకిల్ నయాపూ లెక్కింది ఆ పూల్‌మీద రెండు దిక్కులున్న ఫుట్ పాత్‌లమీద రకరకాల మనుషులు రకరకాల వస్తువు లను అమ్ముతున్నారు వాళ్ళను చూసుకుంట పోతున్నంతలో ఫుట్‌పాత్‌మీదున్న ఒకడు నన్నాపిండు ఏందని అడిగిన వాడిట్ల చెప్పిండు

"బాబూ, నేను ఈ వూరు చూసుటానికి వచ్చిన కాని ఎవడో నిన్న నా మనీపర్స్ కొట్టేసిండు అందు కని నేను ఆకలితో మాడిపోతన్న ఒకవేళ నువ్వు నా ఈ పెన్ను వో ఐదు రూపాయలకు కొంటే నేన బతుకత ఇది నేను ఇరవై రూపాయలకు కొన్న"

నేను ఆ పెన్ను చేతిలక తీసుకొని చూసిన మంచిగనే ఉన్నది అయ్యో, పాపం ! ఈయనక రాసుకునే పెన్ను అమ్ముకునే గతి పట్టింది గదరా! అనిపించింది ఆ పెన్ను కొంటే ఆయనకు జర్రనన్న మదత్ (సహాయం) చేసినట్లయి తదని నేను మా వూరుకేలి తెచ్చుకున్న పది రూపాయలకేలి ఐదు



డాక్టరు - (నడివీధిలో కను పించిన ఒక రోగితో) - ఏమయ్యా! మతి మరుపని ఒక్క-రోజు మందు పుచ్చుగుని, పూర్తిగా ఎగ్గొట్టేశావే ! ఇలా గయితే ఎలా తగ్గుతుందయ్యా నీ మతికురుపు ?

రోగి - లేదండీ! మర్నాడు వద్దామనుకున్నా గానీ మీ "డిస్పెన్సరీ" ఎక్క-దుందో మర్చిపోయా !

పి వెంకటరత్నం (చీపురుపల్లి)

ఆయనకిచ్చి పెన్ను తీసుకున్న ఇరవై రూపాయల పెన్ను ఐదు రూపాయల కొచ్చిందిరా, అని సంతోష పడ్డ

అట్ల నేను నయాపూల్ దాటి అఫ్జల్‌గం మీది కేలి గౌలిగూడా చేరుకున్న గౌలిగూడలో అన్ని ప్రింటింగ్ ప్రెస్‌లూ, ఫొటో స్టూడియోలే ఉన్నయా, అనిపించింది

గౌలిగూడా, చమన్, పుత్లీ బావులీ దాటి 'కోటి' చేరుకున్న కోటి రోడు చాన యెల్పుంది ఆ రోడుకు ఎడమదిక్కున్న ఫుట్‌పాత్‌మీద బతుకుతెరువు విద్య లన్నీ కనిపిస్తునై కొందరు గారిడ విద్య చేస్తు న్నరు కొందరు జ్యోతిషం చెప్తున్నరు కొందరు ఇస్పేటాకులతోటి పైసలాడుతున్నరు నాకు ఇస్పే టాట చూడా లనిపించింది అందుకని సైకిలు దిగి ఇస్పేటాట ఆడెటోన్ని చేరుకున్న

వాడు మూడు ఆకులను ఒక తెల్లటి బట్ట మీద పక్క పక్కకు పెట్టి అటూ యిటూ వాటి జాగలను బద్లాయించుతున్నడు ( మార్చుతున్నాడు ) ఆ మూడిట్ల ఒకదానిమీద "రాణి" బొమ్మంది "రాణి బొమ్మ ఈ మూడిటిలో ఎక్కడుందో దాని మీద మీరు ఎన్ని రూపాయలు పెడితే అన్నిటికి డబల్ నేనిస్త" అని అంటున్నడు చాలామంది పెడ్తున్నరు డబల్ రూపాయలు జితాయించు తున్నరు నేను నా దగ్గరున్న ఐదు రూపాయల కేలి రెండు రూపాయలు ఒక ఆకుమీద పెట్టిన వాడు దాన్ని తిప్పి చూపిండు అది రాణి బొమ్మే ! అప్పుడు వాడు దానిమీద పెట్టిన నా కాయితాల నోట్లు తీసుకొని నాలుగు రూపాయల బిల్ల లిచ్చిండు సంతోషంతోటి ఆ నాలుగు రూపా యలు తీసుకొని మల్ల ఆడకుండ (ఆడ్తే ఉన్నైన్న పోతయోనన్న భయంతోటి) సైకిలెక్కి ముందుకు పొగిపోయిన

నా దిమాక్లకు రకరకాల ఐడియాలు వస్తునైన్న ఈ పట్నం ఎంత మంచిది ! ఇక్కడ జర్ర దిమా కున్నోడైతే రోజుకు ఎన్నైనా రూపాయలు సంపా యించొచ్చు నన్నే చూడుండ్రి నయాపూల్ మీద ఐదు రూపాయలకు ఇరవై రూపాయల పెన్నూ, కోటికాడ రెండిటికి నాలుగు రూపాయలు సంపా యించిలి

ఇట్ల ఆలోచించుకుంట రెండు చౌరస్తాలు దాటి మూడో చౌరస్తా చేరుకున్నా ఆ మూడో చౌరస్తాకు కుడిదిక్కున్న రస్తామీది కేలిపోతే "కాచీగూడా" స్టేషను వస్తదట నేను ఇంక జర్ర ముందటికి పోయిన ఇంకొక చౌరస్తా వచ్చింది దాని నడుమ వో పెద్ద విగ్రహ ముంది దానికింద "రాజ బహ దూర్ వెంకట్రామారెడ్డి" అని రాసిఉంది

ఇంక అట్లనే సక్కగ రోడ్డు పట్టుకునిపోతే సికింద్రాబాదు వస్తదని తెలుసుకున్న

అక్కడ్నుంచి చౌరస్తాకు ఎడమదిక్కున్న రోడుకు తిరిగిన ఆ రోడు పట్టుకొని పోంగ పోంగ మల్లో చౌరస్తా వచ్చింది ఇదేంద్రా ఈ పట్నం నిండ చౌరస్తాలే ఉన్నయా అనిపించింది

ఇంతట్లనే కుడిదిక్కు వో పెద్ద బంగ్లా, ఎడమ దిక్కు కూడ వో బంగ్లా కనిపించింది కుడిది "హైద్రాబాద్ కేంద్ర చేనేత సహకార సంఘమని" ఎడమది "న్యూ సైన్స్ కాలేజ్" అని వాటి ముందట బోర్డులునైన్న

వాటిని దాటి ముందటికి పోయిన ఇక అడ్నుంచి రెండుదిక్కుల పెద్ద కాంపౌండు గోడలు శురు వైనై వాటికి అక్కడక్కడ గేట్లునైన్న ఆ గేట్ల కాడ నలుగురైదుగురు చొప్పున కాకీ బట్టలు తొడు క్కునోల్లున్నరు ఆ గేట్లకేలి చూస్తే లోపట పెద్ద పెద్ద బంగ్లాలూ, రకరకాల పండ్ల చెట్లూ, పూలచెట్లూ కనిపించినై అక్కడున్న వాళ్లల్ల ఒకా యన తోటి అదేందని అడిగిన ఆయన అవన్నీ మన రాజధాని పాత రాజు ఉస్మాన్ అలీఖానూ, ఆయన కుటుంబమోల్ల బంగ్లాలనీ చెప్పిండు

అవన్నీ దాటుకుంట కొంతదూరం వచ్చేవరకు "ఆబిద్‌రోడ్" ఒచ్చింది ఆ రోడుమీద సైకి లును చాన హుషార్‌తోటి పట్టుకొని నడిపిస్తున్న ఇంతట్లనే ఓ హోటల్ కనిపించింది ఆ హోటల్ చూసేవారకు ఏమన్న తినాలన్న బుద్ధిపుట్టి సైకిలు

(47-వ పేజీ చూడండి)

డి పద్మావతి వెంకటపతిరాజు



నేను పెళ్ళిచేసుకున్న కొత్తల్లో ఆయన అడవిలో క్రూరమృగాలను వేటాడిన వైనం వర్ణించి చెబుతూవుంటే నా కెందుకో కష్టంగానే వుండేది కానైతే రాను రాను నాలో వేటాడాలనే కోర్కె మేలుకొంది

ఈమధ్య ఒక మంచి రోజున మావార్ని నన్ను కూడా వేటకు తీసుకువెళ్ళమని అడిగాను అడగడం తడవుగా ప్రయాణం సిద్ధంచేశారు వారి స్నేహితుడు గురువు అయిన వ్యక్తి మూడో ఆయన ముగ్గురం జీపు వేసుకొని రెండు తుపాకీలు రెండు డజన్ల తూటాలు వారం రోజులకు సరిపడ్డ వంట సామగ్రితో సహా బయల్దేరి అల్లూరి సీతారామ రాజుగారు పితూరీ జరిపించిన రాజవమ్మంగి చేరుకున్నాం అక్కడనుండి నాలుగైదు మైళ్ళు కొండమీద ప్రయాణం చేయగా వాయ్యూరు గ్రామం కనిపించింది అదో చిన్న గూడెం పది పన్నెండు పూరి కొంపలు చుట్టూ ఎతైన పర్వత పంక్తి వాళ్ళకు నీళ్ళు కావాలంటే రెండువేల అడుగుల ఎత్తున కొండమీద మడుగులోగల పాతాళ గంగను ఆనపకాయ తుంబలతో ప్రతి రోజుతెచ్చి వాడుకొంటారు దాహంవేసి ఆ కొండలోవున్న వాగు చేరుకున్నాం కొలను గట్టున ఒక పెద్ద చెట్టు చెట్టువెంత తెల్లని పటిక రాతిబండ ఆ బండమీద చిత్రమైన జండా ఆకారంలో పేరుకుపోయిన నల్లని గుర్తు ఉన్నది ఆ గుర్తుని చూపించి సీతారామరాజు తెల్లదొరలమీద ఎత్తిన జండా పిడవడి అలా నల్లని రూపం ధరించిందని అక్కడివారు చెప్పగా అవునేమో అనిపించింది

కొంతసేపు సేద తీర్చుకొని తిరిగి ప్రయాణం సాగించాం కారుకోళ్ళు నెమళ్ళు లేళ్ళు దుప్పులు బొండు మేకలు చెవుల పిల్లులు అడుగడుగునా కనుపించాయి అడవిలో వాటి స్వేచ్ఛా విహారాన్ని నయనానందంగా తిలకిస్తూ కొయ్యూరు అనే గ్రామం చేరుకున్నాం ఆ గ్రామానికి ఇరువక్కలా తన్నని కొండలు కొండలను చీల్చుకొంటూ పరుగులెత్తే వాగులు అందులో కిలకిలా నవ్వుకుంటూ కనుపించే తెల్లని చేపలు—ఆ వాతావరణం నన్నెంతో ముగ్ధురాలిని చేసింది మురిసిపోతూ అక్కడ రెండు దినాలు ఎంతో హాయిగా ఆనందంగా గడిపాం. మావారు పులిజాడ తెలుసుకోవడానికి సర్వ విధాలా ప్రయత్నం చేస్తూనే ఉన్నారు ఇంతలో వాయ్యేడు నుండి ఒక కోయవాడువచ్చి వాళ్ళ గ్రామంలో జత కోడెదూడలను పులి చంపినట్లు తెలియజేశాడు అక్కడకువెళ్ళి ఆ భయంకరమైన దృశ్యం చూశాం రెండింటినీ గొంతుక ముడివద్ద కరచి, గుండెను చీల్చి రక్తం పీల్చి నానా బీభత్సంగా తయారుచేసి విడచి పెట్టింది



శ్రీమతి డి పద్మావతి వెంకటపతిరాజు

అడుగుల గుర్తులనుపట్టి మావారు వారి మిత్రుడు చిరుత పులిగా నిర్ధారణ చేసేశారు ఆ రాత్రి కాపుకోసం మాటు తయారు చేయించి, తిరిగి బసకు చేరుకున్నాం రాత్రి తప్పకుండా వచ్చి వాటిని తింటుందని గట్టి నమ్మకంవుంది రాత్రి సుమారు తొమ్మిది గంటలకు జీపు వేసుకొని బయల్దేరాం

మావారు జీపు నడుపుతున్నారు ఆయన మిత్రుడు నేనూ చెరోవేపున లైట్లు బిగించిన తుపాకులు పట్టుకొని కూర్చున్నాం జీపు మాటు కట్టిన ప్రదేశంవైపు వెళుతోంది లైట్లు ప్రకాశిస్తున్నాయి ఆ ప్రశాంత కీకారణ్యంలో వేయి కనులు చేసుకొని చిరుతపులికోసం వెతుకుతూ జీపులో ప్రయాణిస్తున్నాం

పులి కనిపిస్తే ఎక్కడ గురిచూసికొట్టాలో మావారు వరించి చెబుతున్నారు ఎప్పుడు కనిపిస్తుందా ఏం చేస్తుందా అనే ఆత్రుత నన్ను కలవరపెడుతోంది మాటుకట్టినప్రదేశం ఒక ఫర్లాంగు వుందనగా దారికడ్డంగా పడుకొన్న చిరుతపులి కళ్ళు ఆ లైట్ల కాంతిలో రెండుజ్యోతుల్లా మెరుస్తూ కనిపించినై నేను లేచి జీపు టాపు లేకుండావున్న గజం పట్టుకొని నిలుచున్నాను జీపు నెమ్మదిగా పోనిస్తూ పది పదిహేను గజాల దగ్గర వరకూ వెళ్ళి నిలబెట్టినారు చిరుతపులి నెమ్మదిగా లేచి వళ్ళు విరుచుకొని తోక ఆడించి కుడివైపునవున్న చింతచెట్టు చాటువకుపోయి నిలుచుంది (మా వార్నైతే అక్కడే కొట్టివుండేవారేమో!) నాకు చిరుతపులి తల మాత్రం కనిపిస్తోంది కళ్ళు మెరుస్తున్నై—తుపాకీ ఎత్తి గురిచూసి పేల్చాను. దెబ్బ తప్పిపోలేదు సరిగ్గా రెండు కళ్ళ మధ్య తగిలింది కన్నుమూసింది మావారి ఆనందానికి అవధుల్లేవు నా మాట సరి!

చచ్చిన చిరుత పులిని జీపులో వేసుకొని వాయ్యూరు గ్రామంలో అందరికీ చూపించి ఇల్లు చేరుకున్నాం

తల మౌంటుచేసి మా డ్రాయింగు రూములో పెట్టుకున్నాం ఈసారి నువ్వే పెద్దపులిని కొట్టాలి అప్పుడుగాని నాకు సరిగా నిద్రపట్టదు అని మా వారు రోజూ కలవరిస్తూంటారు ఆయన కలవరింతలు విని నాకూ కొట్టాలనే ఉత్సాహం పుట్టుకొస్తోంది వచ్చే వేసవిలో ఆ కోరిక ఫలిస్తుందేమో!





# వనితా వాణి

## జీతంలేని పరిచారిక

ఈ వారము వనితావాణి శీర్షికలో కె. అనసూయాదేవిగారి 'జీతంలేని పరిచారిక' నా కెంతమాత్రమూ నచ్చలేదు 'సాయంత్రందాకా గృహకృత్యాలతో మునిగిన భార్యకు భర్త సేవ చేయాలంటే ఆ ప్రాణి ఎంత బాధపడ్తుందో ఆలోచించండి అని ఆమె వ్రాశారు భర్త పగలంతా ఆఫీసులో కష్టపడటం లేదా ? తన భార్యాబిడ్డలకోసం అంత చాకిరీ చేసి ఇంటికొచ్చిన భర్తకు సేవచేయడములో బాధ కలుగుతుందా ? మన వనితావాణి సోదరీమణులలో భర్తకు సేవచేసే భార్యలు ఎంతోమంది ఉంటారు వారికి భర్తసేవలో బాధ తెలుస్తుందంటారా ?

ప్రొద్దున ఐదు గంటలు మొదలు సాయంత్రము ఆరు గంటలదాకా యింటి పనులలో మునిగి తేలిన ఇల్లాలు సాయంత్రము భర్త రాకకొరకు ఎందుకు అంత ఆశగా, ఆతృతగా ఎదురుచూస్తూ ఉంటుంది ? భర్తను చూసిన వెంటనే తన శ్రమనంతా మరచిపోయి మొహము కడుక్కోటానికి నీళ్ళు, సోపు, టవలు ఎందుకు అందిస్తుంది అంటారు ? అదంతా చాకిరీయేనా ? ఆ పరిచర్యల్లోనే ఆనందాన్ని అనుభవించే మహిళలు ఎంతమంది లేరు వారంతా పరిచారికలే నంటారా ?

భర్తకు చేసే సేవకు జీతంలేని పరిచారిక అవటం సమంజసంగా లేదు తన బావగారు భార్యను కష్టపెడుతున్నారుగదా అని మగవారు అందరూ అలాంటివారే ఉంటారా ?

పనిమనిషికి నెలకు మహా అయితే పది రూపాయలిచ్చి చాకిరీ చేయించుకొంటాము భార్య ఖర్చు నెలకు పది రూపాయలతో అయిపోతుందా ? కనీసము ఒక్క చీరకు పదిహేను రూపాయలు పెడ్తున్నామే ! ఇదంతా జీతంలేని పరిచారికలకు ఎలా వస్తుందంటారు ? పరాయివారికి చాకిరీ చేయడము లేదుగా తాళిగట్టిన భర్తకు తన రక్తముతో పుట్టిన బిడ్డలకు సేవ చేయడము భారత వనితయొక్క ధర్మము తన యింటికి చేసే పనులకు జీతములేని పరిచారిక చేసే చాకిరీ అనుకోటం ఎంతమాత్రమూ బాగుండలేదు నేనేదో మగవారిని వెనకేసుకొచ్చి రాస్తున్నానని సోదరీమణులు భావించకూడదని ప్రార్థిస్తున్నాను

శ్రీమతి శిరివేలు రమణాదేవి ( చిత్తూరు )

* * *

కె. అనసూయాదేవిగారు వ్రాసిన "జీతంలేని పరిచారిక" అనే వ్యాసం చదివాను అందులో వారు "మగవారి కంటె ఆడవాళ్లకు పని, శ్రమ యెక్కువ ఉదయంనుంచి సాయంకాలం వరకు గృహ కార్యాలలో మునిగి తేలుతూన్న స్త్రీకి భర్తకు గూడ సేవచేయాలంటే ఆ ప్రాణి ఎంత కష్టపడుతుందో ఆలోచించండి" అని హైందవ సంప్రదాయమునకే విరుద్ధమయిన వాక్యము వ్రాయడం శోచనీయం

భర్తకు సేవ చేయడం పతివ్రతయైన స్త్రీ విధి ఈ విషయమున "భారతస్త్రీ" ప్రపంచమున ఒక ఉత్కృష్టస్థాన మాక్రమించి ఉన్నది అటువంటప్పుడు "భర్తకు కూడ" సేవ చేయాలంటే స్త్రీకి కష్టమని ఈ సోదరి వ్రాయడం బాగాలేదు భర్తకు తప్పితే ముఖ్యంగా 'సేవ' చేయవలసిం దెవరికి ? నా దృష్టిలో భర్తను గూర్చి చేసే పనులు "సేవలు" అనిపించుకోవు అవి అనురాగమునకు, ప్రేమకు కార్యరూపములు అయినా భర్తకు "సేవ" చేయడంవల్ల తాను ధన్యురాల నగుదుననే ఆధ్యాత్మిక దృష్టితో తా నా పనులను చేయవలసి ఉన్నది ఇట్టి దృష్టిని కలిగి ఉండడమే 'భారత నారి' కి ప్రపంచమున విశిష్టస్థాన ముండుటకు కారణము

అదే వ్యాసంలో "ఎంత భర్త అయితే మాత్రం జీవితాంతం సేవ చేయాలంటే ఏ వనితకు కష్టం అనిపించదు ?' అన్నారీ సోదరి ఇది భారత స్త్రీ జాతికే అవమానం "పతియే ప్రత్యక్ష దైవము" అని నమ్మిన భారతస్త్రీ "ఎంత భర్త అయితే మాత్రం" అని ఎంతమాత్రం అనుకోదు తన బావగారిని దుయ్యబడుతూ మొదలుపెట్టిన తన వ్యాసంలో ఈ సోదరి అవమానకరమైన పద ప్రయోగం చేయడం విచారకరం

శ్రీమతి ఎం వెంకటలక్ష్మి ( మద్రాసు )

* * *

కె. అనసూయగారు వ్రాసిన 'జీతంలేని పరిచారిక' చాల బాగున్నది విద్యావంతులై, నలుగురిలో తిరిగే పురుషులలో ఇంకా ఇలాంటి అల్పగుణం ఉన్నదంటే నమ్మలేని విషయం అలా అని క్రూరంగా ప్రవర్తించేవారు లేరనను అలాంటి కుటుంబాలు చూస్తుంటే, నరకమంటే ఇదేనేమో అనిపిస్తుంది భార్య బానిసగా, పరిచారికగా భావించేవారికి ఈ వ్యాసం బాగ ఉపయోగపడుతుంది

అందరూ ఇలాంటివారే అయిఉంటారని కాదు దాంపత్యజీవితంలో భార్య భర్తకు, భర్త భార్యకు ఉపచారములు చేసుకోవచ్చు అందులో తప్పుగా భావించేది ఏమిలేదు ఈ రోజుల్లో భర్త ఉద్యోగస్తుడైతే పెండ్లి అయిన వెంటనే దూరప్రదేశాలలో వంటరికాపురం పెట్టాలి అలాంటప్పుడు భార్య అనారోగ్య కారణంగా లేవలేకపోతే కాసిని మంచినీళ్ళు యివ్వడం కూడా పరిచర్యగా భావించితే ఇక ఆమె పరిస్థితి ఎలా ఉంటుంది ? ఏ స్త్రీ కూడ తన శక్తి ఉన్నంతవరకు భర్తకు సేవ చేయాలనే కోరుతుంది ఆ సేవ కూడా ప్రేమ, అనురాగం చూపగల భర్త అయితే చేయగలదే గాని, బానిసగా భావించి అధికారం చలాయించే భర్త అయితే ఆనందంతో చేయలేదు అలాంటి పరిచర్యలలో ఆమెకు తృప్తి ఉండదు అతడూ ఆనందం పొందలేడు.

వసంతానారాయణ ( పాండిచేరి )

* * *

కె. అనసూయాదేవిగారు వ్రాసిన 'జీతంలేని పరిచారిక' చాలా బావుంది వారు వ్రాసినట్టు ప్రాణంగా చూసుకొనవలసిన పత్నిని హింసించడము సహించరానిది తాను తెలివిగా వ్యవహరించుకుంటూ భార్యలోని లోపాలను సరిదిద్దుకోవాల్సిన బాధ్యత పురుషునిదే" అన్న మాటలు మరుపురానివి ప్రతిస్త్రీ భర్తనుండి ఆశించేది అనురాగము వారి దాంపత్యము ఆదర్శప్రాయంగా వర్ధిల్లాలని కోరుకుంటుంది కాని దానికి వ్యతిరేకముగా పురుషుడు భార్యను బానిసగా చూడడంవలన వారి హృదయాలు ఎంత కుమిలిపోతాయో గ్రహించరు భర్త తన భార్యను పరిచారికవలె చూడక ఆమె కష్టసుఖాల్లో పాలు పంచుకొనిన వారి జీవితము చిలుకా గోరింకలా అన్యోన్యంగా, ఆదర్శంగా ప్రశాంతసాగరములో నౌకవలె సాగుతుంది మగవారు వారి జీవితం ఆనందమయము కావలెనన్న, వారి భార్యలను సుఖపెట్టాలి

కుమారి అరుణ (హైదరాబాద్)

## చిలకా - గోరింకా

శ్రీమతి వేమూరి సుబ్బులక్ష్మిగారి వ్యాసం చాలా బాగుంది వారికి నా ధన్యవాదాలు "పత్రిక" ద్వారా అందజేస్తున్నాను కాని ఇలా ఏదోవిధంగా మగవారిని ఆడిపోసుకోవడం ఏమీ బాగాలేదు మావారు నన్ను ప్రతిసినిమాకు ఆయనతోనే తీసుకువెళ్తారు.

వాడ్రేవు రమణి (రాజమండ్రి)

* * *

శ్రీమతి వేమూరి సుబ్బలక్ష్మిగారు వ్రాసిన "చిలక — గోరువంక" చాలా బాగాఉన్నది భర్త భార్యతో ఎంతో అన్యోన్యంగా ఉన్నప్పటికి చిన్న చిన్న కోర్కెలను నెరవేర్చుటకు అంగీకరింపరు

మా శ్రీవారికి గూడా నాతో సినిమాలకి రావటమంటే గండంలా బాధపడతారు ఇద్దరం వెళ్లడం సరదా నాకు ఒక్కరు వెళ్లడం సరదా వారికి ఈ విషయానికి నాకు వారికి కీచులాటలు చాలా సార్లు వచ్చాయి

పి రమణాదేవి (టెక్కలి)





# ఆదర్శాలు ఆంతర్యాలు

## సింగరాజు లింగమూర్తి

### జరిగిన కథ

పోలయ్య అంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం కొంతమందికి అతనిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు. నరసింహప్ప చలమయ్య ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు. నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు. పోలయ్యకు, నరసింహప్ప పెద్దకూతురు ఇందిరకు రాజారావు ట్యూషన్ చెబుతూ ఉంటాడు. ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది. నరసింహప్ప రాజారావు ట్యూషన్ మాన్పిస్తాడు. పాఠశాల వారికోత్సవానికి వచ్చిన మంత్రి ఎన్నికలలో పోటీ చెయ్యమని రాజారావుకు సలహా ఇస్తాడు.

మంత్రిగారు వచ్చి వెళ్ళిన తర్వాత ఊళ్ళో ఒక విధంగా రాజకీయ మంత్రాంగాలు ఎక్కువైనాయని చెప్పవచ్చు. ఆయన నరసింహప్ప ఇంట్లోనే దిగడం బహిరంగోపన్యాసంలో రాబోయే ఎన్నికలలో కాంగ్రెసుకు జయము చేకూర్చాలని గ్రామస్థులను ఉద్బోధించడం చలమయ్యదొర వర్గానికి అసూయతోపాటు జిగీషనుకూడా పెంచాయి.

చలమయ్య మొదట్లో నరసింహప్ప ఉన్న పార్టీనైపే! నరసింహప్పతో మనస్పర్థ లేర్పడటం వల్లనైతేనేమి, సామ్యవాదసిద్ధాంతాలమీద గురి ఏర్పడినట్లు నటించవలసి రావడంవల్ల నైతేనేమి మరొక పార్టీలో చేరాడు. బ్బున్నవాడు ఏ పార్టీలో చేరినా తొందరలోనే ప్రముఖస్థానం వహిస్తాడు. డబ్బు ఉంది కాబట్టి ఏదో ఓ పార్టీని ఆసరా చేసుకొని అందులో తనచుట్టూ ఒక వర్గాన్ని ఏర్పరచుకొని అంచె లంచెలుగా ఉన్నతస్థానా లందుకున్నవాళ్ళు అన్ని పార్టీలలోనూ ఉన్నారు. కాకపోతే పాలనాధికారం ఒక పార్టీది కాబట్టి ఎప్పుడూ పూరూ, పేరూ వినని వాళ్ళు అదృష్టవశాత్తు హఠాత్తుగా పైకి రావడం కనిపిస్తుంది. మిగతా పార్టీలకా అధికారబలం లేదు కాబట్టి పార్టీల్లోని వారి ఖ్యాతి పైకి కనుపించదు. పార్టీలో తమ స్థానాన్ని బలపరచుకొని ముందుకు పోవడం మాత్రం పరిశీలిస్తే కనిపిస్తుంది. అలాగే చలమయ్య చీలిపోయి మరొక పార్టీలో చేరడం అనతికాలంలోనే ప్రముఖస్థానం వహించడం జరిగింది. రాబోయే ఎన్నికలలో జిల్లాలో తమ అభ్యర్థులను ఎక్కువగా గెలిపించాలనీ, తన నియోజకవర్గంలో నరసింహప్పను ఓడించి తాను గెలవాలని చలమయ్య పాచికలు వేస్తున్నాడు. స్వాతంత్ర్యదినోత్సవాన్ని ఆలంబనం చేసుకొని పలుకుబడిగల మంత్రిని నరసింహప్ప ఆహ్వానించి సన్నగిలుతున్న తన పలుకుబడిని పునః సంపాదించుకొనడానికి ప్రయత్నించాడని చలమయ్యకు పుండుమీద కారం చల్లినట్లయింది.

ఆ మరునాడు చలమయ్య అలివేణి ఇంట్లో ఒక అర్జంటు సమావేశం ఏర్పాటు చేశాడు

చలమయ్యకు కుడిభుజంగా ఉండే కరణం, చలమయ్య మురాలోని మరికొందరు సమావేశానికి హాజరైనారు అందరూ టీలు త్రాగి, సిగరెట్లు బీడీలు ముట్టించారు

"మంత్రిగారు ఏర్పాటు చేసిన విందుకు నరసింహప్ప రాజారావును పిలవడం, అతను వెళ్లడం చిత్రంగా ఉంది" అన్నాడు చలమయ్య

"నరసింహప్ప ముందర కాళ్లకు బంధాలు వేసే రకం" అన్నాడు రంగపాండు

"అదేమీ కాదర్రా ! మంత్రిగారికి రాజారావుకూ మొదటినుంచీ పరిచయం ఉందట మంత్రిగారే స్వయంగా రాజారావును తనతో పాటు విందుకు రమ్మంటుంటే నరసింహప్ప ఏంచేస్తాడు—ఇష్టంలేకపోయినా రాజారావును పిల్చి ఉంటాడు పోలాయి ఈ విషయం మహా ఘనంగా చెప్పుకుంటున్నాడు" అన్నాడు కరణం

"అసలు నరసింహప్పకు మనుష్యుల్ని కూడ కట్టుకోవడ మేం తెలుసులెద్దూ" అన్నాడు చలమయ్య

"అంత సేతకాకపోతేనే కాంగ్రెసు కమిటీకి ప్రెసిడెంటు అయినా డంటారా ?" గిరజాలు వ్రేళ్లతో దువ్వుకుంటూ అన్న దింకో కంఠం

"నువ్వూరుకోరా చంద్రిగా నేను మాట్లాడ మన్నప్పుడు చెబుదువుగానిలే" మందలించినట్టుగా చలమయ్య సణిగాడు

ఓ క్షణం ఎవరూ మాట్లాడలేదు

"ఒకవేళ మంత్రిగారు రాజారావుకూ, నరసింహప్పకూ మధ్యవర్తిగా ఉండి రాజీ కుదిర్చారేమో" అన్నాడు కరణం

"పెద్ద వ్యవహర్త నంటావు వెంటనే ఆ సంగతి ఆచూకీ తియ్యవద్దటయ్యా" ఎద్దేవాగా అన్నాడు చలమయ్య

మంచిగా మాట్లాడుతున్నట్టే ఉండి మధ్యలో పెళుసుగా మాట్లాడటం, ఎద్దేవా చెయ్యడం చలమయ్య స్వభావం దానివల్ల ఇతరులకు కోపం కలిగినట్లు పసికడితే వెంటనే అతణ్ణి అందల మెక్కించి నట్టు మాట్లాడుతాడు ఇప్పుడు చలమయ్య అన్నమాటలు కరణానికి కష్టమే కలిగించాయి కోపంతో కనుబొమలు ఎగురవేశాడు ముఖం ఎర్రజేసుకున్నాడు కరణం ముఖలక్షణాలు గమనిస్తూనే ఉన్నాడు చలమయ్య తగిన సమాధానమే ఇస్తాడని జంకాడు నోరు జారినతర్వాత చేసేదేమిటి అనుకొని ప్లేటు ఫిరాయిద్దా మనుకుంటున్నాడు ఇంతలో కరణం అననే అనేశాడు

"నేను వ్యవహర్తను కనుకనే మీరూ ఉండగలిగారు లేకపోతే " అని

"ఏదో తమాషాకు అంటే అదే పట్టుకు కూర్చుంటావేమయ్యా నీ ఇల్లు బంగారంకాను నీకు కోపంవస్తే నాకే మంచిది నిమిషంమీద తేల్చుకుంటావు—రాజారావుకూ, నరసింహప్పకూ రాజీ కుదిరిందీ లేనిదీ" నవ్వుతూ అన్నాడు చలమయ్య

ఇంకేం మాట్లాడతాడు కరణం

"పోలాయి ఏమంటున్నాడురా చంద్రిగా" కోరమీసం మెలివేస్తూ ప్రశ్నించాడు చలమయ్య

"ఆడు మా మిడిసిపడుతున్నాడు దొరా ! ఏడా కూలినాలీ సేయకుండా పంతులు తానే ఉండె పైగ ఆయన సదువుకూడ సెప్తుండె ఆడికేం దొరా—పరీచ్చలు గూడ రాస్తడంట ఎల్లి" అన్నాడు చంద్రిగాడు

"వాడూ, పంతులు మనవైపుంటేనా, నరసింహప్పను ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించనూ" దర్పంగా అన్నాడు చలమయ్య

"ఈ ఎలచ్చన్లు ఒస్తున్నాయనేనా—నరసింహప్పదొర ఇంట్ల పంతులుసేత సదువు చెప్పుడు మానిపించిండ్రు" అన్నా డొకడు

"తననుగురించి పొగుడుతూ ఏవేవో దొంగ రాతలన్నీ రాసి పత్రికలకు పంపించమన్నాడుట రాజారావు రాయననేప్పటికి ప్రైవేటు మానిపించాడుట" రంగపాండు అన్నాడు

"ఇంకో కారణం కూడా ఉంది" అన్నాడు కరణం

"ఏమిటది ?" అన్నట్లు అంతా ఆయనవంక చూశారు

"ఏపుగా ఎదిగిన ఆడపిల్లలికి పెళ్లి పెటాకులు కానివాడు ప్రైవేటు చెబితే ఏం జరుగుతుందీ ?" సాగదీస్తూ అన్నాడు కరణం

---

పబ్లిక్ ప్రాసిక్యూటరు - ఈ ముద్దాయిని చూడండి మహా సాధువులా కనిస్తున్నాడా... ఒక నిండు చూలాలిని నరికి....

ముద్దాయి - నాను సంప స్టేదోక్ష ఆక్టే పేలావంటే దాన్లాగే నరికి పోగెడతా.

పి వెంకటరత్నం (చీపురుపల్లి)

---

"నే ననుకుంటూనే ఉన్నాలే ఊఁ ఏం జరిగిందేమిటి ?" ఉత్సాహంగా అడిగాడు చలమయ్య

"ఏమీ జరగలేదనే అనుకుంటాను ముందుగానే జాగ్రత్తపడి నరసింహప్పగారు రాజారావును మాన్పించేశాడు నాల్గు రోజులు కళ్లు మూసుకుంటే ఏమయ్యేదో ?"

"ఉహూ నేను నమ్మను నువ్వేదో ఇంకా దాస్తున్నావు" అన్నాడు చలమయ్య

"ఏదో గాలికబురు దాసీవాళ్లు అనుకుంటుంటే తెలిసింది పెద్దమ్మాయి రాజారావును రంగంలోకి దించిందని" అన్నాడు కరణం

"నీనోట్లో చక్కెర పొయ్యా—భలేసంగతి చెప్పావయ్యా ఒకే దెబ్బకు రెండు పక్షులు ఇటు రాజారావునూ, అటు నరసింహప్పనూ మనం ఎంతైనా సాధించవచ్చు" చిటికలువేస్తూ అన్నాడు చలమయ్య

"మన రాజకీయ ప్రయోజనాల కోసం గాలి దుమారం లేపి, ఆడవాళ్లను బయటకు లాగి అల్లరిపాలు చేయడం మంచిది కాదనుకుంటాను" అన్నాడు కరణం

"ఏం — [illegible] దగ్గర నీతిపాఠాలు నేర్చుకుంటున్నావా ?"

"అదేమీ కాదు మనం చూడని విషయాల్ని గురించి గోరంతలు కొండంతలు చేయడం మంచి దంటారా ? మనకూ ఆడపిల్లలున్నారు"

"చాల్లేవయ్యా—మహా కబుర్లు చెబుతున్నావు. మన పిల్లలు అటువంటివాళ్ళేం కాదు అది బాగా మదమెక్కి ఉంది మొగుడు అమెరికాలో ఉండె ఏంచేస్తుంది మరి — రాజారావుమీద కన్నేసి ఉంటుంది రాజారావు పైకి మహా నీతులు చెబుతాడులే, నీతులు ఇప్పుడు తెలుస్తుంది చలమయ్యదొర అంటే ఏమిటో ?" అంటూ చలమయ్య సిగరెట్ దమ్ము గట్టిగా లాగి వదిలాడు

"రామాయణంలో పిడకల వేటలా ఈ విషయం ఎందుకుగానీ, అసలు విషయం మాట్లాడుకుంటే బాగుంటుంది" అన్నాడు కరణం

"ఇదిగూడా తోసిపారేయాల్సిందేమీ కాదు. ముందు మనం చేయవలసింది రాజారావుకూ—నరసింహప్పకు పొత్తు కలవకుండా చూడడం ఒకవేళ ఇద్దరిమధ్యా రాజీ కుదిరితే దాని దుంప మొదలంటా త్రెంచడం" అన్నాడు చలమయ్య

"దానికేం — అది జరుగుతుం దనుకోండి అసలు ఊళ్లో మన పార్టీ పలుకుబడిని ఇప్పటి నుంచే పెంపొందించాలి పదిమందికీ మనమీద నమ్మకం, గౌరవం ఏర్పడేటట్లు చూసుకోవాలి. ఈ విషయం ఆలోచించండి" అన్నాడు రంగపాండు

"అందుకేగా — మిమ్మల్ని అందరినీ పిలిపించింది" చలమయ్య దీర్ఘంతీస్తూ అన్నాడు

"ముందు మనం, కూలీజనాన్ని కూడగట్టుకోవాలి వాళ్లను కూడగట్టుకోవాలంటే, వాళ్లకు లాభంకలిగించే పంథా ఒకటి ఏదైనా అవలంబించాలి మీ పార్టీ !" అన్నాడు కరణం

"నీ ఇల్లు బంగారంకాను, అదేమిటయ్యోయ్ 'మీ పార్టీ' అంటున్నావు ?" అన్నాడు చలమయ్య

"అవునుమరి నేను మీ మురాలోనివాడినే గాని, మీ పార్టీవాడి నెందు కవుతాను ప్రభుత్వోద్యోగులకు పార్టీలతో ప్రమేయం ఉండకూడదుగా" అని నవ్వుతూ కరణం కళ్లు చికిలించాడు

"అమ్మో! కరణంగారిది మా లా పాయింటండీ దొరగారు" అన్నాడు చంద్రయ్య

"అది సర్లే గాని వెంకటప్పయ్యా—కూలీ వాళ్లకు లాభం కలిగించే పంథా ఏమిటో కూడా నీవే చెప్పవయ్యా — ఊరికే నాన్చక "

"ఏముందీ వాళ్లందరికీ సంతర్పణచేసి, తలో జత బట్టలు ఇస్తే సరి" అన్నాడు రంగపాండు

"దీనివల్ల కూలీలకు పెద్ద ప్రయోజనం కలిగేదేమీ లేదు వాళ్లకు నాలుగు డబ్బులు కలిసొచ్చేట్టుగా ఉండాలి, మన పబ్బమూ గడవాలి" అన్నాడు కరణం

"ఓయి మహానుభావా, ఆ మార్గమేదో నీవే చెప్పవయ్యా — చంపక" అన్నాడు చలమయ్యదొర, దర్పమూ, ప్రాధేయపడడమూ మిళాయించి

"ఏమిలేదు మన ఊరిమిల్లులో పనిచేసే కార్మికులక కరువుభత్యం పెంచాలనీ, సీనియార్టీ

(46 వ పేజీ చూడుడు)

# గృహ పరిశుభ్రత

ఇంటినిచూచి ఇల్లాల్ని చూడమన్నారు మనపెద్దలు ఇంటి శుభ్రతనుబట్టి అలంకరణనుబట్టి ఆ ఇంటి ఇల్లాలి మనస్తత్వం అభిరుచి కొంతలో కొంత తెలుసుకోవచ్చు ఒక వ్యక్తికి ఒంటి శుభ్రత, అందం, అలంకరణ ఎంత అవసరమో ఒక కుటుంబానికి కూడ ఇంటి శుభ్రత అంత అవసరం

వంటపనిలోను, తోట పనిలోను మరి ఏ ఇతర శారీరక శ్రమతో కూడిన పనులలోను అలిసి, సొలసిన వ్యక్తి శుభ్రంగా స్నానంజేసి, మంచి బట్టలు వేసుకొని చల్లగాలికి కూర్చుంటె ఎంత హాయిగా, రిలీఫ్‌గా ఉంటుందో—ఆఫీసులో రోజంతా చచ్చిచెడి చాకిరిచేసో, లేక రోజంతా ఏ స్కూలులోనో, కాలేజిలోనో కాలం గడిపి విసిగి వేసారి ఉసూరంటూ ఇల్లు చేరుకునే వ్యక్తికి శుభ్రంగా, శుచిగా అందంగా ఉన్న తన ఇంటిలో అడుగుపెడ్తే అంత హాయిగాను, సంతోషంగాను ఉంటుంది ఆ బాధ్యత ముప్పాతిక వంతు స్త్రీదే

అసలు ఇంటిశుభ్రతలోను, అలంకరణలోను ఇంటిలోని ఏ ఒక్కరో శ్రద్ధ తీసుకొంటె ఫలితం శూన్యమే ఇలా ఈవిడ శుభ్రంగా సర్దిపోతే అలా అతను మరలా యథాస్థితికి తీసుకవస్తారు ఎవరు తీసిన వస్తువులు వారు అదే స్థలంలో పెట్టేస్తే అసలు సర్దడమంటూ ఉండదు భార్యా, భర్త, పిల్లలు అందరూ భాగం పంచుకొంటేనే అది ఒక ఇల్లు—అది ఒక కళాను

"ఆఫీసు టైం అయింది దువ్వెనేది? ఏనాడు అవసరానికి వస్తువు కనపడదుగా?" శ్రీవారి హుంకరింపు డ్రస్సింగ్ రూంలోనించి "మరే అన్నీ నేనే పారేస్తున్నా చిట్టి చేతుల్లో ఉండాలి అడగండి" శ్రీమతి చిరాకు వంటింట్లోంచి "అమ్మా నా పెన్ ఏదీ ఇపుడేగా పందిరిమంచంమీద పెట్టేను?" చిన్నపాప ఏడుపు గొంతు శ్రీవారు చిట్టిని చెవులుపట్టి లాక్కొచ్చి దువ్వెన వెతికించడం—చిన్నపాప పందిరి మంచాన్ని తల్లక్రిందులు చేసి పేనా వెతుక్కోవడం—ఇంట్లో ఒక్కటే గొడవ—తీరా ఆఫీసు టైమ్‌కి శ్రీవారు నరసింహావతారమెత్తి, కోపగించి, పిల్లల్ని నాలుగు అంటించి—ఆఫీసు చేరుకోవడం ఇటువంటివి సర్వ సాధారణాలు మన ఇండ్లలో ఎవరు తీసినవివారు శ్రద్ధగా అమరుస్తే వెతుక్కునే బాధే ఉండదు తద్వారా ఇంట్లో అశాంతి రేగదు

భర్త సాయంకాలం ఇల్లు చేరేటప్పటికి భార్య ఒంటితోపాటు ఇంటిని కూడ శుభ్రపరచి, అలంకరించుకొని, భర్తకి సంతోషాన్ని కలిగించడం విధి కొందరు ఆఫీసునుంచి వస్తూనే హాలు దగ్గర నుండి సర్దుకురావడం మొదలుపెట్తారు తెరిచిన బీరువాలు మూయడం—పుస్తకాలు సర్దడం—ఒకటేమిటి హాల్‌నుండి వంట గది వరకూ ముందు సర్ది ఆపైన బట్టలు మార్చుకొని ఉసూరంటూ వాలిపోతారు కుర్చీలో భార్యలమీద ఆశ వదులుకొని—ఆపని తామె నిర్వహించుకొంటారు కొందరున్నారు చూడండి—బ్రష్‌మీద పేస్ట్ వేసి ఇవ్వడం మొదలుకొని రాత్రి పండుకోబోయేముందు దుప్పటి కప్పించుకునే (కప్పుకోవడం బద్ధకం వాళ్ళకు వరకు భార్య చేస్తే గాని వాళ్ళకు వాళ్ళ పురుషత్వం నిలుపుకొన్నట్టుండదు ఆవిడ వంటింట్లోసతమతమవుతున్నప్పుడు చివరికి పిల్లాడు సిరా దొర్లించుకొంటున్నా తనకు పట్టనట్టుంటారు అవే ఒకరంటె ఒకరికి ద్వేషం పెరగడానికి తోడ్పడతాయ్.

సరే—మన ఇంటి శుభ్రత, అలంకరణ మనకే కాక—ఇంటికి వచ్చే విజిటర్సును ఎలా సంతోషపరుస్తాయో చూద్దాం మా టీచర్ అడిగేరుకదా

'మనం ఇంటిని ఎందుకు అందంగా ఉంచుకోవాలి?' అని ఒక అమ్మాయి టకీమనిలేచి 'ఎవరంటె వాళ్ళు ఎప్పుడంటే అప్పుడు వస్తూంటారు కాబట్టి యిల్లు సదా నీటుగా ఉంచాలి" అని చెప్పింది.

(44-వ పేజీ చూడండి)

ఎప్పుడూ ఇంతే - 93 శంకర్





# గిరీశం ఉపన్యాస భాషణాలు

క్రట్ కట్ కట్ కట్ కట్కత్కత్కట్ !

నో నో సార్ ఇజ్జాస్తి—ఏమీన్, సెన్సారువాళ్లి జ్జాస్తే ఇంకేమన్నా ఉందా సార్ ! కొంపలు మునిగి పోవూ ? మళ్లీ ఇంకో టేక్ తీద్దాం ఆ కాఫీ కప్పు అందించినపుడలా వేళ్ళు తగల్నీకండి జాగర్త మీ దెంత మేనరికవైనా ఇంకో రెండు రీళ్లలో మీరెంత దీనిగా ఎంత ఫెళ్ళుమనేలా పెళ్లాడ బోతున్నా ఈ రీల్లో అలా ఒకళ్ల నొకళ్ళు తాక్కో కూడదు కాఫీ ఇస్తున్నపుడేనా సరే వళ్ళు తగిలితే వెంటనే ఛీ ధూర్తుడా ! అవివాహిత భారతబాలి కను తాకుతావా ? అని మేనకోడలు అనాల్సి వస్తుంది లేపోతే ఇద్దరూ అగ్నిప్రవేశం చేసి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి లేకపోతే సెన్సారు వారు ఒప్పుకోరు రీలు తగలేయించేస్తారు దగ్గి రుండి

నో సార్ నో యస్సార్ యస్ మీరు చూళ్లేదా ? కొత్త సెన్సారింగు సర్కులూ ? కొత్త రూళ్లుకర్ర లొచ్చాయి పెళ్ళికానివా రిద్దరు ఒకళ్ల నొకళ్ళు ముట్టేసుకోకూడదు యస్ నో డూయెట్ డాన్సెస్ నో లవ్ సీన్స్ ప్రేమపాటలు తీసినా మన సినిమాలను పురాతన పద్ధతుల్లోనే తీయాలన్నమాట అనగా ఆవిడ పాంగు మొద లెట్టి పరిగెడుతుంది పాదలచుట్టూ, దుబ్బుల చుట్టూ, కుర్చీలచుట్టూ, స్తంభాలచుట్టూ— హీరోగారూ కూతవేటు దూరంలోనే ఉంటూ పాడుతూ అభినయం పట్టాలి అంతే ఆర్టు గిర్టూ అని కొత్త పద్ధతులు తెచ్చిందికి వీల్లేదు యస్సార్ యస్ పెళ్లి చేసుకునేవరకూ అంతే అంతెందుకు. పెళ్లి జరుగుతున్నపుడు కూడా పుస్తె తాడు! మూడోముడి పడేవరకూ పెళ్లికొడుకు వేళ్ళు పిల్లదాని జడగ్గాని, మెడగ్గాని తగల్రాదని సెన్సారు శాసనం తగిలిందే సెన్సార్రూళ్లుకర్ర ప్రొడ్యూ సరు నెత్తిన శంగున పడిందే అది రేప్ అనగా బలాత్కారం క్రిందకు వస్తుంది అంతేమరి మూడో ముడి పడేదాకా టెక్నికల్‌గా పెళ్లయి నట్టు కాదుగదా? వ్వాట్ ? హార్గ్యూ చేస్తారా ? మై గాడ్ ఆర్గ్యుమెంట్లూ లాజిక్కులూ పనికి రావుసార్ రూలంటే రూలే సెన్సార్ రూలంటే మరీను అంతెందుకూ, ఎక్స్ ప్రొడక్షన్సువాళ్ళ పిక్చరులో మొన్న నేంచేశాం ? హీరోయిను నూతిలో పడింది హీరో ఆవిడని సేవ్ చెయ్యాలి పెళ్లికాలేదు హశా! దట్ వాజ్ ది ప్రాబ్లెం వెంటనే పురోహితుణ్ణి, హీరోయిను ఫాదర్నీ కేకేయిం చుకొచ్చి నూతిలో దించి, "ఇయం సీతామమసుతా" ముక్కలు మూడూ అనిపించి, అప్పుడు హీరో చేత మూడు ముళ్ళూ వేయించాం—ఆవిడ మూడో గుటక వేసేలోగా మళ్లీ టైముండదని పుస్తెల తాడు బదులు పెద్దపలువు తాడుతోనే ముళ్ళు

(43-వ పేజీ చూడండి)



నవ్యకళావారి స్త్రీహృదయం లో పద్మిని



సారథివారి "కలసి ఉంటే కలదు సుఖం" చిత్రంలో గిరిజ, హరనాథ్.

## మాస్కో చిత్రోత్సవంలో జపనీస్ చిత్రం ఎన్నిక

మాస్కోలో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో కనెటోషిండో దర్శకత్వం వహించిన ది ఐలెండ్ అనే జపాని చిత్రానికి గ్రిగరీ ఛుక్రాయ్ నిర్మించిన ది క్లియర్ స్కై అనే సోవియట్ చిత్రానికి అత్యుత్తమత్వ బహుమతి లభించింది

న్యాయ నిర్ణేతల ప్రత్యేక బంగారు పతకం ఎవ్వరివన్ గోస్ హోమ్ అన్న ఇటాలియన్ చిత్రానికి (దర్శకుడు లుయిగీ సిమిన్సి) లభించింది

ఉత్తమ కళాత్మక చిత్రానికి ఇచ్చే స్వర్ణ పతాకాలు ప్రొఫెసర్ మామ్‌లాక్ అనే తూర్పు జర్మనీ చిత్రానికి ఛింకాఘుల్యాజ్ కోవా దర్శకత్వం వహించిన హవ్ యంగ్ ఉయ్‌హావ్ బీన్ అనే బల్గేరియన్ చిత్రానికి లభించాయి ఉత్తమ సమాచార చిత్రంకు ఇచ్చే స్వర పతకం రోములో మారిల్లిసి నిర్మించిన ది బిగ్ ఒలెంపిక్స్' కు లభించింది

ఈ చిత్రోత్సవంలో భారతదేశం కూడా పాల్గొన్నదన్న సంగతి అందరికీ తెలిసిందే

## బెర్లిన్ చిత్రోత్సవంలో లానోట్టె ఎన్నిక

బెర్లిన్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ఇటలీనించి వచ్చిన లా నొట్టె చిత్రానికి ఉత్తమ చిత్ర బహుమతి లభించింది బంగారు ఎలుగ్గొడ్డు (బొమ్మ) బహుమతిగా పొందిన ఈ చిత్రానికి మిఖేలాంజెలో అంటోనియోని దర్శకత్వం వహించారు

ఉత్తమ దర్శకులుగా పశ్చిమ జర్మని బెర్న్‌హార్డ్ విక్కీ (మిరకిల్ ఆఫ్ మలాచియస్) నటుడుగా బ్రిటన్ పీటర్‌ఫించ్ (నో లవ్‌ఫర్ జానీ) నటిగా ఫ్రెంచి అన్నాకెరినా (ది ఫెమ్మెమెస్ట్ ఉన్నెఫెమ్మె)లకు బహుమతులు లభించాయి

## 13 దేశాల సమిష్టి చిత్రం

సోవియెట్ శాంతి సంఘం ఆధ్వర్యాన యంగ్ మాన్స్‌డే అన్న యుద్ధ వ్యతిరేక డాక్యుమెంటరీ చిత్రాన్ని 13 దేశాలు సమిష్టిగా నిర్మించ బోతున్నాయి

ఈ చిత్రాన్ని ఒకే సమయంలో 13 దేశాల్లో అంటే చైనా ఉత్తర కొరియా జకోస్లవేకియా రుమేనియా బల్గేరియా హంగరీ ఫ్రాన్సు ఇటలీ క్యూబా ఉరుగ్వే జపాన్ పశ్చిమ జర్మనీలలో చిత్రీకరిస్తారట

## పాల్‌గుయిల్ఫాయిల్ మృతి

ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు పాల్‌గుయిల్ఫాయిల్ జూన్ 27 వ తేదీన హృద్రోగంతో మరణించారు ఆయన వయస్సు 58

## ఇరాక్‌లో భారతీయ బాలల చిత్రాలు

భారతీయ బాలల చిత్రాలను తమ దేశంలో జులై 24 వ తేదీ జరుగబోయే స్వాతంత్ర్యోత్సవాలను పురస్కరించుకొని ప్రదర్శించవలసిందిగా ఇరాక్ విదేశాంగ మంత్రి శ్రీ హాషింజవాద్ తమ ప్రభుత్వం తరఫున వ్యక్తిగతంగానూ ఒక ఆహ్వానాన్ని భారతీయ బాల చిత్ర సంఘ సాధారణ కార్యదర్శి శ్రీ మ హేంద్రనాద్‌కు అందజేశారు ఇరాక్ ప్రధానమంత్రి శ్రీ కాశింకు కూడా భారతీయ బాల చిత్రాలంటే ఎంతో ఆసక్తి వుందిట

* * *

బ్రిటన్ వ్యాపారీసు నటి అలెక్ గియేనెస్ నటుడు డిర్క్‌బొగార్డె ప్రధానంగా న్యూటీ నర్స్ అన్న చిత్రంలో నాయకీ నాయకులుగా నటిస్తున్నారు

సింక్ ది బిస్మార్క్ దర్శకుడు లూయీ గిల్బర్ట్ ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు.

## సింహళ ప్రభువు జీవితంపై చలన చిత్రం

సింహళ రాజకీయ చరిత్రలోని చిట్ట చివరి పరిపాలకుడు విక్రమరాజసింఘే జీవితాన్ని చలన చిత్రంగా తీయాలని ఒక స్థానిక సంస్థ ప్రయత్నిస్తోంది ఈ చిత్రం అంతా సింహళంలోనే తయారవుతుంది సింహళీయుడే దర్శకత్వం వహిస్తారట.

## భూదానోద్యమంపై కన్నడ చిత్రం

భూదానోద్యమాన్ని ఆధారంగా అనంతలక్ష్మి పిక్చర్సువారు ఒక చిత్రాన్ని నిర్మిస్తున్నారు ఇందుకుగాను జానకి తదితరులు పాడిన మూడు పాటలను కూడా రికార్డు చేశారు దర్శకుడు నిర్మాత జి వి. అయ్యర్ సి యన్ గోపాలకృష్ణ

* * *

## హిందీలో పాశమలర్

తమిళ దేశంలో ప్రజామోదం పొందుతున్న సాంఘిక చిత్రం పాశమలర్ ను హిందీలో నిర్మించటానికి సన్నాహాలు జరుగుతున్నాయి

ప్రభురామ్ పిక్చర్సు పేరిట తయారయ్యే ఈ హిందీ చిత్రంలో అశోక్‌కుమార్ ప్రదీప్‌కుమార్ వహీదారెహమాన్ అమిత లలితాపవర్ ముఖ్యపాత్రలు ధరిస్తారట చిత్ర కథ సంభాషణలు రాజేంద్రకృష్ణ సంగీతం రవి తమిళ చిత్రానికి దర్శకత్వం వహించిన శ్రీ ఎ భీమ్‌సింగ్ ఈ చిత్రానికి కూడా దర్శకత్వం వహిస్తారట

## త్వరలో విడుదల మోడరన్ గరల్

యస్ డి నారంగ్‌వారి మోడరన్ గరల్ చిత్రం నిర్మాణం పూర్తయింది అతి త్వరలో విడుదల కాబోతోంది

ప్రదీప్‌కుమార్ నయూదాఖాన్ నళిని ఫోంకర్ లిలియన్ జాసీవాకర్ స్మృతిబిశ్వాస్ మదన్‌పురి పాల్గొంటున్న ఈ చిత్రానికి నిర్మాత బి డి నారంగ్ సంగీతం రవి చిత్ర కథ సి జె పావరి పాటలు రాజేంద్రకిషన్ సంభాషణలు హెచ్ ఎ రాహి దర్శకత్వం ఆర్ భట్టాచార్య

## హం దోనోం

నవకేతన్‌వారి హం దోనోం చిత్ర నిర్మాణ పూర్తయివిడుదలకు సిద్ధంగావుంది దేవానంద్ నంద సాధన ప్రభృతులు నటిస్తున్న ఈ చిత్రానికి కథ సంభాషణలు : విజయఆనంద్ పాటలు సాహిర్ సంగీతం జయదేవ్ దర్శకత్వం అమర్‌జీత్

## ప్రసాద్ చిత్రంలో జమున

శారద ససురాల్ లాంటి చిత్రాలతో హిందీ చిత్ర రంగంలో విజయపతాకం ప్రతిష్ఠించిన ప్రతిభాశాలి దర్శక నిర్మాత శ్రీ యల్ వి ప్రసాద్ తాము హిందీలో నిర్మించబోయే భార్యా భర్తలు (తెలుగు) చిత్రానికి నాయికగా జమునను తీసుకున్నారు తాతినేని ప్రకాశరావు దర్శకత్వం నిర్వహించే ఈ చిత్రంలో జమున రాజేంద్రకుమార్ ముఖ్య పాత్రలు ధరిస్తున్నారు

ప్రతిభాశాలినియైన ఒక నటిని హిందీ చిత్ర రంగానికి పరిచయం చేస్తున్న శ్రీ ప్రసాద్ కృషి అభినందనీయం

తాము నిర్మించబోయే ఇంకో రెండు చిత్రాల్లో కూడా కుమారి జముననే ప్రధాన పాత్రకు తీసుకోదల్చుకున్నట్లు తెలుస్తోంది

## 'యహ్ దిల్ కిస్కాదూ

బిందు కళామందిర్‌వారి యహ్ దిల్ కిస్కాదూ చిత్రానికి సంగీత దర్శకులుగా ఇక్బాల్ ఖురేషి నియుక్తులయ్యారు

శశికపూర్ రాగిణి అన్వర్ ప్రభృతులు నటిస్తున్న ఈ చిత్రం 3 రీళ్ళకుపైగా తయారయింది నిర్మాతలు వి డి కపూర్ ప్రేమ్ రత్తా ఛాయ : కనక్‌మిశ్ర

## కన్నడ-తెలుగు చిత్ర ప్రారంభోత్సవం

కన్నడభాషలో ఉత్తమ ప్రశంసా పత్రాన్ని పొందిన భక్త కనకదాస నిర్మాతలు శ్యామప్రసాద్ మూవీస్‌వారు కన్నడ—తెలుగు భాషల్లో నిర్మించబోయే చిత్రానికి ఇటీవల మద్రాస్ గోల్డెన్ స్టూడియో ప్రారంభోత్సవం జరిపార శ్రీ ఆర్



రాణీ చెన్నమ్మ లో బి సరోజాదేవి

దాసప్పనాయుడు కెమెరా స్విచ్‌ఆన్ చేశారు

కాంతారావు కృష్ణకుమారి రమాదేవి రాజశ్రీ నరసింహరాజు ప్రభృతులు పాల్గొంటున్న ఈ చిత్రానికి తెలుగులో సంభాషణలు సీటూరి సంగీతం : యం వి. రాజు దర్శకత్వం వై ఆర్ స్వామి నిర్మాత డి ఆర్ నాయుడు

(48-వ పేజీ చూడండి)

"మోడరన్ గరల్" చిత్రంలో జాసీవాకర్, హెలెన్,



## జరిగిన కథ

కాళిదాసు ఇంటి వరండాలో ఆ తెల్లవారుజామున ఎవరో కెలన్నా నిండని పసిపిల్లవాణ్ణి విడిచి వెళ్ళారు భార్య మరణంతో, వృద్ధురాలైన తల్లి తప్ప వేరే ఆడదిక్కు లేని కాళిదాసు ఆ అనాధ బాలుణ్ణి పెంచడానికి ముందు సంకోచించినా, తరువాత సిద్ధపడి పని మనిషి అప్పలమ్మకు ఆ బాధ్యత అప్పగిస్తాడు. స్నేహితుడు పట్టాభి, మామగారు చెప్పినా కాళిదాసు రెండో పెళ్ళి చేసుకునేందుకు ఇష్టపడడు

---

కాళిదాసుకు మెలకువవచ్చేసరికి తెలతెలవారుతున్నది

ప్రతిరోజూవలె ఆనాడు తెల్లవారుజామున మెలకువ రాలేదు చాపమీద పాత్తిగుడ్డలలో పడుకునివున్న పిల్లవాడు 'కేరు'మని కంచు గొంతుతో ఏడుస్తున్నాడు అప్పలమ్మ అక్కడలేదు

కాళిదాసులేచి ఆమెను కేకవేస్తూ, వంచల్లోకి వెళ్ళాడు ఆమె వాకిలి చిమ్ముతున్నది అతని పిలుపు విని చీపురు క్రిందపడేసి "విన్నాను బాబూ! శంఖం వూదినట్టు ఏడుస్తాడు" అంటూ లోపలికి వెళ్ళింది అయిదు నిముషాల్లో పిల్లవాణ్ణి సముదాయించి పడుకోబెట్టి ఉత్తరంవైపు వంచలో శిమ్మల దగ్గర కూర్చున్న కాళిదాసు దగ్గరికివచ్చి "నేను పెందరాళే పని పూర్తి చేసుకుని పిల్లవాణ్ణి తీసుకుని వెళ్ళిపోతాను బాబూ! మాఅమ్మాయి ఎదురు చూస్తూ వుంటుంది ఇద్దరు పిల్లలకూ ఒకేసారి ఆముదం పట్టాలి" అన్నది

మురళి చదువుకుంటున్న వాడల్లా తల పైకెత్తి "మేష్టారూ! వాడికొక ఉయ్యాల కొనుక్కురండి" అన్నాడు కాళిదాసు "నువ్వు సలహా లివ్వనక్కరలేదు నోరు మూసుకుని చదువుకోవోయ్" అన్నాడు

పక్షులు గుంపులు గుంపులుగా ఎగిరి పోతున్నాయి ప్రాతఃకాలపు శీతలవాయువు చల్లగా వీస్తున్నది వీధిలో ఒక జంగందేవర ఏదో పాట పాడుకుంటూ నడిచి పోతున్నాడు చెట్టుక్రింద వందలాదిగా రాలివున్న పున్నాగ పువ్వుల వాసన గాలిలో కలిసి హాయిగా వస్తున్నది

ఒక పన్నెండేళ్ళ పిల్ల చేతిలో పళ్ళెంతో ఆ యింట్లోకివచ్చి వరండాక్రింద ఆవరణలో నిలబడి "మేష్టరుగారూ! ఇవాళ శుక్రవారం పూజకు పూలు" అన్నది కాళిదాసు ఆ అమ్మాయి వంక చూసి "నువ్వా రుక్కూ! నీకు అడ్డేమిటే? కోసుకు

పో" అన్నాడు ఆ అమ్మాయి నెమ్మదిగా నడిచి యింటి పెరట్లోకి వెళ్ళింది మురళి తలెత్తి "ఈ అమ్మాయి మన తెలుగు పండిట్‌గారి కూతురు కదండీ?" అని అడిగాడు కాళిదాసు తలవూపి "అవును" అన్నాడు

ఆ అమ్మాయిపేరు రుక్మిణి తలనిండా స్నానం చేసి వచ్చింది కాబోలు ఆమె వెంట్రుకలు నుదుటిపైన గాలికి కదులుతూ వున్నాయి సన్నగా తీగవలె వుంటుంది పొందికగా అమరిన కళ్ళూ, ముక్కూ, ఎర్రని పెదవులూ, శంఖంవంటి కంఠమూ, మధురమైన కంఠస్వరమూ ఇవి ఆ అమ్మాయికి ప్రకృతిసిద్ధంగా అమరివున్న సొమ్ములు ఆ పిల్ల తండ్రి శంకరశాస్త్రిగారు చిన్నతనంనుంచి కష్టపడిన వ్యక్తి స్వశక్తితో చదువుకుని పైకి వచ్చినవాడు సంగీత సాహిత్యాలు రెంటిలోనూ నిష్ణాతుడైన వ్యక్తి ఆయన 'ఫిడేలు' అద్భుతంగా వాయిస్తాడు ఆ విషయం అందరికీ తెలియదు మరీ సన్నిహితులైన, వ్రేళ్ళమీద లెక్కించదగిన, కొద్దిమందికి మాత్రమే తెలుసు కాళిదాసు ఆయన వాద్యం వినడం చిత్రంగా తటస్థపడింది ఆరు నెలల క్రిందట ఒకనాటి సాయంకాలం తల్లికీ తనకూ జరిగిన వాగ్వాదం ముదిరి, ఆమె కళ్ళ నీళ్ళు పెట్టుకుని కూర్చోవడంతో, అతని మనస్సు వికలమై విసురుగాలేచి వీధిలోకి వెళ్ళిపోయాడు అది పౌర్ణమి రాత్రి చంద్రుడు తన వన్నె చిన్నె లన్నింటినీ వెచ్చించి ఆహ్లాదకరంగా వెన్నెలలు కురిపిస్తూ ప్రకాశిస్తున్నాడు కాళిదాసు అలా ఎంత దూరం నడిచి వెళ్ళాడో అతనికే తెలియదు ప్రశాంతంగావున్న కాసారంలో చిన్నరాయి పడినట్లు అతని మనస్సును తల్లి మాటలు కలత పెట్టినయ్ తాను నడుస్తూవున్న వీధి చివరకు వచ్చేసరికి ఒక పెంకుటింటిలోనుంచి 'వయొలిన్' వాద్యం వినవస్తున్నది ఆ యిల్లు శంకరశాస్త్రిగారిదని అతనికి తెలుసు ఆ యింటిముందు వున్న ఆవరణలో చిన్నచిన్న పూల చెట్లు కొన్ని వున్నాయి పంచలో చాపమీద లాంతరుముందు కూర్చుని చదువుకుంటున్న రుక్మిణి కాళిదాసును చూసి లేచి నుంచుని "మా నాన్నగారి కోసమా? ఈ గదిలో వున్నారు వెళ్ళండి" అన్నది ఇంట్లో అప్పుడు మరెవ్వరూలేరు కాళిదాసు నిశ్శబ్దంగా నడిచి వెళ్ళి ఆ గది గుమ్మంలో కూర్చున్నాడు కిటికీలోనుంచి చల్లని వెన్నెల ఆ గదిలో సగ భాగంలో పడుతున్నది శంకరశాస్త్రి చాపమీద కూర్చుని 'ఫిడేలు' వాయిస్తున్నాడు ఆపాతమధురమైన ఆ వాద్య సంగీతం కాళిదాసును మైమరపింప జేసింది అతడలాగే దాదాపు పావుగంటసేపు ఆ సంగీతపు సుడులలో, అలలలో మహానందకరంగా మునకలువేసి కళ్ళనిండా నీళ్ళు నిండగా గుమ్మానికి ఆనుకుని కూర్చుండిపోయాడు ఆయన చివరకు వాయించిన "పూరయ మమ కామం" అనే తరంగం తన్ను జీవచ్ఛవంలావదిలి, తన యింటిని చీకటిగా చేసి మరేవో లోకాలకు వెలుగునిచ్చే నిమిత్తం కన్ను మూసి వెళ్ళిపోయిన తన శివకామసుందరికి అత్యంత ప్రీతిపాత్రమైనది

శంకరశాస్త్రిగారు ఫిడేలు క్రింద వుంచి "అమ్మాయీ! ఆకలవుతున్నదే" అంటూ వెనక్కు తిరిగి గుమ్మంలో కూర్చునివున్న కాళిదాసును గుర్తించలేక "ఎవరది?" అంటూ పలకరించి, రుక్మిణి దీపం తీసుకువచ్చిన తర్వాత గుర్తించి ఆశ్చర్యపోయి "నాయనా కాళిదాసూ! నువ్వా? ఇలా వచ్చావేమిటి?" అన్నాడు

కాళిదాసు లేచి ఆర్ద్రమైన కళ్ళను తుడుచుకుంటూ మొహాన్ని దాచుకుని "ఏమీ లేదు ఇలా యింటికి వెడుతూ మీ వాద్యం విని లోపలికి వచ్చాను మిమ్మల్ని పిలిస్తే యింతసేపూ యిలా వినే భాగ్యం వుండేది కాదుగా! అయినా మీరింత బాగా ఫిడేలు వాయించగలరని నా కింతకుముందు తెలీదు సుమండీ!" అన్నాడు

ఆయన నవ్వి "ఏదో అలా పట్టుబడిందిది మా రుక్మిణికి నేర్పుతున్నాను దానికా చదువూ, యిదీ రెండూ పట్టుబడవు అందుకని వచ్చేయేటితో చదువు మాన్పించి వేస్తాను దాన్ని పెద్ద చదువులకు పంపే శక్తిలేదు ఇలా ఫోర్తుఫారంతో ఆపివేసి, యీ ఫిడేలు నాకు వచ్చినదంతా నేర్పగలిగినా, నా కోరిక నెరవేరినట్టే" అన్నాడు కాళిదాసు మరో

---

ఉపాధ్యాయుడు - ఒరే అబ్బాయిలూ ప్రతీవారికీ ఓర్పు ప్రధానమురా.

శిష్యుడు - ఓర్పు అంటే ఏమిటండీ మాస్టారూ?

ఉపాధ్యాయుడు - ఓర్పురా

శిష్యుడు - ఏమిటండీ?

ఉపాధ్యాయుడు - నోరు ముయ్ వెధవా!

మూర్తి (పాలకొల్లు)

---

నిముషంవుండి "వెళ్ళివస్తానండి" అని చెప్పి ప్రశాంతమైన మనస్సుతో యింటికి తిరిగివచ్చాడు అప్పటికి అతని తల్లి పంచలో కూర్చుని అతనికోసం ఎదురు చూస్తున్నది

కాళిదాసు ఆ స్మృతినుంచి తేరుకునేసరికి రుక్మిణి పళ్ళెంనిండా పూలు కోసుకుని వరండా క్రింద నిలబడివుండి 'నేను వెడుతున్నాను మేష్టారూ!' అని చెబుతున్నది కాళిదాసు "అలాగే" అని వెనుదిరిగి పోతున్న ఆ అమ్మాయిని మళ్ళీ పిలిచి "నీ ఫిడేలు పాఠాలు ఎంతవరకూ వచ్చాయి?" అని అడిగాడు ఆ పిల్ల సిగ్గుపడి నెమ్మదిగా "సాయంకాలం మా యింటికి ఒకసారిరండి మా నాన్నగారు మీతో ఏదో విషయం మాట్లాడాలిట" అన్నది కాళిదాసు "ఇంకేం? ఇంటికి పిలిచి సంగీతం వినిపిస్తానంటే కాదనే వాళ్ళెవరు? తప్పకుండా వస్తాను" అన్నాడు ఆ అమ్మాయి వెళ్ళిపోయింది

పని మనిషి పసిపిల్లవాణ్ణి ఎత్తుకుని ఆ వైపుకు వచ్చి "బాబుగారూ! నే నింటికి పోతున్నాను వసారాలో కుంపట్లో నిప్పంటించాను కాఫీకి నీళ్ళుపడేసుకోండి పాల మనిషి పాలుపోసిపోయాడు గుమ్మం దగ్గర పిలగ్లాసు వుంచాను" అని చెప్పి వెళ్ళిపోయింది

తూర్పున అగ్నిగోళంలా సూర్యబింబం ఉదయిస్తున్నది కాళిదాసు బద్ధకంగా కూర్చుని ప్రహరీ గోడ కవతల కనుపిస్తున్న బ్రహ్మజెముడు పొద వంక చూస్తున్నాడు ఆ పొదలో మరో అందమైన పువ్వు పూచింది

మురళి చదువుకుంటున్న వాడల్లా మళ్ళీ తల పైకెత్తి "మేష్టారూ! వాణి ఏంపేరుపెట్టి పిలుస్తారు మీరు?" అని అడిగాడు కాళిదాసుకు నవ్వు వచ్చింది అతనేమీ మాట్లాడలేదు వాడి బాలారిష్టాలన్నీ గడిచి బ్రతకాలి గాని వాడికి పేరే దొరక్కపోతుందా?

ఒక్క నిముషంఆగి కాళిదాసు ఆవులించి చిటికె వేస్తూ లేచి "ఇంక యిళ్ళకు వెళ్ళండోయ్ ఏడు గంటలవుతున్నది ఇక చదివినా బుర్ర కెక్కదు" అన్నాడు వారి అన్యమనస్కతను గమనించి ఆ మాట వినడమే తడవుగా వాళ్ళిద్దరూపుస్తకాలు సర్దుకుని బయలుదేరారు

కాళిదాసు వారిద్దర్నీ పంపించి, వీధి తలుపువేసి వంటయింట్లోకి వెళ్ళాడు వెనక వసారాలో కుంపటి 'కణకణ' మండుతున్నది అతడు గిన్నెలో నీళ్ళు పోసి కుంపటిమీదవుంచి మొహం కడుక్కుని వచ్చేసరికి వాకిట్లోనుంచి పేపరు కుర్రవాడు కేక వేశాడు కాళిదాసువెళ్ళి దినపత్రిక అందుకుని మళ్ళీ వంట యింట్లోకి వచ్చాడు నీళ్ళు మరుగుతున్నాయి ఆ నీళ్ళలో కాఫీపొడివేసి పాల గిన్నె కుంపటిమీదవుంచి దిన పత్రిక చేతిలోకి తీసుకున్నాడు

మొదటి పుటలో క్రింద పెద్ద అక్షరాలతో అచ్చయిన విషయం అతన్ని ఆకర్షించింది అతడు దాన్ని చివరి వరకూ చదివాడు అది దొంగనోట్లు అచ్చువేసేవారిని గురించిన ఉదంతం ఎక్కడో ఒక పల్లెటూళ్ళో దొంగనోట్లు అచ్చువేసే ముఠా పని చేస్తున్నదని అనుమానంతో వెదకగా, చాలా రకాల యంత్రాలు పట్టుబడ్డాయనీ, ఆ ముఠాలో పనిచేసే మనుషులు కూడా యిద్దరు ముగ్గురు దొరికారని, వారివల్ల కొన్ని సంగతులు తెలిశాయనీ పోలీసులు అంటున్నారుట ఆ ముఠాలో ప్రధానమైనవాడు కె జె రామారావనే ముప్ఫయి సంవత్సరాల వ్యక్తి అతన్నిగురించిన వివరాలు పూర్తిగా తెలియవచ్చినవనీ, అతనికోసం ప్రతి పట్టణంలోనూ పోలీసులు నిఘావుంచి వెదుకుతున్నారనీ ఆ దిన పత్రిక వ్రాసింది

కాళిదాసు పాలగిన్నె దింపుతూ నవ్వుకున్నాడు ఇటువంటి నేరాలు చేసేవారు మహా సాహసులై వుంటారు వారి తెలివితేటలు కూడా అసామాన్యమైనవిగానే వుంటాయి కాని ఉన్న జ్ఞానాన్ని యిలా విద్రోహ చర్యలకు వినియోగించి తమను తామే మోసం చేసుకొంటారు కొందరు వారికి యంత్ర పరిజ్ఞానమూ, జ్ఞాపకశక్తీ, మేధాసంపత్తీ వుంటాయి అయినా వారివల్ల సంఘానికి ఏ ప్రయోజనమూ వుండదు అన్ని మంచి లక్షణా లున్నప్పటికీ వారు పెడత్రోవలు పడుతూ వుంటారు

(39-వ పేజీ చూడండి)

# బంగారం-సింగారం-'బాపు' చిత్రకథ-



15

## బంగారం - సింగారం - 'శశి' చిత్ర కథ -

































# అరువు బేరం

వి. వి. సూర్యనారాయణ

ఒకానొక గ్రామంలో రామయ్య అనే రైతు ఉండేవాడు ఓరోజున రామయ్య ఏవో వస్తువులు కొనటానికి దగ్గరలోనే ఉన్న బస్తీకి బయలుదేరాడు కావలసినవి పట్టుకుని తిరిగివస్తుండగా వేలం గుంపు కనిపించింది. బట్టలు వేలం వేస్తుంటే తాను కూడా ఆ గుంపులోకి చొరబడ్డాడు

"దీని అసలు ఖరీదు ఎనిమిది రూపాయలు" అంటూ ఆ వేలం వేసే వ్యక్తి ఓ పంచెల చాపును పట్టుకుని అందరివైపుచూచి పాడమన్నాడు. నాలుగు రూపాయల కన్నా ఎక్కువ పాట సాగలేదు. నాలుగు రూపాయలకు పాడినవాడు రామయ్య ఆ వేలం వేసే వ్యక్తి మూతి ముడుచుకొని నాలుగు రూపాయలకు దానిని రామయ్యకిచ్చివేశాడు.

రామయ్య సంతోషంతో తన గ్రామానికి తిరిగివచ్చాడు. ఇంటికి వెళ్ళే దారిలో సోమయ్య అనే యింకొకవ్యక్తి కనిపించి, రామయ్య చేతిలోని పంచెలచాపును చూస్తూ "చాలా బాగుంది నాకు అమ్మేస్తావా రామయ్యా" అని అడిగాడు రామయ్య కాస్త ఆలోచించి "ఐదు రూపాయలకైతేనాకిష్టమే" అన్నాడు చౌకగా వస్తోందికదా అని "సరే, డబ్బు తరువాత యిస్తాను అభ్యంతరం లేదు కదా" అన్నాడు సోమయ్య రామయ్య ఒప్పుకుని దానిని సోమయ్యకిచ్చివేశాడు.

సోమయ్య తనయింటికి వెళుతుండగా పాపన్న కనిపించాడు అతని దృష్టి పంచెల చాపుమీదపోయి యీ మాట ఆ మాట అయ్యాక "నాకు బట్టలులేవు దీనిని నాకిచ్చేయరాదూ" అన్నాడు. సోమయ్య "ఆరురూపాయలకైతే అభ్యంతరం లేదు" అన్నాడు. "తరువాత డబ్బునిస్తా"నంటూ దానిని పాపన్న పట్టుకుపోయాడు. దారిలో రత్తన్న కనిపించాడు అతనిచూపు చాపుమీద పడింది. ఇంకేముంది ? "నాకు దీనిని అమ్మతా" అంటూ తన కోరికను బయల్పెట్టాడు పాపన్నకూడా ఓ రూపాయ లాభంపై యేడు రూపాయలకు అమ్మేశాడు "ఇబ్బందిగా వుంది. సొమ్ము తరువాత యిస్తా" అంటూ తనుకూడా అరువుపెట్టి పంచెల చాపును తీసుకుపోయాడు రత్తన్న

తను అద్దకపుపని చేసేవాడు కాబట్టి ఆ పంచెలచాపుకు చక్కని అంచువేసి ఆరబెట్టాడు రత్తన్న అది ఆరిపోయాక తీసి మడతబెట్టే



చిత్రకారుడు ప్రకాశ్, (మచిలీపట్నం)

సమయానికి దైవికముగా వచ్చాడు మొదటివ్యక్తి రామయ్య. అతడా పంచెల చాపునుచూచి "రత్తన్నా! చక్కని అంచువేశావు" అని మెచ్చుకుని "నేనొక చాపునుకొన్నాను. వెంటనే అమ్మివేశాను నాకు దీనిపై చాలా యిష్టంగావుంది. నీకు యిష్టమైతే నాకు అమ్మివేయరాదూ" అన్నాడు మెల్లగా. ఇష్టంలేకపోయినా పరిచితుడు రామయ్య అడుగుతున్నాడు కాబట్టి "నువ్వడుగుతున్నందువల్ల యెనిమిది రూపాయలకు యిచ్చివేయటానికి నాకు సమ్మతమే" అన్నాడు రత్తన్న. రామయ్య సంతోషంతో "పైకం ప్రస్తుతం లేదు. తరువాత యిస్తాను" అని ఆ చాపును చంకలోబెట్టి దారిపట్టాడు

రెండుమూడు రోజులు గడిచాక సోమయ్యను తన అయిదురూపాయల నిమ్మని అడిగాడు రామయ్య. "నాకు ఒకడుయివ్వాలి వాడినడిగి నీకిస్తాను" అని సోమయ్యవెళ్లి పాపన్నను అడిగాడు తనకు రావలసినది యిమ్మని. పాపన్న "నాకు ఒకని నుంచి రావాలి అదిరాగానే తీర్చేస్తాను" అంటూ వెళ్ళి రత్తన్నను తన యేడురూపాయలను తీర్చమని అడిగాడు రత్తన్నకూడా "ఒకడివ్వాలి అడిగి యిస్తాను" అని వెంటనేపోయి రామయ్యను డబ్బు యిమ్మని అడిగాడు. రామయ్య కూడా అదే జవాబిచ్చాడు "నాకొకడు బకీఉన్నాడు. అతనివ్వగానే యిచ్చేస్తాను" అని మళ్లీ రామయ్య సోమయ్యను, సోమయ్య పాపన్నను, పాపన్న రత్తన్నను

రత్తన్న తిరిగి రామయ్యను అడ'గడం మొదలుపెట్టారు చిత్రమేమిటంటే జరిగినది ఎవరికీ తెలియదు అందువల్ల ఈ అరువుబేరం చక్రంలా తిరగటం మొదలయ్యింది. అందులో ఏ ఒక్కడూ తీర్చడు. వాళ్లదగ్గర డబ్బు ప్రస్తుతం లేకపోవడం కారణం కావచ్చు. మరి నాలుగు రోజులలో అవుసరం హెచ్చుఅవ్వటంమూలాన పట్టుదలలు పెరిగి కోపాలుకూడా వచ్చాయి వాళ్లల్లో వాళ్లకు

నలుగురూ గ్రామ మునసబు దగ్గరకు పోయారు రామయ్యతాను పంచెలచాపును అమ్మినవైనం చెప్పి "ఇతడు (సోమయ్య) నాకు అయిదు రూపాయలివ్వాలి ఇవ్వకుంటున్నాడు చూడండి బాబూ" అని ఫిర్యాదు చేశాడు ఇదేవిధంగా సోమయ్య పాపన్నను, పాపన్న రత్తన్ననుచూపి డబ్బివ్వటం లేదన్నాగ. ఆఖరున రత్తన్నకూడా రామయ్యను చూపుతూ ఫిర్యాదు చేశాడు- డబ్బు యివ్వకుంటున్నాడని

అంతే! అందరూ ఒక్కసారిగా నిర్ఘాంతపోయారు రామయ్యమరీను తను అయిదురూపాయలకు అమ్మిన దానినే తిరిగి ఎనిమిదిరూపాయలకు కొన్నాడు! నెత్తిన పిడుగుపడ్డట్టయింది. "ఎంతమోసం! ఒక్క రూపాయ లాభానికిపోతే మూడు రూపాయలు నష్టమా! భగవంతుడా" అనుకున్నాడు

మునసబు యిదంతా విచారించి "ఎవరిదగ్గరా పైకంలేదా" అంటూ చూశాడు రామయ్యతప్ప మిగతా వాళ్లు "లేదు" అన్నారు రామయ్య య్యాత్రం "మూడురూపాయలే ఉన్నాయిబాబూ" అన్నాడు.

"మంచిచిక్కే! ఒక డింకొకడికి తీరిస్తేగాని వాడు మరొకనికి యివ్వడు, ఎవరిదగ్గరా డబ్బు లేదంటున్నారే ఏం చెయ్యడం?" అని కాస్సేపాలోచించి, ఒక్కసారిగా తనలో నవ్వుకున్నాడు మునసబు. ఇంట్లోకి పోయి ఓ అయిదురూపాయలు తెచ్చి రామయ్యను చూస్తూ "యిదిగో రామయ్యా! నీకుఅయిదు రూపాయలు లప్పు యిస్తున్నాను డబ్బు అందినవెంటనే తీర్చేయాలి సుమా" అన్నాడు. రామయ్య "చిత్తం" అనగానే అయిదురూపాయలనిచ్చి "నీ దగ్గరున్న మూడు రూపాయలను జోడించి ముందు రత్తన్నకు తీర్చు అన్నాడు మునసబు. రామయ్య ఉసూరు మంటూ అలాగే చేశాడు రత్తన్న ఎనిమిదింటిలోనూ ఒకరూపాయ జేబులో వేసుకుని యేడింటిని పాపన్నకిచ్చాడు పాపన్న అందులో ఒక రూపాయని తీసుకుని ఆరురూపాయలను సోమయ్యకిచ్చాడు సోమయ్య ఒక రూపాయని మొల్లో దోపుకుని అయిదురూపాయలను రామయ్యకిచ్చాడు. రామయ్య అయిదురూపాయలను మునసబు కిచ్చాడు మునసబు మరోసారి నవ్వుకున్నాడు.

అంటే రామయ్యతనదగ్గరవున్న మూడురూపాయలను మిగతా ముగ్గురికీ పంచాడన్నమాట! చూశారా మరి!—అరువుబేరంఎంతపనిచేసిందో?



## పసిడి కోరిక

దేవరకొండ దుర్గాప్రసాదరావు

ఎవ్వరేమన్నారె?
చిన్నారి పాప
ముచ్చటగు నీ మోము
ముడిచివేశావు?
చిన్నన్న యేమైన
అన్నాడ నిన్ను?
పెద్దక్క నునుబుగ్గ
ముద్దు పెట్టినద?
చిలుక పలుకులు పల్కు
చిన్నారి అనుచు
పదిమందియు కలసి
బాధించినార?
నాన్న నీకిచ్చిన
చిన్న పైసాలు
అన్న లెవరైనను
కన్నమేశార?
బాబాయి పెన్నుతో
బొమ్మలేశావ?
తాతయ్య పొడుమును
తడిపివేశావ?
తడబడుచు అడుగేసి
కూలబడినావ?
ఏమి చెప్పవదేల
చిట్టి నాతల్లి.
"పక్కింటి బాలలను
బడిలోన వేసి
పలకలు బలపాలు
పంచిపెట్టారు
అక్షరాభ్యాసంబు
అతిత్వరగ చేసి
బడిలోకి నన్నింక
వడిగ పంపమ్మ"
అనుచు పాపాయన్న
అమృతంపు పలుకు
ఆ తల్లి వీనులకు
విందుగా దోచె

# నేనే ఓడిపోయాను

మాధవరావు ఎల్లాగైనా రాధికను ఓడించాలని పట్టు బట్టాడు. చివరకు ఓటమిని ఒప్పుకున్నాడు.

మాధవరావుకు వాళ్ళ క్లాసులోఉన్న అమ్మాయి లంతా కలిసి మంచిపేరు ఒకటి బహుమానంగా యిచ్చారు—"పుస్తకాల పురుగు"

మాధవరావు కొంచెం బిడియస్తుడు. కాలేజీలో అడుగుపెట్టిన కొత్తల్లో మరీ! మొగవాళ్ళతో మాట్లాడాలంటేనే తలవంచుకొని మాట్లాడేవాడు దానికి తోడు సర్వకాల సర్వావస్థలలోను చేతిలో తెరిచిన పుస్తకం వుండేది అందుకనే ఎప్పుడూ దాదాపు ఫస్టు మార్కులు వస్తుండేవి! క్ప. కాని పాపం ఏంలాభం? పూర్తిగా అమ్మాయిల చేతుల్లో అలుసైపోయాడు

రాధిక చురుకైన పిల్ల ప్రతి వాళ్ళతోటి చాలా సోషల్‌గామూవ్ అవుతుంది పెద్ద పెద్ద ధైర్యం వున్న కుర్రవాళ్ళే ఆమె జోలికిపోరు—మళ్ళా మాట్లాడితే ఆమె పోలికలన్నీ 'అగ్గిభరాటా!"కు సమానం ప్రతివాళ్ళను కవ్వించి ఏడిపించే రకం!

అటువంటి దాని కళ్ళలోనే నలుసులాగా పడ్డాడు మాధవరావు! పడివున్నా బాగానే వుండేది ఉండి ఉండి వలిపేస్తోంది!

గంట కొట్టేటప్పటికి క్లాస్‌రూంలోకి విద్యార్ధులంతా బిలబిలా జేరారు ఆ గంటలో ఎకనామిక్స్ లెక్చరర్ అవధానం చేస్తారు!

ఈ రోజుల్లో క్లాసుల కెళ్ళటం అంటేనే లెక్చరర్లకు భయం అందులో కొత్తగా ఆ ఉద్యోగాన్ని స్వీకరించిన వారికి మరీ భయం ముఖ్యంగా కో ఎడ్యుకేషన్ ఉన్న కాలేజీలయితే సరేసరి!

లెక్చరర్‌గారువచ్చి తలెత్తకుండానే పావుగంట చెప్పాడు పాఠం గడ గడా చెప్పి తలెత్తి కళ్ళు గిర గిరా తిప్పిచూసి 'ఎవరైనా . ' అంటూ ఒక ప్రశ్నను రాకెట్‌లాగా వదిలాడు అది ఆ గదిలోనే చుట్టూ తిరిగి ఆయన దగ్గరికే వచ్చిచేరింది దాని ప్రభావాన్ని మాత్రం రేడియో రికార్డు చేయకుండా స్తబ్దుగా వుండిపోయింది

ఒక నిముషం—నిశ్శబ్దం
రెండు నిముషాలు—నిశ్శబ్దం
రెండున్నర నిముషాలు—నిశ్శబ్దం

ఇక ఉండలేక "మిస్టర్ మాధవరావ్ ప్లీజ్ ట్రై!" అన్నాను

మాధవరావు భిడియం బిడియంగాలేచి నిలబడి టై సర్దుకొని లెక్చరర్ ముఖంలోకే చూస్తూ నోరు తెరిచి ఏదో చెప్పబోయాడు

రాధిక ఫటుక్కున తుమ్మింది!

క్లాసంతా గొల్లుమన్నారు

లెక్చరర్‌గారు గుర్రుమని, ఎందుకులే కళ్ళు చెప్పులు పుడతయ్యని మానుకున్నాడు

మాధవరావు చేసేదేమీలేక తలతీసినంత బాధపడి, ఆ బాధలోనే మూలుగు మూలిగినట్లుగా నిట్టూర్పు విడిచి చతికిలబడ్డాడు

ప్రక్కనేవున్న ముకుందరావు మాధవరావు చెవి దగ్గరికల్లా నోరు జేరేసి 'గాలి తీసిందిరా!" అన్నాడు

మాధవరావు చప్పగా గాలిపోయినట్లుగానే ఊరుకున్నాడు.

కాలేజీ అయిపోయిన తరువాత జరిగిన పరాభవానికి లోలోనే కోపం తెచ్చుకొని, చేసేదేమీలేక రిక్షాఎక్కి రూంకెళ్ళాడు

కిటికీలోనుండి పడ్డ ఉత్తరం నేలమీద దొర్లుతోంది చేతిలోకి తీసుకొని చూచాడు అన్నయ్య వ్రాశాడు రెండే ముక్కలు

తమ్ముడూ!

అమ్మా నాన్నా లేని లోటు లేకుండా అన్నీ నేనే అయి నిన్ను పెంచాను యుక్తవయస్సు వచ్చింది గాబట్టి నీ వివాహం చేయాలనుకుంటున్నాం సంబంధాలు చూస్తున్నాం నీకేం అభ్యంతరం లేదనుకుంటా

ఇట్లు, నీ అన్నయ్య
సీతాపతి

"ఈ ఆడవాళ్ళు—" అని పళ్ళు కరకరా కొరుక్కొని తలపట్టుకొని మంచంమీద కూలబడ్డాడు కాలేజీ గుడ్డలయినా విప్పకుండా మాధవరావు!

*   *   *

రాధికమీద మాధవరావుకు రోజు రోజుకు కోపం

ుమీద పద్దిలాగా పెరుగుతోంది మొత్తం కలిపి తీర్చుకోవాలా అని కొన్నాళ్ళు అతి యిష్టమైన ువు గూడా మానేసి ఆలోచించాడు ఆలోచనలు పోగా అవమానం మాత్రం పెరుగుతునే వున్నది!

అటువంటి సమయంలో కాలేజీ ఎలక్షన్లు ్రనయి మిత్ర బృంద మంతా కలిసి "అబ్బాయి! ు యింగ్లీషులో డబ్బై ఆరుమార్కులు వచ్చినయి ుస్టే నీవూ పోటీ చేయాలి చేయనన్నావో ుతం!" అన్నారు

"నాకెందుకురా!" అని నసిగాడు

వాళ్ళు నిజంగానే తన్నబోయేటప్పటికి 'సిపాయి'గా నడిచివెళ్ళి 'నామినేషన్' పారేసి వచ్చాడు ఆఫీలో

ఎలక్షన్లు ఇంకా వారం రోజులున్నయి అనగా ంప్లెట్సు కొట్టించారు దీనితోబాటు టైం ుబుల్ కార్డ్సుకూడా క్లాసువారీగా అచ్చు వేయించి, పతి వాడి పేరు వ్రాసి సాధ్యమయినంతవరకు ాళ్ళింటికి స్వయంగా వెళ్ళి, "మై డియర్ ుమారావ్! నేను రేపు రాబోయే ఎలక్షన్లలో నిల ుడుతున్నాను గెలిపిస్తే నేనెన్నో సహాయాలు ుకు చేస్తాను మీ సహాయముంటే మరీ చేస్తాను ానికి నిదర్శనంగానే మీకెంతో సహాయకారికాగల ఈ టైంటేబుల్ కార్డ్సు కొట్టించి ఊరికే పంచిపెడుతున్నాను కనుక మీరు మీ వోటువేసి, మీ మిత్రులచేత వేయించి నన్ను గెలిపించాల్సింది!" అని అన్ని భావాలు ముఖంమీద తిప్పుతూ చెప్పుకొని మరీ వచ్చాడు

వెంటవెళ్ళిన ముకుందరావు మాధవరావు టైం టేబుల్ కార్డ్సు యిస్తున్నప్పుడు అవతలవాడు ఏడుపు మొఖంతో తీసుకున్నాడా, నవ్వు మొఖంతో తీసుకున్నాడా అని పరిశీలిస్తూ అలాంటివి రెండు జాబితాలు తయారు చేశాడు నవ్వుతూ తీసుకుంటే వోటు మాధవరావుకే వేస్తాడు ఏడుస్తూ తీసుకున్నాడో ప్రత్యర్థి 'ఓంకారం' గాడి కేస్తాడన్నమాట!

ఇక రేపే ఎలక్షన్లనంగా ఆరోజు రాత్రి తొమ్మిది గంటలకు మిత్రబృంద మంతా మాధవరావు రూములో కేరారు

"జాబితాలనుపట్టి చూస్తే మనకే రెండు వందల ఓట్లు ఎక్కువ వున్నాయి దాదాపు మన కాలేజీలో నూటయాభై మంది ఆడపిల్లలు వున్నారు వాళ్ళు మనకు వేశారంటే మనదే గెలుపు ఖాయం!" అన్నాడు ముకుందం

"వేయకపోతే యేంరా యాభై యింకా మనకే ఎక్కువ వున్నాయిగా!"

"ఆ తేడావలన లాభం లేదురా నవ్విన వాళ్ళల్లో ఎంతమందిది నిజం నవ్వో చెప్పలేంగా అందుకని ఆయాభై కొట్టేయాల్సిందే!"

"అయితే ఎలా ఇప్పుడేం చేద్దాం?" అన్నారు అంతా

ఆలోచించగా రెండు ఫ్లాస్కుల టీ ఖర్చు వ్రాసిం తరువాత ఐడియా తట్టింది వాళ్ళకు అది చిన్నది, చాలా తేలికదే అయినా మాధవరావు మాత్రం కొండను మోయాల్సినంతగా భయపడ్డాడు ఏడవటమే గాకుండా గజగజా ఒణికాడు

"అంటే నేను రాధికనువెళ్ళి 'మీదే గాకుండా

# నేను ఓడిపోయాను

మీ ఆడవాళ్ళ వోట్లన్నీ గూడా నాకే వేయించా'లని అడగాలా? అన్నాడు చిట్టచివరకు గుడ్లు తేలేస్తూ

శ్రీనివాసులు విలన్‌లా మొఖంపెట్టి కిటికీ దెగ్గరికెళ్ళి ఎటో చూస్తూ, సిగిరెట్టు పీలుస్తూ, "అవును మిస్టర్ మాధవరావ్! నీవు వెళ్ళక తప్పదు ఇది జీవన్మరణసమస్య—నీవు వోడిపోయినామన పరువు ప్రతిష్ఠలు అన్నీ గంగలో కలిసి చివరికి ఉప్పు సముద్రంలో పడిపోతయి అప్పుడు నీ మొఖం ఎవరికీ చూపలేవు ముఖ్యంగా రాధిక ముందు నీవిక ఎందుకు పనికిరాని ఒక 'పిచ్చుక'వై పోతావు ఆ దిగాలు పడి నల్లబడిన మొఖంతో తిరిగి కాలేజీలో అడుగు పెట్టటంకంటే ఏ మెరీనాబీచ్‌కో వెళ్ళి మాయ

---

ఇద్దరు బిచ్చగాళ్లు భోజనం చేస్తున్నారు

ఒకడు :- ఒరేయ్ వెండి కంచంలో భోజనం చెయ్యాలనుందిరా?

చెంప ఛెళ్లుమనిపించాడు రెండవవాడు

మొదటివాడు :- ఏరా? ఏం చేశానని?

రెండవవాడు - ఏలాగు లేని దానికి వెండికంచం ఏం కర్మరా? బంగారు కంచంలోనే తినాలనుందన కూడదూ?

సి హై చింతామణి (శ్రీకాకుళం)

---

మవ్వటం మంచిదనుకుంటా! ఆలోచించుకో—అయినా ఒక అమ్మాయితో మాట్లాడటానికే అంత అబలుడువైపోతావేం నిజంగా ఎవరి శక్తి సామర్థ్యాలు వారికి తెలియవు కొత్తగాబట్టి అలా గనుకుంటున్నావు గాని రాధికతో మాట్లాడి వచ్చిం తరువాత ప్రతి అమ్మాయి దగ్గరికి గూడా స్వయంగా వెళ్ళిచెప్పాలనిపిస్తుంది—చూడు!" అని ఒక్క క్షణం నిశ్శబ్దంగా ఊరుకొని, "రెండు చాక్లెట్లు తెప్పించు గొంతు తడారిపోతోంది!" అంటూ చాప మీద చతికిలపడ్డాడు

స్నేహితుల ప్రోద్బలంతో నైతేనేం, వోడిపోతాననే అధైర్యంతో నైతేనేం రాధిక దెగ్గరికి వెళ్ళాడు ఆమె వెయిటింగ్ హాల్లో ఒంటరిగా కూర్చొని వుండటం చూచి

అతడిని చూస్తూనే ఆమె నవ్వింది దిగజారిపోకుండా చిన్నగా తనూ నవ్వాడు

"ఏమిటిలా వచ్చారు?" అన్నది

"మీతో కొంచెం పనుంది!" అని కాళ్ళూ చేతులు చూసుకొని వణకక పోవటంతో ఆశ్చర్యపోయి, నోట్లో వేలేసుకోబోయి ఎదురుగ్గావున్న రాధికను చూచి నోరు మూసుకున్నాడు

"మీరంతా ఎలక్షన్లలో నేను గెలవటానికి సహాయం చేయాలి!" అన్నాడు అప్పచెప్పినట్లుగా

"తప్పకుండా!" అంది

"థాంక్స్ వస్తా!" అని మళ్ళీ వెనుదిరిగి చూడకుండా స్నేహితుల మధ్య వచ్చి పడ్డాడు "అరె! ఏమిటి రాధిక ఎంత మంచిది?" అనుకుంటూ

ఎలక్షన్లు ఏలాంటి కొట్లాటలు లేకుండా ప్రశాంతంగానే గడిచిపోయినయి సాయంత్రం ఐదు గంటలకు కౌంటింగ్ మొదలు పెట్టారు

అందులో అన్యాయం జరక్కుండా ఉండేందుకుగాను ఆడవాళ్ళ తరపున రాధికను, మొగవాళ్ళ వైపు ఒక 'రావు'ను గూడా లోపలికొచ్చి కూర్చోమన్నారు

రాత్రి ఎనిమిదయినా ఇంకా లెక్కిస్తునే వున్నారు ఓంకారం ఒక మూల మాధవరావు మరొక మూల వరండాల్లో దిగాలుబడి నిల్చొని వున్నారు అప్పుడప్పుడు వాళ్ళ మిత్రబృందం 'ఊహాలెక్కలు' జేర వేస్తుంటే తేలిపోతూ వాలిపోతూ

మాధవరావుకు నించొని నించొని తలనొప్పేసింది మిగతా వాళ్ళంతా వోట్లు లెక్కించే గది వెంటిలేటర్లలోనుంచి లోపలికి తొంగి తొంగి చూస్తున్నారు

అటువంటి సమయంలో రాధిక హడావుడిగా మాధవరావు దెగ్గరికొచ్చి చిన్నగా, జాలిగా చెప్పింది "మాధవరావుగారూ! మీరు పది ఓట్ల తేడాతో ఓడిపోయారని చెప్పటానికి విచారంగా వుంది!" అని గిరుక్కున తిరిగి వెనక్కు వెళ్ళిపోయింది

ఆపుకోలేని ఏడుపుతో రిక్షాఎక్కి రూంకెళ్ళి బెడ్‌మీద పడి నిజంగానే ఏడ్చేశాడు ఖర్చుపెట్టిన డబ్బంతా వృధా దానికితోడు వోడిపోయినందుకు నామర్దా రాధిక ముందు తను ఇక తలెత్తుకొని తిరగలేడు!

కుళ్ళు తిరిగిపోయేలా దొర్లాడు జుట్టు ఊడిపోయేలా పీక్కొని కంట్లో చివరిబొట్టు వరకు నీరు కార్చేశాడు

వెంటనే శ్రీనివాసులు మాటలు గుర్తుకొచ్చి మెరీనాబీచ్‌కన్నావెళ్ళి వాడన్న పని చేద్దామని వంటిన వున్న ఖరీదైన గుడ్డలు విప్పేసి మాసిన చిరిగినవి కట్టుకొని విసురుగా తలుపు తీసుకొని బయట పడ్డాడు

"హల్లోవ్! కంగ్రాచులేషన్స్!" వర్షం కురిపించసాగారు, మిత్రులు చుట్టూచేరి మాధవరావును నలిపేస్తూ, వళ్ళు తెలియని అరుపులతో

పక్కింటి పిన్నిగారి మొగుడు నిద్ర చెడిందని వార్నింగ్ యివ్వటంతో మాధవరావును లోపలికి తోసుకొచ్చి తలుపులు మూశారు

మాధవరావు దిగజారిపోయి భయం భయంగా "ఏమిటిరా?" అన్నాడు

"తన్నండిరా వెధవని పట్టుకొని ఏడుపు మొఖం ఎప్పుడూ ఏడుపు మొఖ మేనుకొని! రెండు వందల తొంభైతొమ్మిది వోట్ల మెజారిటీతో గెలి

చినా ఆ మొఖంలో కాంతి లేకపోయె!" కొట్టేవాడి లాగా మీద మీదకి వస్తూ అరిచాడు శ్రీనివాసులు

రబ్బరు బెలూన్‌లా సంతోషంతో ఉబికి పగల బోయే సమయానికి గట్టిగా ముకుందాన్ని వాటేసుకొని "వ్వాట్?" అన్నాడు మాధవరావు

తరువాత రెండు మూడు గంటల తరువాత తేరుకొని ముకుందరావుని చాటుగా తీసుకెళ్ళి జరిగింది చెప్పాడు

"అబ్బ! గాలి తీసిందిరా!" అన్నాడు వింతగా ముకుందరావు

మాధవరావుకు కోపం వచ్చేటప్పటికి లోపల నిద్ర పోతున్న పౌరుషం లేచి కూర్చొని ఆవులించి, నీవు చరిచి "పద! మై డియర్ మాధవరావ్! నేనున్నాను!" అంది

మర్నాడు పన్నెండు గంటలు ఆలోచించి రాధికను ఏడిపించేందుకు ఆలోచనలు రాకపోగా తలనొప్పి మిగుల్చుకొని సాయంత్రం ఎలక్షన్ల తరువాత జరగబోయే మొదటి మీటింగ్‌కు అటెండ్ అయ్యేందుకు మిత్రబృందమంతా కాలేజీకి వెళ్ళారు

"ప్రిన్స్‌పాల్‌గారు పిలిచి "ఎజెండా తయారు చేయవోయ్ మాధవరావ్!" అన్నారు

ఖాళీ గదిలోకి వెళ్ళి కూర్చొని తెల్లకాగితం తీసుకొని ప్రోగ్రామ్స్ వ్రాయటం మొదలు పెట్టారు మిత్రులంతా

'మొట్టమొదట ప్రేయర్' అన్నాడు ముకుందం

"వెంకట్రావును పాడమందామా?" తలెత్తి అడిగాడు మాధవరావు వెంకట్రావు సినిమాలల్లో ఛాన్సుకోసరం ప్రయత్నిస్తున్న సంగీతం పిచ్చిగాడు!

శ్రీనివాసులు లేచి నిలబడి ముందుకువస్తూ "రాధికయితే ఎలా వుంటుంది?" అన్నాడు

ఆమాట వినటం ఆలస్యం అంతా రాధికే పాడాలన్నారు

"ఆమెకు పాటలు వచ్చునో రావో?"

శ్రీనివాసులు నవ్వాడు "అంత అందమైన అమ్మాయికి పాటలు రావంటే నేను ఒప్పుకోను!"

తిరిగి దానికీ మాధవరావే వెళ్ళాలన్నారు

ఆకాశం గర్జించినట్లయింది "చచ్చాన్రా దేవుడా!" అనుకొని తప్పక, తప్పుకోలేక చిన్నగా వరండాల్లో నిలబడివున్న ఆడవాళ్ళ గుంపులవైపుకు నడిచాడు

పొడుగ్గావున్న రాధిక యిట్టే కనబడింది ఆమె మొఖంలోనికళకొట్టొచ్చినట్లుగా ముందుకుదూకింది ఆమె చిరునవ్వు వాడిగావచ్చి సూటిగా గుండెల్లో దిగిపోయింది బాధగా కోటును చాటు చేసుకున్న గుండెను తడుముకున్నాడు

"రాధికాదేవి ! ఒక్కసారి యిలా వస్తారా!"

అమ్మాయిలంతా నిశ్శబ్దాన్ని ప్రేమించి, లాలించి జోకొట్టసాగారు

"మీటింగ్‌లో ప్రేయర్‌కు మీ పేరు ఇస్తాం!" అన్నాడు కొంచెం చనువు తీసుకున్నట్లుగా లోపల భయపడుతూనే

ఆమె ఒక్కక్షణం కలవరపడి "అబ్బెబ్బే లేదండి నాకు పాటలురావు నాలోని లోపమదే కావాలంటే ఒక గంట దేనిమీదైనా 'స్పీచ్' యివ్వమన్నా యిస్తానుగాని ఒక్క చరణం పాట గూడా పాడలేను!" అంది

"అయితే—?" అన్నాడు ఆమె ఏవన్నా అనుకుంటుందేమోనని విచారంగా మొఖం పెడుతూ

"అయితే ఏముంది — సుగుణ పాడుతుంది ఆమె పేరు వ్రాయండి!" అంటూ "సుగుణ!" అని పిలుస్తూ, తన స్నేహితురాళ్ళలో కలిసిపోయింది

సుగుణ పాటతో సభ ప్రారంభమయింది అధ్యక్షులైన ప్రిన్స్‌పాల్‌గారే ఒక గంట 'హమ్కు' కొట్టారు

తరువాత మాధవరావు ఇంటిదెగ్గర తయారయిన పాఠాన్ని అచ్చు తప్పు ల్లేకుండా, అప్పచెబుతున్నట్లు గాకుండా చెప్పి, మీరు నన్ను గెలిపించి ఆదరం చూపినందుకు మీ అందరికి నా కృతజ్ఞతాభివందనములు !" అంటూ కరతాళ ధ్వనుల మధ్య స్టేజీ దిగసాగాడు

ఆలా మెట్లు దిగుతుండగా ముందు వరుసలో కూర్చొనివున్న రాధికమీద అప్రయత్నంగా దృష్టి పడింది అనుకోకుండా ఆమె అందానికి అంజలులు

---

అది ఆలాయరు మొదటి కేసు
కోర్టులో ఒక దొంగ నిర్దోషి
అని వాదించి గెలిచాడు దొంగ
కృతజ్ఞతతో నమస్కరిస్తూ,
మీమే లెప్పుడూ మరిచిపోను
మిమ్మల్లో మారు ఆఫీసులో
కలుసుకుంటాను "
లాయరు తెల్లబోయి
"నాయనా దయచేసి పగటివేళ
ల్లో నే నన్ను కలుసుకో
అన్నాడు

ఫిరదౌసి (భీమవరం)

---

అర్పించాలనుకున్నాడు ఆముగ్ధ మోహనాకారం అతణ్ణి వివశుణ్ణి చేసింది తిరిగి మరుక్షణంలో అతడిలోని పౌరుషం ఒక్క తన్ను తన్ని "నిన్ను ఏడిపించిన రాధిక నేనా ఇంతయిదిగా పొగుడుకుంటున్నావు?" అన్నది ఆ మాటలు వినటంతోనే రోషం ముంచ్చింది ముక్కుపుటాలు ఎగర వేశాడు

ఆ సమయంలో ఆ అందమైన మొఖంలో దాగివున్న ఠీవి, గర్వం, టెక్కు, బయల్పడి మాధవరావును పురికొల్పాయి

విసురుగావెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు

ఎవరికి తోచిన విధంగా వాళ్ళు స్టేజీ ఎక్కి వరుసగా చెప్పుకు పోతున్నారు

ఉన్నట్లుండి మాధవరావుకు ఒక ఆలోచన తట్టింది పక్కనేవున్న ముకుందాన్నితట్టి బయటకు నడిచి, రాధికను ఏడిపించటానికి తనకు తట్టిన ఐడియాను చెవిలో చెప్పాడు

"ఈ దెబ్బతో మాధవరావు అంటే ఏవిటో తెలిసి వస్తుంది!" అన్నాడు పెద్దగా

ముకుందం నీవు చరిచి! భేష్' అన్నాడు.

ఉపన్యాసకులు ఇకలేరు అనుకున్న తర ప్రిన్స్‌పాల్‌గారు ముగింపు మాటలకోసం లేవబో సమయంలో మాధవరావు ఒక్క ఉదుటున మీదకు దూకాడు

అధ్యక్షులవారు మెదలకుండా కూర్చున్నారు.

"క్షమించాలి! ఒక్కమాట" అని రాధిక మె లోకి చూచి తిరిగి తలెత్తి "రత్నమంటే వి వున్నది కాని అది బాహ్య ప్రపంచంలో వున్నప దాని మెరుపులుచూచి మెచ్చుకుంటారు జనం కాకుండా ఇంట్లో ఏ పెట్టెపెట్టెలోనో ఐ వుంచారే అనుకోండి—అది ఎవరికీ తెలియదు విలువ గ్రహించలేరు దానిని నలుగురి మధ లాగవలసిన బాధ్యత చుట్టూవున్న మనుష్యులకే ఆధారపడివుంటుంది"

జనం అంతా అతడు చెప్పేదేవిటో అర్థం శ్వాసబిగపట్టుకొని వింటున్నారు

"ఇంతకీ ఎందుకు చెబుతున్నానంటే మన కా జీలో అమోఘంగా పాడగల లేడీ స్టూడెంట్స్ ఎంద వున్నారు కాని వారు అంత చక్కగా పాడగల చాలా కొద్దిమందికి తెలిసివుండవచ్చు"

ఆడవాళ్ళల్లో గుసగుసలు కలవరం బం ల్దేరింది

"రాధికనే తీసుకోండి ఆమెతో లతా మం ష్కర్ గూడా పోటీ రాలేదు! ఆ మాట అంట న్నప్పుడు రాధిక మొఖంలోకి చూచాడు— పూర్తి నల్లగా మాడిపోయివున్నది! ఆమె భీకరంగా కొట్టా చేటట్లుగా తన వంకే చూస్తోంది!

మాధవరావు కలవరాన్ని కప్పిపుచ్చుకుంటూ "ఆమె మాధుర్యపు కంఠంతో మిమ్మల్ని ఆనంద బ్ధిలో తన్మయుల్ని గావించబోతోంది!"

కరతాళధ్వనులు ఆ హాలు టాపును లేపుతున్నాయి. ఎటూ చూడకుండా తలవంచుకొని తన సీట్లో మెదలకుండా కూర్చున్నాడు

రాధిక విసవిసా స్టేజీమీదకు నడిచి, "మాధవరావుగారు పొరబాటు పడ్డారని చెప్పటానికి చింతిస్తున్నాను క్షమించాలి నాకు పాడటంరాదు నమస్తే!" అని క్రిందకు దిగబోయింది

స్టూడెంట్స్ అంతా విజిళ్ళువేసి, చప్పట్లు గొడుతూ, "మీరు పాడవల్సిందే!" అని గోల చేయసాగారు

ప్రిన్స్‌పాల్‌గారి సౌంజ్ఞలకు విలువలేకపోయింది.

రాధిక కోపం తార స్థాయినందుకుంది ఎట్లాగైనా మాధవరావుకు బుద్ధి చెప్పాలనుకుంది మాధవరావు గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి ముందు ఏం జరుగుతుందోనని

రాధిక తిరిగి మైకుముందుకొచ్చి నిలబడింది "ఇంత మందిని నిరుత్సాహపరచటం నా కిష్టంలేదు గనుక ఒక పాట పాడటానికి ప్రయత్నిస్తాను!" అంటూనే పాట మొదలు పెట్టింది

ఆ గొంతులోని తియ్యదనం ఏ ఒక్కరితోను పోల్చలేనంత అద్భుతంగా వున్నది

హాల్లో వారంతా పాటపూర్తయ్యేటప్పటికి ఆనందంతో 'ఒన్స్‌మోర్' అంటూ చప్పట్లు కొడుతూ వున్నారు

# నేను ఓడిపోయాను

మాధవరావు కళ్ళు తిరిగినయి తనువేసిన అయిడియా అంతా బూడిదైంది

పక్కనవున్న ముకుందం చప్పరిస్తూ 'మళ్ళా గాలి తీసిందిరా!' అన్నాడు

'గాలి గాలి అని గోల చేశావంటే గోళ్ళూడగొడతా గాడిదా!'' అని విసుక్కున్నాడు

మాధవరావు మొఖంలో నెత్తురుచుక్క లేకుండా అయిపోయింది అదే సమయంలో రాధిక అతడి ముందు తలెత్తుకొని అతడివంక ఎక్కిరిస్తున్నట్లుగా చూస్తూ రీవిగా నడిచిపోయింది

ఏడుపు మొఖంతో రూంకుజేరి నీరసంగా తలుపు తాళం తీసి లైటు వేశాడు ఆరోజే వచ్చిన ఉత్తరం దొర్లుతోంది

తీసిచూశాడు అన్నయ్య దగ్గరినుండి

తమ్ముడికి,

నీవొానాన్నే ఆర్థాంగీకారంగా తీసుకొని నీకు సంబంధం చూచాం మీ వదినకి వరసకి బాబాయి గారి కూతురు ఒక అమ్మాయివుంది అందంగానే వుంటుంది ఆ అమ్మాయిని చేసుకోవటానికి నీకు ఏ అభ్యంతరం వుండదనుకుంటాను అన్నీ నచ్చటం వలన నీవు పిల్లను చూడకముందే అంతా నిర్ణయం చేశాం!

ఇట్లు
మీ అన్నయ్య సీతాపతి

"ఈ పెద్దవాళ్ళు—ఈ ఆడవాళ్ళు" అని పళ్ళు కరకరా కొరుక్కొని తలపట్టుకొని మంచంమీద కూలబడ్డాడు కాలేజీ గుడ్డలయినా విప్పకుండా మాధవరావు!

* * *

మూడు రోజులు కాలేజీ ఎగకొట్టాడు తల తీసేసినంతపనయి రోజూ చేసుకునే గడ్డం జోలికి అసలు పోనేలేదు ఆకలయినా అన్నం తినడు తిన్నా సయించదు సయించినా రాధిక కళ్ళముందు కదిలి వీసమెత్తయినా లోపలికి పోనీయదు

నాలుగోరోజు పాఠాలన్నీ పోతయ్యేమోనని భయమేసి ఆ దిగాలుపడిన మొఖంతోనే కాలేజీకి వెళ్ళాడు.

ఈ మూడు రోజుల పట్టి అతడిని ముప్పుతిప్పలు పెట్టిన సమస్య ప్రశ్న—ప్రతి దాంట్లోను తననే దెబ్బ కొడుతున్న రాధికకు తిరుగు దెబ్బ ఎలా కొట్టాలి? దానికి సమాధానం శూన్యం!

బ్యాంకింగ్ లెక్చరర్ పాఠం చెబుతుంటే ఒక వూహ కలిగింది తట్టటమే ఆలస్యం బయటకెళ్ళి కాలేజీ ఎదురుగావున్న 'హెయిర్ కట్టింగ్ సెలూను'లో గడ్డం గీయించుకొని, తల దువ్వుకొని మళ్ళా క్లాసులో కూర్చొని హుషారుగా నవ్వుకున్నాడు

"ఈ దెబ్బతో మాధవరావు మాట అనుకుంటేనే రాధిక గుండెల్లో మెడ్రాస్ మెయిల్ పరుగెత్తాలి!" అనుకుంటుండగానే అనుమానంవచ్చి, "ఎట్లాగబ్బా?" అనుకొని నున్నగావున్న గడ్డాన్ని పీక్కున్నాడు

క్లాసు వదిలారు బయటకొచ్చి స్తంభాన్నానుకొని నిలబడ్డాడు మాధవరావు

ముకుందరావు వచ్చాడు "ఏరా బ్రదర్! క్షణ

క్షణానికి నీ ముఖమే మారుతోందేం?" అంటూ

"అరేయ్! ఎల్లుండి సాయంత్రం ఐదు గంటల దాకా నన్ను మాట్లాడించబోకురా!" అన్నాడు దూరంగా పోస్టు బాక్సులో ఉత్తరం వేస్తున్న రాధికను చూస్తూ

చూస్తూనే చిటికవేసి ఎగిరి గంతేశాడు

కాలేజీ అయిపోయినా కాంటీన్‌లో కాఫీ త్రాగుతున్నట్లుగా, పోస్టుబాక్సు క్లియరెన్స్‌కు పోస్ట్‌మాన్ వచ్చిందాకా కూర్చొని, ఏడుపు మొఖంతో "మిస్టర్! లెటర్ పొరపాటున తప్పు అడ్రసు వ్రాసి పోస్టు చేశాను తీసుకుంటాను!" అన్నాడు

అతడు మాధవరావు మొఖానికి జాలిపడి, "ఏరుకోండి" అని మొత్తమిచ్చాడు

దబదబా రాధిక సంతకంఉన్న ఉత్తరం తీసుకొని "థాంక్స్" అంటూ పోస్టుమాన్ పిలుస్తున్నా గూడా వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు

తిరిగి తిరిగి రోడ్లవెంట తిరిగే చిన్ననాటి మిత్రుడు వెంకట్రావును రాత్రి పన్నెండు గంటలకు పట్టుకొని ఒక ఉత్తరం వ్రాసి పెట్టమని బ్రతిమాలాడు

వెంకట్రావు ఎవ్వైనా దస్తూరీ చూపిస్తే అచ్చం వాళ్ళు వ్రాసినట్లుగానే ఏద్దైనా వ్రాసి పెట్టగల సమర్థుడు !

"ఏమీలేదు రెండే మాటలు—

మై డియర్ మాధవరావ్! రేపు సాయంత్రం ఐదు గంటలకు మా యింటికి టీ కి వస్తారుగదూ?

రాధిక

వ్రాసిన ఉత్తరాన్ని భద్రంగా జేబులో పెట్టుకొని రూంకు పోతూ దారిలో రాధిక వ్రాసిన ఉత్తరం రోడ్డు ప్రక్కనున్న డబ్బాలో వేశాడు

తను వేసిన ప్లాన్లు ఊహించిన ఊహలు రాత్రి కల్లో గిర్రున తిరిగి పరాభవం చెందిన రాధికను చూపెట్టినాయి

సాయంత్రం ఐదవటంతోనే తను లేస్తాడు బాతురూంలోకెళ్ళి మొఖం కడుక్కొని 'ట్రిమ్ము'గా మేకప్ చేసుకొని జేబులో రాధిక వ్రాసిన ఉత్తరం లాంటి ఉత్తరం పెట్టుకొని వాళ్ళింటికి వెళతాడు

వాకిట్లో ఆమె తండ్రిగాని, తల్లిగాని ముందుగా ఎదురు పడతారు తనను చూస్తూనే ఆశ్చర్యపడి "ఎవరు కావాలి ఎందుకొచ్చారు?" అని అడుగుతారు

"ఏమీ లేదండి రాధిక కోసరం నేను ఆమె క్లాసు మేట్‌ను!" అంటూ భయం భయంగా చెబుతాడు

"..యితే—?" అంటారు విసుక్కుంటున్నట్లుగా

..దలకుండా తన జేబులోని ఉత్తరం తీసి చూపిస్తాడు

వాళ్ళు కోపాన్ని చేసేదేమీలేక లోపలికి మింగేసి తను అక్కడున్నంతసేపు డొంక తిరుగుడుగాను, తను వచ్చిం తరువాత నూటిగాను "ఒక పెళ్ళి కావాల్సిన పిల్లకు యింటికి వచ్చేటంత బాయ్ ఫ్రెండ్ వున్నందుకుగాను 'చ' కొరగుళ్ళు పెడతారు అప్పుడు చూడాలి రాధిక మొఖం 'అబ్బ!' అనుకున్నాడు

ఒకవేళ రాధిక ధైర్యంగా నేను అసలు ఆ ఉత్తరం వ్రాయలేదు పొమ్మంటే అది రాధిక వ్రాత కాదు అని నిరూపిస్తే వెంకట్రావు నిల్చున్నపాటున ఆత్మహత్య చేసుకుంటానని వ్రాసిచ్చినంత నమ్మకంగా మాట యిచ్చాడు

'ఆత్మహత్య' అనుకునేటప్పటికి తెల్లవారు జామున మూడు గంటలకే మెళుకువ వచ్చింది మళ్ళా వచ్చినా నిద్ర పట్టలేదు

ఆదివారాన్ని 'ఖుషీ'గా అనుభవించి ఐదు గంటలకు అందంగా టాయిలెట్ అయి ఉన్న వాటిల్లో కెల్లా ఖరీదైన సూట్ తీసి తొడుక్కున్నాడు క్రీమ్‌తో మెత్తబడిన జుట్టును తిరిగినన్ని వంకీలు తిప్పి కదలకుండా అమర్చాడు

కాఫీ రంగు ప్యాంటు, మల్లెపువ్వులాంటి తెల్ల చొక్కా, వేసుకుని అద్దె టాక్సీలో రాధిక వాళ్ళ బంగళా ముందు దిగాడు

దిగి నలుమూలలా చూచి అదే రాధికవాళ్ళ గృహమని దృఢ నిశ్చయానికివచ్చి గేటులోనుండి లోపలికి చూచాడు గేటుకు వంద గజాల దూరంలోవుంది యిల్లు మధ్య అందమైన పూదోట యింటికి ఆకర్షణీయంగా వున్నది

లోపలికి అడుగువేస్తూ అనుకున్నాడు—తనని ఛీదియస్తుడని, అలుసుచేసి ఏడిపించిన రాధికకు కొద్ది క్షణాల్లో ఏడ్చేటంత పరిస్థితి ఏర్పడబోతుందని!

విలాసంగా నవ్వుకున్నాడు అద్దంలో చూచుకుంటున్నట్లుగా నొక్కుల నొక్కుల జుట్టును చేతిలో సర్దుకున్నాడు

గేటుదాటి లోపలికి రెండడుగులు వేశాడో లేదో ఒక కుక్క 'భౌ భౌ' అని భీకరంగా అరుచుకుంటూ, అతిరయంగా పరుగెత్తుతూ వచ్చింది మాధవరావు ఆలోచనా ప్రపంచంనుండి అసలు ప్రపంచంలోపడి అప్రతిభుడై రెండడుగులు వెనక్కువేసి గేటువంక చూచాడు 'కుక్క వున్నది జాగ్రత్త' అన్న బోర్డును

ఆ కుక్కవెంటే తోటమాలి గాబోలు పరుగెత్తుకుంటూవచ్చి, దానిని పట్టుకొని "ఫరవాలేదు, వెళ్ళండి బాబు!" అన్నాడు

మాధవరావు చిరు చెమటను మడత విప్పని జేబురుమాలతో అద్దుకొని వడివడిగా లోపలికి నడిచాడు

పోర్టికోలో కాలు పెడుతూనే హాలులో సోఫాలో కూర్చొనివున్న కోరమీసాలాయన్ని రాధిక తండ్రి గాబోలు అనుకుంటూ చూచి నిలువెల్లా వణికిపోయాడు 'గోల్డుఫ్రేమ్' కళ్ళజోడు వెనుక పత్తికాయలంత గుడ్లు, మొరటుగా నిక్కబొడుచుకున్న జుట్టు, నల్లని నలుపు—లావుగా భీకరంగా వున్నాడు

తనని చూస్తూనే కాఫీ త్రాగుతున్న ఆయన మీదపడి కరుస్తాడేమోనన్నంత భయమేసింది— ఆయన ప్రక్కనే అచ్చం అన్నీ రాధిక పోలికలేవున్న తల్లి నిలబడివుంది

మాధవరావును చూస్తూనే "ఎవరు? ఏం కావాలి?" అన్నాడు ఆయన చాలా మృదువుగా

"ఆకారంలోనే గాబోలు భీకరం" అనుకొని తడారిన గొంతుకను తడి చేసుకొని "రాధిక కోసరం" అని నసుగుతూ గొణిగాడు

# నేను ఓడిపోయాను

ఆయన చిరునవ్వు నవ్వి "పైన వుంది వెళ్ళండి!" అన్నాడు

ఆమె ఎడమవైపుకు తిరిగి "అటు బాబు మెట్లు" అంది

మాధవరావు వాళ్ళ మాటలకు నీరు కారిపోయి, తాను ఆశించిన ఫలితం రాకపోవటంతో నిరుత్సాహ పడ్డాడు మరుక్షణంలోనే తేరుకొని చిన్నగా మెట్లెక్కి పైకిపోయాడు

సంశయిస్తూ హాలులో కాలు పెట్టాడు రెండు మూడు సోఫాలు హాలులో దూరం దూరంగా అమర్చి వున్నాయి విలువైన తివాసీ నేలనంతా కప్పి వేసివుంది ఒక మూలగా 'స్టాండ్'మీద పూలకుండీ గులాబిలను మరిపించేంత అందంగా మెరుస్తోంది గోడలమీద నాలుగు వైపులా నాలుగే నాలుగు ఫోటోలు వ్రేలాడుతున్నాయి—" చాలా అందంగావుంది ఆ హాలు

రాధిక ఎక్కడా వున్నట్లు అలికిడి వినబడలేదు—కాని పక్క గదిలోంచి రేడియో స్వరం లీలగా వినిస్తోంది అక్కడే రాధిక తప్పక ఉండి ఉండాలను కున్నాడు

అనుకోవటమే తడవుగా చిన్న దగ్గు దగ్గి ఆ గది వైపుకు నడిచాడు

రెండడుగులు వేశాడో లేదో ఆ గది పూర్తిగా కనపడింది ఆ గదిలో మధ్య ఈజీచైరులో రాధిక కూర్చొని తన వంకే చిరునవ్వుతో చూస్తోంది!

ఆమె చిరునవ్వుకు తట్టుకోలేకపోయాడు ఆమె కళ్ళు సూదుల్లాగావుండి తన గుండెల్లో పొడుస్తున్నట్లనిపించింది ఆమె నుదిటిమీద నృత్యం చేస్తున్న ముంగురులు తన వీపుమీద తనకంటే బలమైనవాడు 'తధికిణతోం' చేస్తున్నట్లుగా వున్నది ఆ అందమైన మొఖంలోనుండి సూర్య కిరణాలు బయల్పడి తనని మాడుస్తున్నాయి

కళ్ళు రెపరెపలాడించి పెదిమలను దగ్గరకు జేర్చి మరుక్షణంలోనే విస్తృతంచేసి తెల్లని పలు వరసను తళుక్కుమనిపించింది ఆ కదలికలో చెవులకు పెట్టుకున్న ఖరీదైన రాళ్ళతో నిండిన వెడల్పైన దిద్దుల్లో లైటుకాంతి కలుక్కుమని మాధవరావు గుండెల్లో జల్లుమంది

మాధవరావు కొయ్యబొమ్మైపోయి ఆమెను అలాగే కన్నార్పకుండా, శ్వాస పీల్చుకోకుండా చూస్తూ నిలబడ్డాడు అకస్మాత్తుగా భయమేసింది అసలు ఎందుకొచ్చానా అని కలవరపడ్డాడు కాళ్ళు వణికి కళ్ళు తిరగసాగాయి— "అమ్మబాబోయ్! రాధికను ఏడిపించటమే?" అనుకున్నాడు

"హే భగవాన్! జీవితంలో రాధిక జోలికి నే నెప్పుడూ వెళ్ళను!" అని మనస్సులోనే చెంపలు వాచేటట్లుగా కొట్టుకున్నాడు

ఏమైతే అదైంది ఇక వెనక్కువెళ్దామను కున్నాడు బలవంతంగా, గాఢంగా, బాధగా ఒక నిట్టూర్పు విడిచి వెనుదిరిగాడు

"రాబావా! వెళ్ళిపోతావేం!" అంది ఆ మాటలు వీణమీద గోటితో మీటినట్లున్నాయి.

ముకుందంగాడు పక్కనే ఉన్నట్లే అనిపించింది "గాలితీసిందిరా బాబు!" అనుకున్నాడు "నే నెక్కడ బావనురా నాయినా?" బావ అనే మాట తనమీద ఉపయోగించిన చోదితాస్త్రంలాగా వుంది

"ఈ రోజు నా కొంప మునిగేటట్లే వుందే!" అనుకున్నాడు "అతి తెలివికి పోయినందుకు అగాధంలో పడ్డానే!" అనిపించి ఏడ్చాడు

మాధవరావు మొఖంలో సూదిపెట్టి పొడిచినా నెత్తురు బొట్టు బయటకు రాదు కళ్ళు చూద్దామన్నా కనబడకుండా పీక్కుపోయి లోపలికి పోయినయి పైన ఫ్యాను తిరుగుతున్నా చొక్కా చెమటతో తడిసి ముద్దయింది —అసలు మనిషి ఇంకా కొద్ది క్షణాల్లో ఉరితీయటానికి ఉరికంబంమీద నిలబెట్టిన మనిషిలా తయారయ్యాడు!

రాధిక తలుపుదాకా వచ్చింది "అక్కడే నిలబడి పోయావేం—రా బావా కూర్చుందాం!" అంది

చేసేదేమీలేక, ఇంకేమన్నాఅంటే గట్టిగా అరుస్తుందేమోనని, తోటకూరకాడల్లా కాళ్ళను యీడ్చుకొని వెళ్ళి సోఫాలో కూలబడ్డాడు

రెండు నిముషాలు మౌనంగా గడచిపోయినయి.

"ఒక్కక్షణం ఏమనుకోబోకు టీ తెస్తాను! నన్ను అటుపోనిచ్చి బయటకు పరుగెత్తేవు!" నవ్వుతూ ఆ గదినుండి బయటకు వెళ్ళింది

మాధవరావు లేచి ప్రక్కనేవున్న ఫాన్ 'ఫుల్ స్పీడ్'లో తిప్పి చొక్కాలోకి గాలిని ఎక్కించటానికి తాపత్రయపడసాగాడు

"మరిదంటే ఏమోననుకున్నా ఘటికుడే! ఏమయ్యా మధు మాట మాత్రం ఉత్తరం ముక్కయినా వ్రాశావుగాదేం రాధిక నీకు తెలుసని ఇదే నయ్యా మా బాబాయి కూతురు పిల్లను నీకు చూపించకుండా నే నిశ్చయించాం నీవేమంటావోనని భయపడుతున్నాం! అంది కొంగు అడ్డం పెట్టుకొని నవ్వాపుకుంటూ అప్పుడే హాలులోకి వచ్చిన వదిన. "మీ అన్నయ్య గూడా వచ్చారు పొద్దున్నే!"

అసలే భారంగావున్న పరిస్థితులకు వదిన గూడా తోడయ్యేటప్పటికి మాధవరావుకు పై ప్రాణాలు పైనే పోయినయి తరువాత తేరుకొనేటప్పటికి అర గంట పట్టింది

తేరుకున్న తరువాత మొట్ట మొదటిసారిగా అనుకున్నమాట "రాధిక ఎంత మంచిది!"

చేసినపని పై జేబులో కనుబడుతూ పెట్టుకున్న రాధిక వ్రాసినలాంటి ఉత్తరం ఎవరూ చూడకుండా వెనుక జేబులోకి మార్చుకున్నాడు

* * *

ఆరు నెలల తరువాత ఒక రోజు రాత్రి పాత స్మృతులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ రాధికకు అతి సమీపంగా జరిగి "నిన్ను ఎన్నో విధాల ఏడిపించాలని చూచాను గాని నేనే ఓడిపోయాను!" అన్నాడు మాధవరావు

ఆమె చటుక్కున ఎర్రబడిన బుగ్గలను మాధవరావు భుజంమీద ఆనించి కళ్ళు మూసుకున్నది!

# ధృవతార

(27-వ పేజీ తరువాయి)

**వీడానికి యిది ఆత్మహత్యా సదృశమైన విషయం.**

బియ్యం గిన్నెలోపోసి కడిగి కుంపటిమీదవుంచి కాఫీ కలుపుతూ వుండగా మరో విషయం జ్ఞప్తికి వచ్చింది తాను స్కూల్ ఫైనల్ చదువుకునే రోజుల్లో జానకిరామారావనే వాడొకడు తన క్లాసులోనే వుండేవాడు వాడి తెలివి తేటలు టీచర్లకే అబ్బురంగా వుండేవి అందరూ "వీడు అయిన్‌స్టైయిన్‌ను మించిన శాస్త్రజ్ఞుడో 'లేక' రామానుజాన్ని మించిన గణిత శాస్త్ర నిధిగానో అవుతా"డని వాణ్ణి గురించి చెప్పుకుంటూ వుండేవారు వాడా రోజుల్లోనే చిన్న చిన్న పరిశోధనలు చేస్తూ వుండేవాడు రకరకాల ఆ ్రలూ, ఫిలుములూ సంపాదించి వాళ్ళ యింటి ముందు గదిలో 'సినిమా' వేస్తూ వుండేవాడు వాళ్ళ అక్కగారి యింట్లో ఎన్నటిదో పాడైపోయిన 'గ్రామ ఫోన్' వుంటే దాన్ని తీసుకునివచ్చి దసరా సెలవులలో నాలుగైదు రోజులు యింట్లోనుంచి బయటికి రాకుండా పని చేసి, దాన్ని బాగు చేశాడు

కాళిదాసు వేడిగా పొగలు కక్కుతున్న కాఫీని త్రాగుతూ గుర్తుకు తెచ్చుకున్నాడు ఆ జానకి రామారావు మళ్ళీ మూడు సంవత్సరాల క్రిందట ఒకనాడు చాలా విచిత్రమైన పరిస్థితులలో తనకు కనిపించాడు తాను తన అక్కగారి వూరికిపోయి తిరిగి వస్తున్నాడు అది వర్షాకాలం మురికి వానలు కురుస్తున్నాయి తన అక్కగారిది చిన్న పల్లెటూరు రైలు స్టేషనుకు దాదాపు ఆరు మైళ్ళ దూరంలో వుంటుంది ఆ వూరు ఊరినుంచి స్టేషనుకు రావాలంటే పొలంగట్లమీదపడి నడిచి రావలసిందే తప్ప మరో మార్గంలేదు సాయంకాలం అయిదు గంటల వేళ బయలుదేరిన కాళిదాసు స్టేషనుకు నడిచి వచ్చేసరికి చీకటి పడింది సన్నగా జల్లు కూడా ప్రారంభమైంది తీరా కనుక్కుంటే ఆతడు వెళ్ళవలసిన బండి అప్పటికి అరగంట క్రితమే వెళ్ళిపోయిందనీ, మళ్ళీ బండి రాత్రి తొమ్మిది గంటలు దాటిన తర్వాతగాని లేదనీ తెలిసింది అది చాలా చిన్న స్టేషను ఇద్దరు పోర్టర్లూ, స్టేషన్ మాస్టరూ తప్ప మరెవరూ లే రక్కడ వారి క్వార్టర్సు కూడా స్టేషనుకు రెండు మూడు ఫర్లాంగుల దూరంలో వున్నాయి స్టేషనులో ప్రయాణికులు కూర్చుండేందుకు ఒకచిన్న హాలు మాత్రం వుంది ఆహాల్లో పైనుంచి ఒక దీపం వ్రేలాడుతున్నది కాళిదాసు మార్గాంతరంలేక అక్కడే ఒక బల్లమీద కూర్చున్నాడు బయట చీకటి చిక్కగా భయంకరంగా వ్యాపిస్తున్నది ఎదురుగా కనుచూపు మేర అంతటా పొలాలు, కీచురాళ్ళ ధ్వనీ నీళ్ళగుంటలలో కప్పల అరుపులూ, దిగంతాలనుంచీ బాణవేగంతో పొలాలమీదకి వీచే గాలి చేస్తున్న సవ్వడీ, అప్పుడప్పుడు పోర్టర్ల కేకలూ తప్ప మరేమీ వినిపించటంలేదు వాన మరింత పెద్దదయింది ఇంతలో ఒక వ్యక్తి విసురుగా మెట్లెక్కి లోపలికి వచ్చాడు అతని దుస్తులు కొద్దిగా తడిసినయ్ అతడు చొక్కాలో పొడిగా వున్న భాగంతో, నీటి బిందువులతో తడిసిన కళ్ళద్దాలను తుడుచుకుని పెట్టుకున్నాడు అవి చాలా మందమైన అద్దాలు అతడు కాళిదాసువంక ఒక్క క్షణంచూసి నవ్వాడు అతనిది బట్టతల సన్నగా వున్నాడు వంటిమీదవున్న చొక్కా పంచె మాసిపోయి వున్నాయి కాళిదాసు అతన్ని గుర్తు పట్టలేకపోయాడు చివరకు అతనే "అరె! ఇంకా గుర్తు పట్టనేలేదా? నేను జానకిరామారావును" అని పరిచయం చేసుకున్నాడు కాళిదాసు ఆశ్చర్యపోయాడు తర్వాత యిద్దరూ హృదయాలు విప్పి మాట్లాడుకున్నారు చిన్నతనపు రోజులను మననం చేసుకున్నారు జానకిరామారావు మనిషయితే తగ్గిపోయాడుకాని అతని తెలివి తేటలు ఎన్నోరెట్లు పెరిగినయ్ కాళిదాసతన్ని "అయితే నువ్వింతకూ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు ఈ ప్రశ్న వెయ్యగానే ఆ స్టేషనులో ఆగని బండి ఏదో విపరీతమైన శబ్దం చేస్తూ మహావేగంతో వెళ్ళిపోయింది ఆ ఘోష తగ్గిన తర్వాత జానకి రామారావు "ఏదీ? ఇంకా ఎక్కడా 'సెటిల్' కాలేదు అయినా నే నొక పెద్ద ప్రయత్నంలో వున్నాను అది ఫలిస్తే యిక మన కీ ప్రపంచంలో అడ్డే లేదు!" అన్నాడు. అతడు తర్వాత కాళిదాసు అడ్రసు అడిగి తీసుకున్నాడు అతని అడ్రసు అడిగితే "నేను చెప్పలేను కాళీ! ఇప్పుడొక వూరనీ ఒక చోటనీలేదు నేను ఎక్కడో సెటిల్ అయిన తర్వాత నీకు వ్రాస్తానులే" అన్నాడు

తరువాత కొంత సేపటికి రైలు వచ్చింది జానకి రామారావు మరోవైపు వెళ్ళవలసివుంది అందువల్ల కాళిదాసు బండి యెక్కి వచ్చేయటం జరిగింది అంతే! ఆ తర్వాత మళ్ళీ అతను కనుపించనేలేదు స్కూల్ ఫైనల్ పరీక్షలకు ముందు తీయించుకున్న పోటోలో తనకు ముఖ్యమైన స్నేహితులందరూ వున్నారు ఆ ఫోటో అద్దం పగిలిపోయింది మధ్యగదిలో ఒక పాత పెట్లో పడేసినట్లు జ్ఞాపకం

కాళిదాసు లేచాడు ఇక దిన పత్రికలో మిగిలిన విషయాలు చదివే వ్యవధిలేదు అన్నం ఉడుకు పట్టింది ఈ లోపల కూరల బుట్టలో కూర లేవైనా వున్నాయో లేవో చూసుకోవాలి

పొద్దెక్కుతున్నది బల్లమీదవున్న గడియారం తొమ్మిది గంటలు చూపిస్తున్నది ఇవాళ అతనికి బడిలో పొద్దునపూట రెండు గంటలు తప్ప పనిలేదు మధ్యాహ్ననికలా అతని పని పూర్తిగా అయిపోతుంది



## ధృవతార

పది గంటలు కొట్టేసరికి కాళిదాసు ఒక్క కూరతో భోజనం ముగించి స్కూలుకు బయలు దేరాడు అన్ని తలుపులూ భద్రంగావేసి లలమారులో నుంచి మూడు పది రూపాయల నోట్లు తీసుకున్నాడు చిల్లరతో నిండిన హుండీ అలాగే వుంది

బయట ఎండ మాడ్చి వేస్తున్నది ఆ వీధిలో వున్న ఎలిమెంటరీ స్కూలు వదిలినట్టున్నారు చిన్నచిన్న పిల్లలందరూ పలకలూ పుస్తకాలతో గోల చేస్తూ యిళ్ళకు పోతున్నారు ఆకాశంలో ఒక రంగురంగుల పిట్ట విశ్రాంతిగా పలటీలు కొడుతూ ఎగురుతున్నది

కాళిదాసు నెమ్మదిగా నడిచి స్కూలు ఆవరణలో అడుగుపెట్టే సరికి మొదటి గంట కొట్టారు అతడు రిజిస్టరులో సంతకం చేసి రూములోకి వెళ్ళేసరికి పట్టాభి కుర్చీలో కూర్చుని సిగిరెట్టు కాలుస్తూ కిటికీలోనుంచి అవతలవైపు వున్న పూల మొక్కలవంక చూస్తున్నాడు కాళిదాసు రాగానే అతడు వెనుదిరిగిచూసి తాపీగా "ఇవాళ నీకు మధ్యాహ్నంనుంచి 'వర్కు' లేదుగా? బజారుకు

పోదాం వస్తావా?" అని అడిగాడు కాళిదాసు తల వూపి "ఏమిటి విశేషం?" అని ప్రశ్నించాడు పట్టాభి సిగరెట్టుపొగను రింగులు రింగులుగా వదులుతూ "ఏమీ లేదోయ్ ఒక పంచెల జత తీసుకుందామనుకుంటున్నాను" అని చెప్పాడు

కాళిదాసు కుర్చీలో కూర్చుంటూ "మీ మామగారి దగ్గరినుంచి ఏమీ ఉత్తరం రాలేదా?" అని అడిగాడు పట్టాభి నవ్వి "లేదోయ్ కాన్పు వచ్చే రోజులే యివి" అన్నాడు

ఇద్దరూ ఒక్క నిముషంసేపు నిశ్శబ్దంగా కూర్చున్నారు ఎదురుగావున్న క్లాసులోనుంచి సైన్సు మేస్టరు నరసింహమూర్తి ఎవరో కుర్రవాణ్ణి బయటికి వెళ్ళగొట్టాడు వాడు పుస్తకాలు తీసుకుని స్కూలు ఆవరణలోవున్న గంగరావి చెట్టుక్రిందికి వెళ్ళి కూర్చున్నాడు

ఇంతలో ప్యూన్ గదిలోకి తొంగిచూసి, కాళిదాసుతో "మిమ్మల్ని హెడ్మాస్టరుగారు రమ్మంటున్నారండి" అన్నాడు పట్టాభి సిగరెట్టును కిటికీలోనుంచి విసిరి పారేస్తూ "ఏదో విశేషం వున్నట్టుంది వెళ్ళిరా" అన్నాడు కాళిదాసులేచి ప్యూన్ వెంట హెడ్మాస్టరుగారి రూముకు వెళ్ళాడు

ఆయన నలభై అయిదేళ్ళవాడు ఎర్రగా లావుగా వుంటాడు కుర్చీ నిండుగా కూర్చుని వున్నాడు ఆయనకు పిల్లలుపెట్టిన పేరు 'రోడ్డు రోలరు' ఆయన కాళిదాసు నమస్కారం అందుకుని ప్రతి నమస్కారంచేసి "ఇవాళ మీకు అదనంగా యిబ్బంది కలిగించవలసివచ్చినందుకు చాలా విచారిస్తున్నాను కోటేశ్వరరావు సెలవు పెట్టారు ఆయన భార్య కవల పిల్లలను కన్నదిట ఆస్పత్రికి వెళ్ళాడు మీరు మధ్యాహ్నం రెండు క్లాసులు తీసుకోవలసి వుంటుంది ఆ క్లాసు లేవో వివరంగా వ్రాసి యిప్పుడే పంపిస్తాను" అన్నాడు కాళిదాసు "అలాగేలెండి ఇందులో ప్రత్యేకంగా యిబ్బంది పడవలసినదేముంది?" అంటూ మళ్ళీ నమస్కారంచేసి రూముకు వచ్చేశాడు

రాగానే పట్టాభి "ఏమిటి వారి ఉత్తరువు?" అని అడిగాడు కాళిదాసు నవ్వి "కోటేశ్వరశర్మగారి భార్య కవల పిల్లలను కన్నదిట ఆయన తాలూకు క్లాసులు రెంటిని మనం 'ఎంగేజి' చెయ్యాలి అంతే" అన్నాడు

పట్టాభి "ఈమధ్య యీ పార్టీలు ఎక్కువై పోతున్నాయి అందులో మరో విశేషం కూడా వుంది కవల పిల్లలు పుట్టారు కాబట్టి ఆయన టీ పార్టీకి బదులు డిన్నరు పార్టీ యివ్వటమే ఉచితంగా వుంటుంది కోటేశ్వరశర్మగారు రాగానే అడిగేద్దాం ఇందులో మొహమాటం పనికిరాదు" అన్నాడు

అక్కడున్న నలుగు రైదుగురూ నవ్వారు మూలగా పేము కుర్చీలో కూర్చొని పేపరు చదువుతున్న డ్రిల్లు టీచరు సత్యనారాయణ తన పెద్ద గొంతుకతో "నిజమే సుమండీ నెల రోజుల క్రిందట సైన్సు నరసింహంగారు మొగ పిల్లవాడు పుట్టాడని ఒక పార్టీ యిచ్చాడు రేపో ఎల్లుండో కోటేశ్వర శర్మగా రివ్వబోయే పార్టీ మరొకటి పట్టాభిగారి పార్టీ వెయిటింగ్ లిస్టులో వుండనే వుంది" అని పెద్దగా నవ్వాడు

తర్వాత రెండు గంటలూ కాళిదాసుకు క్లాసులున్నాయి విరామసమయంలో అతడూ పట్టాభి కాఫీ హోటలుకువెళ్ళి ఫలహారంచేసి కాఫీ త్రాగి వచ్చారు శంకరశాస్త్రి కాళిదాసుతో "ఏమయ్యా! ఇవాళ సాయంకాలం మా యింటి కొకసారి వస్తావుగా?" అన్నాడు కాళిదాసు "మీ అమ్మాయి చెప్పింది నాకు గుర్తుందిలెండి తప్పకుండా వస్తాను అయితే కాస్త పొద్దుపోతుందేమో" అన్నాడు ఆయన మొహం తుడుచుకుంటూ "ఫరవాలేదులే అంతగా అయితే భోజనం కూడా మా యింట్లోనే చేద్దువుగాని" అన్నాడు కాళిదాసు "అమ్మ బాబోయ్! అలా వీల్లేదు ఇంట్లో కావలసినంత అన్నమూ కూరా మిగిలివున్నాయి అనవసరంగా పాడైపోతాయి" అని బదులు చెప్పాడు

హెడ్మాస్టరు ఒక చీటీ పంపించాడు అందులో మధ్యాహ్నం కాళిదాసు తీసుకోవలసిన క్లాసుల వివరాలు వ్రాసి వున్నాయి మధ్యాహ్నం మొదటి గంట ఫోర్తుఫారం తర్వాతగంట స్కూల్ఫైనల్ 'సి'

---

ఆవ్యక్తి :— డాక్టరుగారూ నారోగం సరిగ్గా పరీక్షించి మంచి మందు యిప్పించాలి

ఆయన:- క్షమించండి ముందు మీరు ఓకంటి డాక్టరు వద్దకువెళ్ళి అద్దాలు పెట్టకోడం మంచిది. నేను ప్లీడర్ని

యస్ సుందర శివరావు (రాజోలు)

---

కాళిదాసు స్కూల్ఫైనల్ క్లాసులో పిల్లలను సామాన్యప్రపంచజ్ఞానాన్నిగురించి ప్రశ్నలు వేస్తూ గడిపాడు ఆ క్లాసుకు అతడెన్నడూ పోలేదు అతడు వేసిన ప్రశ్న లన్నిటికీ పిల్లలనుంచి సమాధానాలు వచ్చాయి ఆ క్లాసులో ఎనిమిది మంది ఆడ పిల్లలు కూడా వున్నారు వారిలో ఎవరూ ఏ ప్రశ్నకూ సమాధానం చెప్పలేకపోయారు రెండో బెంచీలో చివరగా కూర్చున్న పొట్టి కుర్రవాడొకడు చాలామంది చెప్పలేకపోయినప్రశ్నలకు జవాబు చెప్పాడు వాడు బీదవాడిలా వున్నాడు మాసిపోయిన లాగుచొక్కా తొడుక్కుని వున్నాడు

పని పూర్తి కాగానే కాళిదాసు టీచర్సురూమ్లోకి వెళ్ళి పట్టాభిని కలుసుకున్నాడు ఇద్దరూ కలిసి బజారుకు బయలు దేరారు

పట్టాభి పంచెల జత కొన్న తరువాత యిద్దరూ ఒక గడియారాల షాపులోకివెళ్ళి గడియారం బేరం చేశారు దాదాపు అరగంటసేపు అక్కడవున్న గడియారా లన్నిటినీ పరీక్షచేసి చివరకు యిద్దరికీ నచ్చిన అలారం గడియారాన్ని ఎన్నిక చేశారు దాని ఖరీదు యిరవైమూడురూపాయలు చీకటిలో కూడా అంకెలు కనుపించే 'రేడియం డయల్' ఉన్న గడియారమది

ఇద్దరూ యింటి ముఖం పట్టేసరికి ఆరు గంటలు దాటింది పట్టాభి కాళిదాసుకు 'గుడ్నైట్' చెప్పి తన యింటికి వెళ్ళిపోయాడు కాళిదాసు చేతిలో గడియారంతో నెమ్మదిగా రూబెన్ యిల్లు చేరుకున్నాడు రూబెన్ అప్పటికే భోజనం ముగించుకుని మురళి యింటికి వెళ్ళిపోయి వుంటాడు ఆ చుట్టుపక్కల అన్నీ చిన్న చిన్న పాకలు వంటినిండా గుడ్డ అయినాలేని పిల్లలు వీధులలో చేరి గోల చేస్తూ ఆడుకుంటున్నారు ఆ పాకలలో చిన్న చిన్న ప్రమిద దీపాలు తప్ప వెలుతురే లేదు

రూబెన్ యిల్లు కాళిదాసుకు బాగా తెలియక పోయినా మండుతున్న కొలిమినిబట్టి పోల్చుకోగలిగాడు ఒక కుర్రవాడు మోకాళ్ళమీద కూర్చుని గాలితిత్తిని వత్తుతున్నాడు కొలిమిలో అగ్ని దేదీప్యమానంగా వెలుగుతూ ఆపాక పరిసరా లన్నిటికీ బంగారుపూత వేస్తున్నది కొలిమిముందు కూర్చుని వున్న రూబెన్ తండ్రి కాళిదాసును చూడగానే లేచి దణ్ణంపెట్టి "బాబుగారూ! తమరే వచ్చేశారా? కబురు పంపిస్తే నేనే వచ్చేవాణ్ణి గదండీ" అన్నాడు కాళిదాసు "ఫరవాలేదు ఈ ప్రాంతాలకు ఎప్పుడూ రాలేదు ఒకసారి చూసినట్టవుతుందని వచ్చాను" అంటూ పంచలోకివెళ్ళి కూర్చుని గడియారానికి 'కీ' యిచ్చే విధమూ, అలారం పెట్టేవిధమూ, మోగుతూ వుండగా అక్కరలేకపోతే దాని నోరు నొక్కే విధమూ వివరించి చెప్పాడు నలుగురు చిన్న పిల్లలు అతని చుట్టూచేరి వింటున్నారు కాళిదాసు "ఈ పిల్లలు" అంటూ వుండగా అతడు నవ్వి మొహానవున్న చెమట తుడుచుకుంటూ "మా పిల్లలే బాబూ! ఇదుగో వీడు రూబెన్ తర్వాతివాడు. నోరులేని వెధవ" అన్నాడు తిత్తివత్తుతున్న ఎనిమిదేళ్ళ వాణ్ణి చూపించి. వాడు మూగవాడట కాళిదాసుకు వాణ్ణి చూస్తూ వుంటే జాలి వేసింది కాస్సేపువుండి అతడు లేచి "నేను వెడుతున్నాను" అని చెప్పి బయటికి వచ్చేశాడు

ఆలోచనలోపడి నెమ్మదిగా నడుస్తూ వుండగా ఆనాటి ఉదయం శంకరశాస్త్రిగారు తనతో మాట్లాడాలని అన్న విషయం గుర్తుకు వచ్చింది వెంటనే అతడు త్వరత్వరగా ఆ త్రోవబట్టి నడవటం ప్రారంభించాడు

శంకరశాస్త్రిగారి యిల్లు ప్రశాంతంగా వుంది. వాకిట్లోవున్న చిన్న చిన్న పూల మొక్కలమీద వెన్నెల పడి తళతళ మెరుస్తున్నది పంచలో హరికెన్లాంతరు వకటి కప్పుకు వ్రేలాడుతూ వెలుగుతున్నది

కాళిదాసు పిలుపువిని శంకరశాస్త్రి బయటికి వచ్చాడు ఆయన దోవతి కట్టుకుని పైన ఉత్తరీయం వేసుకుని వున్నాడు ఇంకా భోజనం అయినట్టులేదు ఆయన కాళిదాసును చూసి "యిలా రావోయ్" అంటూ ప్రక్క గదిలోకి తీసుకువెళ్ళి చాప పరిచి కూర్చోబెట్టి తను కూడా కూర్చుని ఏదో మాట్లాడబోతూ వుండగా, కాళిదాసు ఆయనను వారించి "మీరలా మాట్లాడితే నేను వినను ముందు ఫిడేలు తెప్పించండి నాకు నచ్చిన పాట వాయించండి ఆ తర్వాత ఎంతసేపు కూర్చోమన్నా కూర్చుంటాను ఏ సంగతి వినమన్నా వింటాను" అన్నాడు

ఆయన నవ్వి "సరే అయితే" అని, "రుక్కూ!

"ఆ ఫిడేలు యిలా ఒకసారి తెచ్చి యివ్వుతల్లీ" అని కేక వేశాడు మరుక్షణంలో రుక్మిణి ఫిడేలుతెచ్చి అందించి తను కూడా అక్కడే కూర్చుంది ఆయన తీగలు సరిచేసి "ఆ ఇంక చెప్పు ఏం వాయించమంటావు?" అని అడిగాడు కాళిదాసు చెప్పాడు

ఆయన 'పూరయ మమకామం' తరంగం వాయించడం ప్రారంభించాడు కిటికీలోనుంచి వెన్నెల ఆయన వాద్యంమీదా, ఆయన మీదా పడుతున్నది ఎన్నో మెలకువలు చూపుతూ సంగతులు వేస్తూ వాయిస్తున్నాడు కాళిదాసూ, రుక్మిణి చేష్టలుడిగి శిలా ప్రతిమలవలె కూర్చుని వింటున్నారు దాదాపు పదిహేను నిముషాలపాటు ఆ గది అంతా తరంగితమై పులకించిపోయింది

ఇంకా పాట పూర్తి కానేలేదు ఇంతలో ఆయన మూడో కూతురు—ఆరేళ్ళది—పెద్దగా యేడుస్తూ పరిగెత్తుకువచ్చి "నాన్నా పరికిణీలన్నీ చిరిగిపోయాయని రేపే గుడ్డలతో బడికి వెళ్ళడ మెలాగని అంటే అమ్మ కొట్టింది" అన్నది

మనోహరంగా వినిపిస్తున్న వాద్యం ఒక్కసారిగా ఆగిపోయింది ఆయన పాట ఆపి తలపైకెత్తి బాధగా "లేదులే అమ్మా! ఏడవకు రేపు నిన్ను బజారుకు తీసుకుపోయి గుడ్డలు కొంటానులే మీ అమ్మతో చెబితే ఎలా? పనిలో అలిసిపోయి వుంటుందికద్యూ? అందువల్ల దానికి చిరాగ్గా వుంటుంది ఏమన్నా కావలిస్తే నాతో చెబితే వెంటనే తెచ్చి యిస్తానుగా" అన్నాడు

ఆపిల్లపేరు శకుంతల అది తండ్రి మాటలతో పూరడిల్లి కళ్ళు తుడుచుకుని వెళ్ళిపోయింది కాళిదాసు తలవంచుకుని కూర్చున్నాడు శంకరశాస్త్రి రుక్మిణి వంక తిరిగి "అమ్మా! నువ్వు కూడా లోపలికి వెళ్ళి చదువుకో" అన్నాడు ఆ అమ్మాయిలేచి లోపలికి వెళ్ళిపోయింది

ఆయన తర్వాత గొంతు సవరించుకొని, "మిగిలిన పిల్లలందరూ మంచి మంచి పరికిణీలూ జాకెట్లూ వేసుకుని వస్తూవుంటే యీ చవకబారు చీటీ గుడ్డలతో బడికి వెళ్ళటం వారికి యిబ్బందిగానే వుంటుంది చిన్న వయసుకదూ! నేను కూడా వారినిలా మోనపు మాటలు చెప్పి ఊరడిస్తున్నాను మా పెద్దపిల్ల పెళ్ళికి చేసిన అప్పు సాధ్యమైనంత తీర్చగా యింకా దాదాపు ఆరు వందల రూపాయలున్నది ప్రతినెలా జీతం రాగానే కొంత పట్టుకుపోయి నోటులో చెల్లు వ్రాయించి వస్తూ వుంటాను అదలా వుండగా ఈ పిల్ల పెళ్ళి కెదిగి కూర్చున్నది దీని కిప్పుడు పన్నెండేళ్ళువెళ్ళి పదమూడో యేడు రాబోతున్నది ఇప్పటినుంచే సంబంధాలు విచారిస్తూ, మన ప్రయత్నంలో మనంవుంటే ఏదో కాలంకలిసి వచ్చినప్పుడు అదే సమకూడుతుంది ఆ విషయం చెప్పేందుకే నిన్ను రమ్మన్నాను ఎక్కడైనా మీ బంధువర్గంలోగాని తెలిసిన వాళ్ళలో గాని అనువైన సంబంధముంటే చూడు నా పరిస్థితులన్నీ నీకు తెలుసుగా ఇక వేరే చెప్పవలసినదేమీ లేదు" అన్నాడు

కాళిదాసు తలవూపి "అలాగే తప్పక ప్రయత్నిస్తాను" అని సమాధానం చెప్పి లేవబోతూ వుండగా లోపల రుక్మిణి తల్లితో అంటున్న మాటలు

# ధ్రువతార

వినిపించాయి "అవతల పెద్ద మనుష్యులుండగా నువ్వు దాన్ని బాదటమూ, అది యిల్లెగిరిపోయేట్టు ఏడవటమూ మహా గొప్పగా వున్నాయి ఛీ! ఏం మనుషులు"

శంకరశాస్త్రి నవ్వి "కాళీ! నువ్వు నమ్మవేమో గాని మా రుక్కు అద్భుతమైన పిల్ల దాని నిమ్మదీ, నిదానమూ ఓర్పు చూస్తే ఒక్కొక్కప్పుడు ఆశ్చర్యంగా వుంటుంది" అన్నాడు కాళిదాసు "సరే పొద్దుపోయింది ఇంక వెళ్ళివస్తాను" అంటూ లేచి వీధిలోకి నడిచాడు

అతడు నడుస్తూ వుండగా ఒక వీధిలోనుంచి ఒక వ్యక్తి ఎదురుగా నడిచివచ్చి అతన్ని గుర్తించి "నమస్కారం మేష్టరుగారూ!" అన్నాడు కాళిదాసు వెన్నెలలో ఆయనను గుర్తించాడు ఆయన ధర్మ వైద్యశాలలో మందులు కలిపి యిచ్చే సుబ్రహ్మణ్యం "మీరు నిరంజనశర్మగారితో మాట్లాడారా?" అని అడిగా డాయన కాళిదాసు నవ్వి "ఓహో! ఆ విషయమా? మాట్లాడాను ఆయన కూడా ప్రయత్నం చేస్తానని చెప్పాడు కాని ఫలితం ఎలా వుంటుందో " అన్నాడు

---

తల్లి పీత పిల్లపీతతో:-ఏయ్! అట్లా వంకర టింకరగా నడుస్తావు, సరిగా నడవలేవూ?

పిల్లపీత:- పోనీ! నీ నడక చూపెట్టు చూద్దాం.

కె దుర్గాప్రసాద్ (విజయపురి)

---

ఆయన "పోనీలెండి పెద్దలు కాస్త కనిపెట్టి చూస్తేచాలు ఫలితం మరీ అంత అన్యాయంగా వుండదు అన్నట్టు మరోటి మేష్టారూ! మా పెద్దవాడొక గడుగ్గాయి అయిపోయినాడు ఫోర్తు ఫారం చదువుతున్నాడు ఎప్పుడూ యింటి పట్టున వుండడు చెడు సావాసాలుపట్టి చెడిపోతున్నాడని నా కనుమానంగావుంది ఈ మధ్య రెండు మూడు సార్లు నా జేబులో డబ్బు కూడా గల్లంతవుతున్నది మీరు శ్రమ అనుకోకపోతే మీ యింటికి పంపిస్తాను కాస్త వాడికి భయం చెప్పి అక్కడే కూర్చోబెట్టి చదివించగలరా?" అని అడిగాడు

కాళిదాసు తలవూపి "దానికేం? అలాగే పంపించండి" అంటూ ముందుకు సాగిపోయాడు ఆయన వెనకనుంచి, "మీ మేలు మరిచిపోను" అనటం కాళిదాసుకు వినిపించింది

కాళిదాసు యింటికి వెళ్ళేసరికి క్రిందటి రాత్రి వలెనే అందరూ అతనికోసం పంచలో నిరీక్షిస్తున్నారు వీధి తలుపు చప్పుడువిని రూబెన్ "అరుగో మేష్టారు వచ్చేశారు" అంటూ లేచి నుంచున్నాడు కాళిదాసు వరండా మెట్లెక్కుతూ వుండగా పని మనిషి తెచ్చికోలు కోపంతో "మీకు నిన్న చెప్పినుగా బాబుగారూ! అయినా యీపూట ఆలస్యంగా వచ్చారు చిన్నబాబు గారప్పుడే నిద్రకూడా పోయారు" అన్నది కాళిదాసు బదు లేమీ చెప్పకుండా నవ్వుతూ తాళంతీసి లోపలికి వెళ్ళి దీపాలు వెలిగించాడు పని మనిషి ఆ పిల్లవాణ్ణి 'చిన్నబాబాబుగారు'ని అనటం అతనికి తమాషాగా వున్నది ఇలాగే కాలం గడిస్తే ఆ పసివాడి అమాయికపు జీవితం తన జీవితంతో ముడివేయబడుతుంది వాణ్ణి అందరూ తన వాడిగానే చూస్తారు

కాళిదాసు ఒక దీవం తన విద్యార్థులకు యివ్వగానే వారు చదువుకునేందుకు వెళ్ళిపోయారు పని మనిషి ముందు గదిలో చాపమీద పాత్తి గుడ్డలలో పిల్లవాణ్ణి పడుకోబెట్టి జోకొడుతూ కాళిదాసుతో "బాబు ఇట్టా కటికనేలమీద పడుకోబెట్టటం బాగా లేదండి రేపొచ్చేటప్పుడు మంచి చెక్క ఉయ్యాలనుకొనుక్కురండి" అన్నది

కాళిదాసు లాల్చీ విప్పి నిట్టూర్చి "అన్నీ అనుభవించే యోగ్యతవుంటే వాడి ఖర్మ ఆలా యెందుకు కాలుతుంది?" అన్నాడు పని మనిషి బాధగా "అట్టా అనుకోగూడదు బాబూ!" అన్నది ఇంతలో గుమ్మంలో నిలబడివున్న మురళి లోపలికి వచ్చి "అంతే మేష్టారూ! మా అమ్మ కూడా "వాడెంత గొప్ప వాడవుతాడో" అని అన్నదండి" అన్నాడు

కాళిదాసు విసుగుతో "సరేలేవోయ్! నువ్వూ వాడూ కూడా గొప్పవాళ్ళే అవుతారు ముందువెళ్ళి పరీక్షల సంగతి ఆలోచించుకో నెల రోజులయినా పూర్తిగా వ్యవధిలేదు" అన్నాడు మురళి వెంటనే వెళ్ళిపోయాడు

కాళిదాసు మొహమూ, కాళ్ళూ చేతులూ కడుక్కుని భోజనంచేసి తలుపు లన్నీవేసి ముందు గదిలోకి వచ్చేసరికి అప్పలమ్మ నిద్రపోతున్నది కిటికీలో నుంచి పండు వెన్నెల ముందు గదిలో నేలమీద పడుతున్నది

అతడు పంచలోకి వెళ్ళి చదువుకుంటున్న యిద్దరు విద్యార్థులనూ చూస్తూ పది నిముషాల సేపు కూర్చుని తర్వాత ముందు గదిలోకివచ్చి తలుపు వేసి మంచంమీద నడుం వాల్చాడు అతని ఆలోచనలన్నీ ఆ పసివాడిమీదనే వున్నాయి మాతృగర్భంలో నరకయాతనల ననుభవించి, పుట్టి పదిరోజులైనా కాకుండానే తనకీ ప్రపంచంలోవున్న అతివిలువైన ఆస్తిని వాడు పోగొట్టుకున్నాడు అయినా వాడికి విషయం తెలియదు తన శరీరానికీ, మనస్సుకూ కూడా పుష్టినిచ్చే తల్లి పాలకూ, తానిప్పుడు తాగుతున్న గేదె పాలకూ వుండే భేదం వాడికి తెలియదు తల్లిని బుల్లి చేతులతో కౌగిలించుకుని నిశ్చింతగా నిద్రపోవలసినవాడు, పని మనిషి ప్రక్కన చాపమీద పడుకుని వున్నాడు కొద్ది సేపటి క్రిందట లోకం తననూ ఆ పసివాణ్ణి ఒక విడరాని అనుబంధంతో కట్టివేస్తున్నదని కాళిదాసు అనుకున్నాడు ఆ అనుబంధం తనకు వాంఛనీయమైనదేనా? అన్న ఆలోచన అతనికి వచ్చింది కొద్దిసేపు ఆలోచించి "అది తృప్తినిచ్చి తీరుతుంది ఆ అనుబంధం కటువైనదికాదు మహా మధురమైనదే" అనుకున్నాడతడు అతని కళ్ళు నిద్రాభారంతో మూతలు పడ్డాయి (సశేషం)

# గిరీశం ఉపన్యాస భాగం

(23-వ పేజీ తరువాయి)

వేయించి ఆ లాడుతో హీరోగారి చేత ఆవిడని పైకి లాగించాం

అఫ్‌కోర్సు మనకి నావెల్టీ కూడా కలిసొచ్చింది నూతిలో పెళ్లి కొత్తగా లేదూ, ఆయిడియా మరి ? సెక్సు, రెలిజను, ఎడ్వెంచరు, సస్పెన్సు, రొమాన్సు ఇన్ని కలిసొచ్చాయి సెన్సారు రూళ్ళు కూడా కొరమాలినవనిందికి వీల్లేదు మళ్ళీ ఎక్కడా అనకండి మన్లో మనమాట బుచ్చమ్మ అని ఒక బ్యూటిఫుల్ యంగ్ విడో ఉండేది ఆవిడ దన్నుద్వాహమాడటానికి నాతో లేచి వెళ్లిపోయి రావడానికి ఆరంభంలో ఒప్పుకుంది గాదు చివరి కామెని దాదాపు ఒప్పించడానికి నేను వేసిన తర్సా ఎలాంటి దనుకున్నారు ? అక్షరాలా ఇలాటిదే

“వదినా మొన్న మీ అమ్మగారు నూతిలో దూకారు ఆవిడకీ మారేజయింది నాకూ నేడు గాపోతే పూర్వం ఒకప్పుడైనా మారేజయింది గాబట్టి నే న్నూతిలో దూకి ఆవిణ్ణి పైకిలాగి సేవ చేసినా సరిపోయింది ఢిల్లీలోని 13 వేల తల్లులు గాని, సర్వోదయ వాళ్లుగాని, మున్షీ, మొరార్జీ, రాజాజీలు గాని, ఆఖరికి సెన్సారువాళ్ళు గాని తప్పట్ట లేక పోయారు మరదే రేప్పొద్దున్న మీరు కాల్జారి ఆ నూతిలోనే పడతా రనుకోండి పడ్డాక, అన్నా ఎంత పనయిపోయింది హాయిగా ఆ గిరీశం గార్ని చేసుకుని మహారాణిలా ఉండాల్సిందని వాలి క్కరుచుకొంటారు నేను మిమ్మల్ని చూసినా దూకి రక్షించడానికి వీల్లేదుగదా ? మనకి పెళ్లి కాలేదు మరి ? ఒకవేళ ప్రాణరక్షణ అని వంక పెట్టినా,—వెధవది మానవదేహంలో ఉండి— లోలో పల నేనుగాని, మీరుగాని ఆయొక్క మధుర స్పర్శ వల్ల ఆ అవాంతర స్థితిలోనే ఏ కాస్తయినా ఆనందం పొందినట్టాయెనా— కొంప మునిగిపోతుంది సెన్సా రడకత్తెర మన పీక ఉత్తరిస్తుంది గాన ముందే మారేజి చేసుకో రడీగా ఉండడం మంచిది” అవటాని ఒక గంభీరమైన లెక్చ రిచ్చేశాను ‘అంతే వంటారా ? గిరీశంగారూ !’ అవటాని ఆ యంగ్ విడో ముక్కున వేలేసుకుని సాలోచనగా చూస్తూ విలబడిపోయింది

యూవంటారూ—ఈ రూళ్లను వంచలేమా అంటారా ? చిత్తం డొంకతిరుగు ళ్ళంటూనే ఉంటాయి పెళ్లి జరగడానికి ముందు రొమాన్సు ఉండరాదని ప్రేమికులు ఒకళ్ల నొకళ్ళు తాకరాదని రూలుకదా మొన్న అల్లా పిక్చరదేవిటీ అందులో పెళ్ళి సీనులో ముందర షూట్ చేశారు ప్రేమ సీనులు తరవాత తీశారు కథలు ప్రేమ ముందు, పెళ్లి వెనకా వస్తాయనుకోండి అయినా రూలు ప్రకారం పెళ్లే ముందుగా తీశామని సెన్సారు వాళ్ళకి చెప్పబోతున్నారు ఒప్పుకుంటార్లెండి

అయినా కాపోయినా అన్నిటికీ ఊరికే వాళ్ల నలా ఆడిపోసుకోడం సబబుగాదు వాళ్ల రూళ్ళు దయాదాక్షిణ్యాలు చూపించిన సందర్భా లెన్ని లేవు

ఓ పిక్చర్లో విలను నానా ఘోరాలు చేస్తాడు దొంగతనం, దౌర్జన్యం, ఒక చిన్న ఖూనీ, ఒక బలాత్కారం, రెండు ఫోర్జరీలు—ఇన్ని చేస్తాడు తీరా కథ అయిపోయి జనాభా అంతా గ్రూపు ఫోటో దిగే వేళకు పోలీసు లొచ్చేస్తారు విలన్ని తీసుకుపోడానికి అప్పుడు విలను భార్య ఏమంటుంది ? “ఆయన నా భర్త నా పసుపుకుంకాలు బాగుండనీయండి నన్ను చంపి గాని ఆయన్నరెస్టు చెయ్యడానికి వీల్లేదు భారతనారి తన భర్త నలా పోలీసులపాలు చెయ్యదు” అంటుంది పెద్ద కుంకంబొట్టు పెట్టుకుని, పుస్తెలు (మాత్రమే) పైట ఇవతలికి కనబడేలా ఏర్పాటు చేసుకుని

అప్పుడు హీరో ఔదార్యం చూపిస్తాడు ఓ విలనూ నీవల్లగదా నా ధైర్య సాహసాలూ, మా ఆవిడ పాతివ్రత్యం బుజువయ్యాయి కాన నీకు మేము ఋణపడున్నాం భయపడకు ఓ పోలీసులూ ! కేసులేదు మేం ఫిర్యాదు చెయ్యం వాణ్ణొది లేసి పొండి” అంటాడు

పోలీసులు యస్సార్ అని వదిలేస్తారు సెన్సారు వాళ్ళు వదిలేస్తారు వాళ్ళు కావాలంటే పేచీ

---

మాష్టరు:- మన దేశంలో లంచగొండితనం లేకుండా చేయాలంటే ఏమి చేయాలిరా గోపీ?

గోపి:- మిమ్మల్ని పాస్ చేయడానికి మా దగ్గరనుండి మీరు లంచం పుచ్చుకోవడం మొదట మానుకోవాలి

జి వి సాంబశివరావు (ఖర్గపూర్)

---

పెట్టరూ ? కాని అవతల మహాపతివ్రత సిఫార్సాయె గ్రేట్ సెంటిమెంట్ అది చూసి వదిలేస్తారు మన ఫిలింవాళ్ల కృతజ్ఞత లేకుండా వాళ్ల ఉపకారాలు మర్చిపోయి సభలో రసభసలూ చేస్తున్నారు దిస్, ఐ టెల్ యూ—ఈజ్ బేస్ ఇన్గ్రాటిట్యూడ్

రైటే రైటేనండి విలనుగా రన్నట్టు పెళ్లయ్యాక ఇంకా ప్రేమేమిటి లవ్‌సీన్సేమిటి—తరవాత మొగుడూ పెళ్లాలు ఒహళ్ల నొహళ్ళు ముట్టుకుందికి మధ్య సెన్సారువాళ్ల పర్మిషనేమిటి పర్మిషను గాదు పది లక్ష లిచ్చినా పాటలు పాడుతూ ఒకళ్ల నొకళ్ళు తాకి పులకలెత్తి నవ్వి ఆనందపడటమంటే ఛస్తే పడరు పడలేరు చల్లా వణ్ణంతిన్న తరవాత పచ్చడో, పప్పో కలుపుకున్నట్టు ఇపుడు రొమాన్సేవిటిసార్ ఛస్తుంటేను అంటారు రైట్ బట్ వెయిటేమినిట్ ఒఖ్క నిముషం ఆగి ఆలోచించండి ఈ కాస్త పాయింటు ఆ రూళ్ళు పెట్టిన వాళ్లకి సెన్సారు వాళ్లకీ తెలీదనే అనుకుంటున్నారా ? అసల్సన్నడిగితే ఈ రూలుకీ ఫామిలీ ప్లానింగు కమిషన్‌కీ సంబంధం ఉందంటాను ఇది చాలా లోతైన వ్యవహారం బీదవాడి ఏకైక ఎంటర్టేయిమెంటుకి ఈ సినిమాలు వీటిలో ప్రేమఘట్టాలూ, ఈపోస్టర్లూ దోహదాలుగా ఉంటున్నాయనీ, పబ్లిసిటీ సాధనాలుగా పనిచేస్తున్నాయనీ వాటివల్లనే జనాభా ఊహూ పెరిగిపోతోందనీ వాళ్ల అనుమానం అందువల్ల భర్త కంట్రోలు, భార్య కంట్రోలు బాగా అమలుచేసి కుటుంబనియంత్రణం, సంతాన నిరోధం జయప్రదం చెయ్యాలంటే సినిమాలను బాగా అదుపు చెయ్యాలి సినిమాలో పెళ్లికి ముందు ప్రేమ ఘట్టాలు తీయించేస్తే, పూర్వంలా ప్రేక్షకులు తమ పెళ్లిళ్ళ ముందటి ప్రేమఘట్టాల ముచ్చట్లు గుర్తుకు తెచ్చుకుని ఊహించుకొని ఉత్సాహపడడం మానేస్తారు దీనికి తోడు పెళ్లి తరవాత ప్రేమ ఘట్టాలు చూపెడితే, “ఎంత జడ్డిగా ఉన్నాయి ! పెళ్లయ్యాక కూడా వీడు రొమాన్సా డుయెట్లు అఘోరిస్తున్నాడు” అని నవ్వుకుంటారు వాళ్లు నవ్వుకుంటే సినిమావాళ్ళు దరిమిలాను అసలు పిక్చర్లలో లవ్ సీన్లే పెట్టరు ప్రేమ అవుటాఫ్ ఫాషను, అవుటాఫ్ డేటూ అయిపోతుంది నీతులు ఆవాలూ, నీతులు మెంతులూ నీతులు జబ్బులు, నీతులు ఏడుపులూ, అపోహలూ నీతులు వగైరాలతో నిండిపోతాయి పిక్చర్లు జనం హాయిగా ఇళ్లలో కూర్చుని భారతీయ విద్యాభవన పుస్తకాలు చదువుకుంటారు — రామకృష్ణా అనుకుంటూ కాని అది చాలా ప్రమాదమనీ, అందువల్ల వీళ్ళు నివారించదలుచుకున్న సమస్య మరింత పట్టు పగ్గాల్లేకుండా పోతుందనీ గ్రహించలేరు

ఇదంతా జరుగుతుందని కాదుసుమండీ సినిమా వాళ్లం అసాధ్యులం రూలు ఉంటే నాలాటి అద్భుతమైన బుర్రలు కిరాయికొచ్చి రూలునీ గిలునీ ఎగరకొట్టేస్తాయి సవాలక్ష ఉపాయాలు చేస్తాన్నేను పెళ్లికి ముందు ప్రేమ కూడదు అన్న వాక్యంలో పెళ్లి అనగా ఏ పెళ్లి ? సనాతన భారతీయసంప్రదాయక వివాహాలున్నాయా మరి గాంధర్వం, రాక్షసం వగైరాలు

భారత సంస్కృతి సంప్రదాయ సంరక్షకులు వాటిని కాదనగలరా ?

గుళ్లో గాంధర్వప్పెళ్లాడితే కాదండం సబబా ?

అక్కడి దీపం అగ్నిసాక్షిగాదా ?

కావాలంటే అగ్నిదేవుడు ప్రత్యక్షమైనట్టు చూపిస్తే పోదా ?

ఒకడి భార్య, ఒకర్తె భర్తా—ఇద్దరూ వివాహితులే కాబట్టి—ప్రేమించి డూయెట్లు పాడడం అధర్మమా ?

పెళ్లయినపిల్లదానికి కలొచ్చి అందులో మొగుడూ, తనూ పెళ్లిగాకముందు సరసా లాడినట్టు కనబడడం సెన్సార్ పక్షం అనిపించుకోదా ?

విష్కంభంలో రిజిస్టరుపెళ్లి చేసుకొచ్చి, డూయెట్లూగట్రా పాడి సరసాలాడి తరవాత సెన్సారు వాళ్ళ ఆయ్ అంటే, మాకు రిజిస్టరు పెళ్లయుండొచ్చు కావాలంటే ఇపుడు సివిలు పెళ్లాడతామొచ్చి అంటే అది సెన్సార్ పక్షం అనిపించుకోదా!

తెలుగు సినిమాలో లవ్ సీన్సు గొడ్డు (పాపము శమించుగాక) పోతాయా ?

మిగతా కథ వెండి తెరమీద చూడండి 

# గృహపరిశుభ్రత

(22-వ పేజ తరువాయి)

ఇందులో సత్యం లేకపోలేదు ఎవరన్నా వస్తారంటే ఆవేళ ఎటువంటి ఒద్దకస్తులయినా ఇంటి శుభ్రత విషయంలో కాస్త ప్రత్యేకశ్రద్ధ చూపుతారు చూపాలి గూడా 'ఈ నరకంలోనుంచి ఎప్పుడు పారిపోదామా' అని అనుకోకూడదు మన అతిథులు,

నగలమీద, బట్టలమీద, భోజనంమీద చూపినంత శ్రద్ధ ఇంటిమీద చూపరు కొందరు బల్ల మీద విప్పిన బట్టలు, పుస్తకాలు కిటికీలలో, బల్ల క్రింద, మంచాలక్రింద—గ్లాసులూ, పళ్లాలూ (కాఫీ టిఫిన్ సేవించినవి) మంచాలక్రింద లేక వాళ్ళు కూర్చొన్న కుర్చీక్రింద—ఫోటోలమీద ఆమెకులకే సవరాలు, రిబ్బన్లు, బెల్టులు, జాకెట్లు, పంచెలు (చక్కగా కుచ్చిపోసి) నిద్రలేచిన పక్కలు, బెడ్ సీట్లు సగం మంచంపై సగం నేలమీద—ఇక వంటగది ఎందుకు లెండి పాచి—కూరగాయ చెక్కలు—తిన్న అరటిపండు తొక్కలు ఇటువంటి విశిష్టాలంకరణ ఆ ఇంటివారికన్నా అపుడపుడూపోయే అతిథుల్ని మహ బాధ పెట్తాయ్ మాకు తెలిసిన వారున్నారు—అంత చదువుకున్నది కాదనుకోండి అయినా కేవలం బద్ధకంతో వాళ్ళ వారాని కొకసారి మేడ వూడ్చించి పడకలు విదులించుకొని పరిచేసే రంటె తిరిగి వారానికి మరలా వూడుస్తారు ఇటువంటి వాళ్ళను ఏమనుకోవాలి? దేవుడు వాళ్ళను అంత సోమరులుగా సృష్టించేడంటె అది వాళ్ళ ఖర్మే మరి

మా టీచర్ అనేవారు 'మనం భోంచేస్తున్నాము అంటే ప్రక్కనున్నవారు కళ్ళు మూసుకోకూడదు' అని (మనం తినే తీరు చూడలేక) అలాగే మనింటి కెవరన్నా వచ్చారులంటే పారిపోయేందుకు ప్రయత్నాలు చేయగూడదన్నమాట 'హాయిగాఉంది వాతావరణం మరింకా స్సేపు కూర్చొందాం' అనుకోవాలి

అయితే ఇంటికి వచ్చేవారు పారిపోయే టంతటి భయంకరమైన ఇళ్లు' కూడా ఉంటాయా? అంటారేమో మాకు తెలిసిన ఒక పెద్ద ఆఫీసర్ గారి ఇంటిని వివరిస్తా వినండి— వాళ్ళింటికి సదా పెద్దఆఫీసర్లు—క్లబ్ మెంబర్స్—వాళ్ళు వీళ్ళు వస్తూ పోతూనే ఉంటారు కాని ప్రపంచంలో ఇన్ని మార్పులు వస్తున్నయ్—ఈవాళఉన్న బ్యాంజు నెర్ రేపు కనిపించడంలేదు—అయినా వాళ్ళింటిలో మట్టుకు కించిత్తు మార్పు గూడ రాలేదు చెప్పొనుగదూ ఆయన చాల పెద్ద ఆఫీసరని—ఆరుగురు పిల్లలు అందరూ చదువుతున్నారు ఏడు ఎనిమిది అందమైన గదులున్న పెద్ద ఇల్లు చుట్టూ గోడ పెద్ద పెద్ద ప్లేన్లు, లైట్లు—ముగ్గురు నలుగురు ప్యూన్లు పని మనిషి, పిల్లలకు ఒక మనిషి—అందర్నిమించి ఇంటినిండా కళకళమంటూ తిరిగే ఆఫీసర్ భార్యగారి నిండైన విగ్రహం—మొత్తానికి ఇల్లు సందడిగానే ఉంటుంది వచ్చేపోయే ఇల్లని ముందే చెప్పానుగా?

ఇంటినిండా ఆఫీసు కుర్చీలైతే ఉన్నాయిగాని హఠాత్తుగా నలుగురం పోయామంటే కూర్చొను కుర్చీ ఉండదు హడావిడిగా ఆఫీసర్‌గారి హుకుమ్‌తో కుర్చీలమీద నున్న కూజాలు, గ్లాసులు విప్పిన బట్టలు, టవల్స్ మొదలైన చిల్లర సరుకంతా

గుంగబా క్రిందపడేసి తెచ్చివేస్తారు కూజా తీయగా దానిక్రిందనున్న నీటినిగాని, పిల్లలు త్రాగేటప్పుడు చిందిన కాఫీ, పాలు, తాలూకు చుక్కలనుగాని తుడిచి వేయాలని ఆ ప్యూన్లకుగాని, తుడిపించి వేయించాలని ఆయన భార్యకి స్ఫురించదు అందుకుగాను ఆఫీసరుగారు మరోమారు ఉరమాలి ఇక ఆఫీసర్‌గారి స్వంతగది—ఈ కిటికీ ఊచనుండి ఆ కిటికీ ఊచకు కట్టబడిన ఒక నులక త్రాటి దండెం ఎందుకంటారా? వారి సూట్లు, కోట్లు వగైరాలు హేంగ్ చేసేందుకు రెండు కిటికీలలో రెండు ట్రంకులు (అవే వాగ్‌లనుకోండి) మంచంక్రింద మరో పెద్ద ట్రంకు కిటికీలక్రింది తలుపులు మూసి వాటిలో కాఫీ గ్లాసులు కప్పులు ప్లేట్లు, విప్పి పడేసిన రేజర్ సెట్ సబ్బు నీళ్ళతో నిండిన గ్లాసు, వారి బనీన్లు నైట్ డ్రస్‌లు నెక్ టైలు, టోపీలు, రూము మధ్యలో పిల్లలఆట బొమ్మలు, పాలసీసా వగైరాలు, రూంనిండా పిల్లలు చింపి పోసిన కాగితం ముక్కలు, అక్కడక్కడ విప్పిన బట్టలు, ఏ ఒక్క రోజూ గూడ వారి మంచంమీద శుభ్రమైన దుప్పటి ఉండదు అంత చదువుకున్నవారి రూమే అలాఉంటే ఇక వారి సతీమణి వంటగది సంగతి ఏంచెప్తాం? ఇంట్లో మనుషులు జాస్తి అన్నానుగదూ! అందుకని వాళ్ళ త్రొక్కిడికి వంటగది చెమ్మ చెమ్మగా ఉంటుంది

ఎవరన్నా హఠాత్తుగావస్తే ఏమాత్రం యిల్లు చికాగ్గున్నా ఎంతో సిగ్గు వడ్తాం కాని ఆవిడ సిగ్గు, గౌరవం, శుభ్రత ఇటువంటి చిల్లర విషయాల మీద టైమ్ వృథా చేయరు అతి మామూలుగా, కాఫీ పడిఉన్నా ఆ కుర్చీమీదనైనా సాధారణంగా కూర్చోమని గౌరవిస్తారు కొత్తగా కాస్త శుచికి శుభ్రానికి అలవాటు పడినవాళ్ళు ఆ ఇంట్లో క్షణకం ఉండలేరంటే ఏమాత్రం అతిశయోక్తి కాదు చీరపైకిగట్టి జడ గట్టిగా ముడివేసి చీపురూ బూజుకర్ర చేతికి తీసుకుందామనిపిస్తుంది కాని అంత పెద్ద వారిని ఇన్‌సల్ట్ చేసినట్లుంటుందని మానుకోవలసి వస్తుంది

ఇక పిల్లలంటారా? ఆఫీసర్‌గారు ఏ పార్టీకో వస్తున్నారంటే వారి కుర్చీకి అటు రెండు ఇటు రెండు స్పెషల్‌గా వేయించుకొంటారు 'నాన్నా మరే నాకు మరో కాజా వేయించవు? ఇటువంటి మాటలు మనకు తరుచూ వినిపించడంలో ఆశ్చర్యం లేదు తండ్రి ప్రేమ చూపాలి కాని పద్ధతి అదిగాదు నలుగురిలో పిల్లలు అలా దేబిరిస్తున్నప్పుడు ఆ తండ్రికి ఎలా ఉండుందోగాని వినేవాళ్ళకు మహా అసహ్యంగుంటుంది ఇల్లే అంత నైనంగా ఉంచుకొనే ఇల్లాలు పిల్లల్ని ఇంతకంటె బాగా పెంచాలని మనం ఆశించడం క్షమార్హంకాదు గూడ

నేను రాసిన ఒక్క ఆఫీసర్‌గారి ఇల్లేకాదు ఇటువంటి ఇళ్ళు మనలో చాల ఉన్నవి అటువంటి ఇల్లాళ్ళు కూడ చాలమంది ఉంటారు ఒక విధమైన నిర్లక్ష్యానికి అలవాటుపడిపోతారు అదే ననుకొంటాను కారణం 'ఆ ఇలావుంటే మాత్రం మాకు రోజులు జరగడం లేదంటలే' అని ఒకటే మాట అంటారు ఆ—మేం చదువుకున్న వాళ్ళం కామమ్మా మా రోజులు ఇలా జరిగిపోని' అంటారు ఇంకో రకం రోజులు గడవక ఆగిపోవు కాని నిరుత్సాహంగా, నిర్లక్ష్యంగా, బద్ధకంగా జీవచ్ఛవంలా బ్రతకడంలో అందం ఏముంది అందరికీ సోఫాసెట్లు, ప్యాన్లు, బంగళాలు, కారు ఉండవు కాని ఉన్నంతలో అందంగా శుభ్రంగా ఉంచుకొనే అధికారం అందరికుంది ఎవరి ఇళ్ళు వాళ్ళు అలంకరించుకొనేందుకు మరెవరి ఆనుజ్ఞ అనవసరం తాము సంతోషంగావుండి,తమ ఇంట్లో వాళ్ళని సంతోషపెట్టి ఇంటికి వచ్చిన వాళ్ళని సంతోషపెట్టేనే నిజమైన ఆనందం గృహాన్ని స్వర్గసీమ చేసుకోవడంలో ఇది కూడ ఒక అంశమే నని నా ఉద్దేశ్యం ★

ఒక్కడ్నీ ఈపనంతా చేయలేకపోతున్నా. అమ్మాయికి పెళ్ళిచేసేయాలి...

# ఆదర్శాలు-ఆంతర్యాలు

(21-వ పేజీ తరువాయి)

వాళ్లక్కు రెండు ఇంక్రిమెంట్లు ఇవ్వాలనీ, ుకు వైద్యసహాయం మొదలైనవి మిల్లు యజమానులు కల్పించాలనీ మనం ఉద్యమం లేవదీస్తే దొరవారిపేరు దేశమంతటా పాకిపోదుటండీ!'' ులు తిప్పుతూ అన్నాడు వెంకటప్పయ్య

''నీది మహా గట్టిబుర్రయ్యోయ్ — కర్మం ుక ఇక్కడ కరణంగా పడున్నావు గాని పెద్ద ుకీయవేత్తవ్వూ, కార్మిక నాయకుడివీ కావలసిన వవు నీవు చెప్పిన సలహా అమోఘంగా ఉంది ు మిల్లు యజమానులు మనం చెప్పినవాటికి ుగీకరిస్తారని గ్యారంటీ ఏముంది ?'' అంటూ ుమయ్యదొర సిగరెట్ దమ్ము గట్టిగా లాగాడు

''ఒప్పుకోడం, ఒప్పుకోకపోవడం తర్వాత సంగతి ు విషయాలతో కూలీ జనాన్ని రెచ్చగొట్ట ప్పు అలా రెచ్చిపోయినవాళ్లు వో పట్టాన దిగ రరు మనం వెనక ఉండి ఉద్యమం నడిపిస్తే ళ్ళు సమ్మె చెయ్యడానికి కూడా పూను ంటారు ఆ సమ్మెకు మీ పార్టీ నాయకత్వం హించాలి అవసరమైతే కార్మికులకు కొంతమదుపు ట్టాలి అప్పుడు మిల్లు యజమానులు కార్మి ుల కోర్కెలను అంగీకరించక ఏంచేస్తారు ప్పుడు కార్మికుల కోర్కెలు తీరుతాయి వాళ్లు క మీ చెప్పుచేతల్లో ఉంటారు అంతేగాక ువిధంగా కూడా నరసింహప్ప దొరవారిని సాధించి ట్టు అవుతుంది మిల్లులో ఆయనకు కూడా ాగం ఉందిగా'' అన్నాడు కరణం

కరణం ఇచ్చిన సలహా అందరికీ నచ్చింది మరు ుటిరోజునుంచే దాన్ని ఆచరణలో పెట్టి, అందుకు ుేయవలసిన సన్నాహాలు మొదలైనవన్నీ ఏర్పాటు ుేయడానికి పూనుకున్నారు

''సరే—రేపు మళ్లీ అంతా కలుసుకుందాం'' అన్నాడు చలమయ్య

అందరూ చలమయ్య దగ్గర సెలవు తీసుకొని వెళ్లిపోయారు

చలమయ్య సోఫాలో కూర్చుని సిగరెట్ పొగ వలయాలుగా వదులుతూ ఆలోచిస్తున్నాడు

''కరణం ఇచ్చిన సలహా ప్రకారం కార్మికు లకు ఏవో ఆశలు చూపి రెచ్చగొట్టి ఉద్యమం లేగిస్తే తనూ, తనపార్టీ నిస్సందేహంగా బాగా ప్రచారంలోకి రావచ్చు కాని మిల్లు యాజమాన్యం కార్మికుల కోరికలను ఓ పట్టాన అంగీకరిస్తారా ? అంగీకరించకపోతే సమ్మె తప్పదేమో! సమ్మె జరిపించేటట్లయితే ఫలితాలు ఎట్లా ఉంటాయో ? ఈ సమ్మెపట్ల రాజారావు ముఠా సానుభూతి కాని, ప్రజల సానుభూతి కాని ఉంటుందా! నరసింహప్పకు, రాజారావుకు మనస్పర్థ లున్నాయి కాబట్టి రాజారావును తను కూడగట్టుకోవాలి ఒకవేళ అతను తనతో కలసినా సమ్మెకు ఒప్పు కుంటాడా? ఊహూ అతని సిద్ధాంతాలు వేరు నడుస్తున్న ప్రభుత్వ విధానంపైన పూర్తి విశ్వాసం లేకపోయినా, అధికారపక్షంవా డనడానికి సందేహం లేదు'' ఈ ఆలోచనలు చలమయ్య బుర్రలో చెలరేగుతున్నాయి రాజారావు కలిసిరానంత మాత్రాన, సమ్మెపై అతని సానుభూతి లేనంతమాత్రాన తనకు వచ్చిన నష్టమేమీ లేదనీ, పైగా ఇంకా పలుకుబడి ఇనుమడిస్తుందనీ అనుకున్నాడు ఆ అభిప్రాయం కలగడంతో తాను కార్మికోద్యమానికి నాయకత్వం వహించడం, సమ్మె జరగడం, నరసింహప్ప ముఖం వేలవెయ్యడం, సమ్మె విజయవంతం అయ్యేప్పటికి కార్మికులంతా తనకు బ్రహ్మరథం పట్టడం అన్నీ చలమయ్య ఊహల్లో ముసురుకున్నాయి ఏదో తెలియని ఆనందం అతణ్ని ముంచెత్తింది

ఆ ఆనందంలో తేలిపోతుండగానే ''దొరవారి రాజకీయాలు అయిపోయాయా ?'' అంటూ అలివేణి అక్కడకు వచ్చింది అలివేణిని చూడగానే చలమయ్య బుర్రలో ఓ ఆలోచన తళుక్కున మెరసింది ''ఈ అందాలరాణి రాజారావుకు వల పన్నాలి'' అనుకున్నాడు

''వేణీ—నా రాణీ!'' అంటూ చలమయ్య అలివేణిని కౌగిట్లోకి తీసుకొని ముద్దాడాడు

''దొరవారు ఇవ్వాళ చాలా హుషారుగా ఉన్నారే'' కొంటెగా కళ్లల్లోకి చూస్తూ అంది అలివేణి, అప్పుడే ముడతలుపడుతున్న నుదుటినీ, గరుకు చెక్కిళ్లను అలవోకగా నిమురుతూ

''నిన్ను చూస్తే ఎవరికి హుషారు రాదు వేణీ!



అందులో ఇవ్వాళ చాలా అందంగా తయారయ్యావు'' అంటూ చలమయ్య ఆమెను మరింత గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు

''అబ్బ అంతా మోటుతనం నరాలు విరిగిపోయేను'' అంటూ అలివేణి కౌగిట్లోంచి తప్పించుకుంది

''వేణీ నీవు రాజారావును ఎరుగుదువు కదూ ?'' ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాడు చలమయ్య

''బాగుంది వాకేం తెలుసతను మీరు చెప్పుకుంటుంటే వినడమేగాని ఎప్పుడూ చూడనైనా లేదే ?'' ఆశ్చర్యంగా అంది అలివేణి

''అవునులే నీ వెప్పుడూ చూడలేదు మనిషి మహా గట్టివాడు నీ కెప్పుడూ అతణ్ని చూడాలని అనిపించలా ?''

''ఊహూ నా కెప్పుడూ అనిపించలేదే ! అయినా చూడాలని ఉంటేమటుకు మీరు మహా చూడనిస్తారేమిటి ? నలుగురు కూర్చుని మాట్లాడుతున్నప్పుడు ఆ చాయలకే రానివ్వరుగా'' అలివేణి నిష్ఠూరంగా అంది

''అబ్బే నీమీద నాకు నమ్మకంలేక కాదు వేణీ ! అందరి దృష్టి నీమీద పడటం దేనికని ''

''మీరేకాదు మీ మొగవాళ్లంతా అంతేలెండి అందమైన తమ ఆడవాళ్లను ఎంత సన్నిహిత స్నేహితుడైనా చూడటానికి ఒప్పుకోరు కాని అందరు ఆడవాళ్లూ తమ ఒళ్లో వాలాలని లొట్టలు వేస్తారు ''

''మొత్తానికి గట్టిదెబ్బే తీశావే—మా మొగజాతి మీద అదంతా ఎందుకుగాని నీవు రాజారావును చూడదలుచుకుంటే దివ్యంగా చూడవచ్చు ''

''అతను నన్ను ఎత్తుకుపోతే ?'' కొంటెగా అంది అలివేణి

''అతను నిన్ను ఎత్తుకుపోవడం కాదు—నీవే అతణ్ని ఎత్తుకురావాలి వేణీ !'' అని నవ్వాడు చలమయ్య

''మీ మాటలు అర్థం కావడంలా'' అమాయకంగా అంది అలివేణి

''చెప్తున్నాగా నీ అందం, చందం చూస్తే రాజారావేమిటి బ్రహ్మయినా దిగివస్తాడు నీ సౌందర్య పంజర సమీపానికి రాజారావును నావైపుకు తిప్పుకోవాలంటే నీ సహాయం కావాలి వేణీ ! నీవు అతణ్ని నిమిషంలో బుట్టలో వేసుకోగలవు'' అన్నాడు చలమయ్య

''నేనే అతని బుట్టలో పడితే ?''

''అక్కడే ఉంది తమాషా నీవు జాగ్రత్తగా ఉంటూ అతణ్ని కవ్వించి నీ చుట్టూ తిప్పుకొనేట్టు చేసుకుంటే చాలు—మిగతా వ్యవహారం నేను చూసుకుంటా ''

''అంటే మీ ఉద్దేశం, నేను అతణ్ని రెచ్చగొట్టి నా చుట్టూ తిప్పించుకుని ఏడిపించాలే గాని నేను మటుకు అతనికి లొంగకూడ దంటారు ఒకవేళ అందగాడై ఉండి నా మనస్సు చలిస్తే ? నాకెందుకు బాబూ ! ఈ లేనిపోని గొడవంతా నేను అతణ్ని చూడనూ వద్దు—అతణ్ని కవ్వించనూ వద్దు ఏదైనా పొరపాటు జరిగితే మీరు నన్ను దండించనూ వద్దు'' ఖండితంగా అంది అలివేణి

చలమయ్య ఆలోచనలోపడ్డాడు.

రాజారావునుగూర్చి చలమయ్య అంతగా చెప్పడంవల్ల అతణ్ని చూడాలనే ఉబలాటం అలివేణిలో కలిగింది

''ఏమిటి ఆలోచిస్తున్నారు ? నిజంగానే ఒకళ్లను చూడంగానే లొంగిపోయేటంతటి బలహీనురాలి ననుకున్నారా ?'' కొంటెగా కళ్లల్లోకి చూస్తూ అంది అలివేణి

''అబ్బే నీ సంగతి నాకు తెలియదూ ? .. నాకు ఓపట్టాన లొంగావా ? కాని రాజారావు అంత సులభంగా లొంగుతాడా అని ఆలోచిస్తున్నా'' అన్నాడు చలమయ్య

అలివేణి ఒక్కసారి తనను తాను చూసుకుంది పమిట సర్దుకుంటూ

''ఇది బైటకు పొక్కకుండా ఉండాలి వేణీ ! నలుగురికీ తెలిస్తే నాకు తలవొంపులుగా ఉంటుంది ''

''రెండోకంటికి తెలియనిస్తానా ? చూస్తరుగా నా చాతుర్యం'' నవ్వుతూ అంది అలివేణి

సరే కాని జాగ్రత్త రాజారావును చూసి మురిసిపోయి అసలు సంగతి మరచిపోయేవు ''

''మీ కంత అనుమానముంటే మీ వ్యవహారంలో నన్ను ఇరికించకండి'' అంటూ ముక్కు విరిచి లోపలకు వెళ్లింది అలివేణి

చలమయ్య కూడా నవ్వుకుంటూ ఆమె వెంట వెళ్ళాడు (సశేషం)

## మనరాజధాని పోకడ

(17-వ పేజీ తరువాత)

ష్టాండులం పెట్టి హొటల్ లోపటికి పోయిన ఖాళీగా ఉన్న ఒక కుర్చీమీద కూర్చున్న

"క్యాహొనా ?" అడిగిండు ఒక హొటల్ నౌకరోడు

"ఇడ్లి—సాంబార్ లావో" అని చెప్పిన

ఐదునిమిషాలల్ల ఇడ్లి—సాంబార్ తెచ్చి ముందట పెట్టిండు ఆ ప్లేట్ల రెండు చెంచలు పెట్టిండు నేను దాన్ని తినంగానే మల్ల వచ్చి ఏం కావాలని ఉర్దూలో అడిగిండు

"ఏక్ చాయ్ లావో" అని అన్న

చాయ్ తెచ్చి ముందట పెట్టిండు దాన్ని తాగంగనే వో చిట్టీమీద 0 75 నంబరేసుకొని తెచ్చి నా కిచ్చిండు దాని తీసుకపోయి మేనేజర్ టేబుల్‌మీద పెట్టంగనే "బారాన" ఇయ్యమన్న డాయన

అరే ! ఒక చాకు, ఒక ఇడ్లి—సాంబార్‌కు బారా నవా ? వానికి దిమాక్ సంటర్లలేక అట్లడుగు తండో ఏమో ననుకొని "అయ్యా, నేను ఒక చాయ్, ఒక ఇడ్లి—సాంబారే తిన్న" అని చెప్పిన

"ఆ, గావాటికే బారాన ఇయ్యి" అన్నడు వాడు

"హే భగవాన్, నన్ను ఈ హొటళ్లకు ఎందుకు రప్పించినవ్ ! ఉంకోసారి ఈ పట్నంల హొటలకు పోను" అని అనుకోని వానికి బారాన ఇచ్చి బయటికి వచ్చిన

ఆడినుంచి సుల్తాన్ బజార్ మీది కేలి, కోటి మీదికేలి పుత్లిబావురి చౌరస్తా కాడినుంచి ముందుకు పోబోయిన కాని అక్కడ నిల్చున్న వో పోలీసోడు వన్నాపిండు

"అప్పుడు నేను ఈదారికేలే ఇటువచ్చిన ఇప్పు డెందుకు మల్ల పోనిస్తలేవు" అని అడిగిన

"ఇది వన్‌వే ట్రాఫిక్ ! ఇటునుంచి రావాలే కాని పోవద్దు ఇదుగో ఈ పుత్లిబావురీ రోడ్ కేలిపోయి కుడిదిక్కు తిరిగితే నయాపూల్ వస్తది" అని చెప్పిండు

నేను ఆయన చెప్పిన దిక్కుకేలే జర దూరం పోంగనే అడ్డంగ ఒకరోడొచ్చింది కుడిదిక్కున రోడెక్కిన అట్లనే ముందుకు పొయ్యి బోలెడన్ని బస్సులు నిలబడున్న వో జాగను "సిటి—బస్ స్టేషన్" అని తెలుసుకున్న ఇంకా జర ముందుకు పొయ్యేవరకు చాన ఎత్తున ఒక తెల్లటి బంగ్ల వచ్చింది దాని ముందట "స్టేట్ సెంట్రల్ లైబ్రరి" అని రాసుంది దానిలోపట చానమంది పుస్తకాలు చదువుకుంటున్నట్టు అద్దాలకేలి జర జర కనబడ్డది

అట్లనే చూసుకుంట ముందటికి పొయ్యేవరకు నయాపూ లొచ్చింది ఇంతట్లనే ఒక మోటర్ సైకిలు నన్ను రాసుకుంట పోయింది ఎవ్వడ వీడు !, అని అటు చూసిన అరె ! ఒక ఆడామె నడిపిస్తుంది సైకిలుమోటరు !! నేను ఆమె దిక్కే చూసుకుంటూ సైకిలు తొక్కుతున్నంత ట్లనే నా సైకిలు వో ముసలామెకు టక్కరిచ్చింది నేను నా సైకిలు సంబాళించుకోపోయిన కాని పోయిద లేకుండ పోయింది ఆ ముసలామె పుట్‌పాత్ మీదా, నేను రోడుమీద పడ్డం అంతలోపట్లనే ఓ పోలీసోడు ఉరికొచ్చి నా సైకిలు గుంజుకున్నడు నేను ఏడుపుమొఖం పెట్టి 'అయ్యా, వాది తప్ప యింది ఉంకోసారి మంచిగ తొక్కుత. ఈ మొదటి సారి వదిలిపెట్టు" అని బతిలాడిన కాని వాడు వినలేదు నా సైకిలు గుంజుకపోయి అక్కతో ఉన్న అఫ్జల్‌గంజ్ పోలీస్ స్టేషన్ల పడేసి నాకొక్క రసీదు రాసిచ్చిండు

"దీన్ని తీసుకపోయి రేపు ఈ పూటొతం ఉన్న "సిటి క్రిమినల్ కోర్టుకురా అక్కడ కోర్టోల్లు చెప్పినంత జుర్మా నిచ్చి నీ సైకిలు తీసుకపో" అని అన్నడు పోలీసోడు

చచ్చిరా దేవుడా, అనుకుంట ఇంటిదారి పట్టాను

నేను ఇల్లు చేరేవరకు నాలుగైంది మా అత్త అన్నం తింటావా బాబూ" అని అడిదిగింది నేను మామ వచ్చినంక తింటనని చెప్పిన సరేనని వూరు కున్నది

పొద్దుమి అరు గంటలకు మామ వచ్చిండు రాంగనే నన్ను చూసి "ఎక్కడెక్కడికి పోయినవ్, ఎన్ని డోకాలు తిన్నవ్" అని అడిగిండు

"కొందరు డోకిచ్చిండ్రు—కొందరు నాతోటే డోకా తిన్నరు" అని అన్న

"జరవా ఖ్లైవరో చెప్పు వింట" అని అన్నడు

అప్పుడు ఇట్ల చెప్పిన "నేను నయాపూ లెక్కం గనే ఒకడు ఎవరో జేబు కొట్టేసిండ్రని ఇరవై రూపాయల పెన్ను నాకు ఐదు రూపాయల కిచ్చిండు"

"ఏది పెన్ను చూపెట్టు" అని అడిగిండు మామ

జేబులకేలి పెన్ను తీసిచ్చిన దాన్ని జరసేపటి దాకా పరీక్షచేసి పకపక నవ్వుకుంట "ఒరేయి బాబూ, ఈ పెన్ను చారానాకు కూడా పనికిరాదు కొన్న రెండు రోజులకి పాడైతది" అని అన్నడు

నాకు ప్రాణం పోయినట్టయింది పోనీ రెండో దన్న బితాయించలేదా అనుకొని ఇస్పేటాటలో గెలి చిన నాలుగు రూపాయల బిల్లలు తీసి చూపెట్టిన మామ వాటిని కూడ పరీక్షచేసి, ఆ బిల్లలతోటి అర చేతిల రాసుకొని చూసి "వోరి పిచ్చోడా, ఇవి చెల్లని రూపాయలు" అని అన్నడు నాకు నిజంగ చచ్చి పోతున్నట్టనిపించింది ఇక మూడోది హొటలు ! అది డోకే !! నాలుగోది సైకిలు టక్కరు ఇదీ ఒక తీరు డోకే ! ఈ రెండు కూడా చెప్పిన

అప్పుడు మామ ఇంటి వాసాలు విరిగి మీద పడేటట్టు నవ్వుకుంట ఇట్లన్నడు "ఇది హైదరా బాదురా బాబు లంగలకూ, లఫంగలకు మశూర్ ! అందుకని ఇక్కడ చాన ఉశార్‌తోటి ఉండాలె ! బజార్ల కనిపించినవన్ని కొనుటానికీ, మనకు తెలవ నోనితోటి మాట్లాడటానికీ, కనిపించిన హొట ళ్లల్ల చొరుటానికీ, దిక్కులు చూసుకుంట నడుసుటానికీ ఇక్కడ కోశిశ్ చెయ్యొద్దు"

సరే, ఇకముందటనన్న ఎవ్వరి డోకాల పడుకుంట ఉశార్‌గా ఉండాలనుకున్న ★



తమిళ చిత్రాల్లో ఉత్తమనటిగా ఎన్నికైన శ్రీమతి జానకికి శ్రీ మేధీ బహుమతి ప్రదానం

సమాజంలో నైతికస్థాయిని పెంపొందింప జేసేందుకు చలనచిత్రాలు కృషిచేయాలని మద్రాసు గవర్నరు శ్రీ బిష్ణురాం మేధి జులై 23 వ తేదీన విజయ గార్డెన్సులో జరిగిన 1960 సంవత్సరపు ఉత్తమ చిత్రాలకు కళాకారులకు బహుమతి ప్రదానోత్సవ సభకు అధ్యక్షత వహిస్తూ ఉద్బోధించారు

గవర్నరు శ్రీ మేధి మద్రాసు చలన చిత్రాభిమానుల సంఘం ఏర్పాటుచేసిన ఎన్నికలలో ఉత్తమంగా నిర్ణీతమైన చిత్రాలకు నటీనటులకు బహుమతులు పంచిపెట్టారు

శ్రీ ఎం భక్తవత్సలం ప్రసంగిస్తూ మన చిత్రాలు కూడా చిత్రలోకంలో ఉన్నత ప్రమాణాలు అందుకొనటం గర్వించదగినవిషయం అన్నారు

దక్షిణభారత చలనచిత్ర వాణిజ్యమండలి అధ్యక్షులు శ్రీ ఎ ఎల్ శ్రీనివాసన్ ప్రసంగిస్తూ తమిళ చిత్రాలను అంతర్జాతీయ చిత్రోత్సవాలకు పంపితే ప్రపంచప్రశంస లభించగలదనీ అలా పంపేందుకు మద్రాసు ప్రభుత్వం సహకరించాలనీ అన్నారు

శ్రీ ఎస్ బాలకృష్ణచెట్టి ప్రసంగిస్తూ పోలీసు గూర్చి చిత్రం నిర్మించేందుకు సహకరించిన నిర్మాత (శివాజీ గణేశన్) కళాకారులకు కృతజ్ఞతలు తెలిపారు

శ్రీమతి సావిత్రీ గణేశన్ ప్రసంగిస్తూ తాము తమ భర్త (జెమినీగణేశన్) కలసి ఒక ఉత్తమ నిర్మాతకు కూడా బహుమతిని ఇవ్వటానికి సంకల్పించామన్నారు శ్రీయుతులు ఎన్ కృష్ణస్వామి ఎన్ విఠల్ కె ఎ తంగవేలు సౌందరం కైలాసం (స్వాగతం చెప్పారు) సౌకార్ జానకి ప్రభృతులు ప్రసంగించారు

ఈ క్రింది చిత్రాలకు వివిధ కళాకారులకు బహుమతులు లభించాయి

తెలుగు ఉత్తమ చిత్రం మాబాబు (ప్రగతి ఆర్ట్స్) ప్రత్యేక బహుమతి చివరకు మిగిలేది ఉత్తమ దర్శకత్వం జి రామినీడు (చివరకుమిగిలేది) నటి సావిత్రీగణేశన్ (చివరకు మిగిలేది) సహాయనటి సూర్యకాంతం (శాంతి నివాసం) నటుడు ఎ నాగేశ్వరరావు (మహాకవి కాళిదాసు) సహాయ నటుడు : గుమ్మడి వెంకటేశ్వరరావు, (ఋణానుబంధం) హాస్య నటుడు రేలంగి వెంకటరామయ్య కథ ఎస్ ఆర్ పిని సెట్టి (నిత్యకళ్యాణం పచ్చతోరణం) సంగీతం పెండ్యాల (మహాకవి కాళిదాసు)

తమిళం ఉత్తమ చిత్రం పడిక్కాద మేదై, దర్శకుడు ఎ. భీమసింగ్ నటి : సౌకార్ జానకి (పెన్నై విళక్కు) సహాయ నటి ఎం ఎన్ రాజం నటుడు : శివాజీగణేశన్ (పడిక్కాద మేదై) సహాయ నటుడు : ఎస్ వి. రంగారావు (పడిక్కాద మేదై), హాస్య నటుడు కె. ఎ తంగవేలు కథ ఆర్ కె. కణ్ణన్ (పార్థై తెరియుదుపార్) సంగీతం : కె వి. మహాదేవన్ (పడిక్కాద మేదై)

కన్నడం ఉత్తమ చిత్రం రణధీర కంఠీరవ నటి కుమారి కృష్ణకుమారి (భక్త కనకదాస) నటుడు రాజకుమార్ (కనకదాస) సహాయ నటుడు ఉదయకుమార్ (కనకదాస) హాస్యనటుడు నరసింహరాజు (రణధీర కంఠీరవ)

మలయాళం ఉత్తమ చిత్రం ఉమ్మా నటి బి ఎస్ సరోజ (ఉమ్మా) సహాయనటి శ్రీమతి చాందిని (స్త్రీ హృదయం) నటుడు తిక్కురిసి



సహాయనటుడు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు



తెలుగులో ఉత్తమనటి శ్రీమతి సావిత్రీగణేశన్,



ఉత్తమదర్శకుడు శ్రీ రామినీడు (చివరకు మిగిలేది)



ఉత్తమ హాస్యనటుడు శ్రీ రేలంగి వెంకటరామయ్య.



కన్నడంలో ఉత్తమనటి కృష్ణకుమారి



ఉత్తమనటుడు శ్రీ ఏ. నాగేశ్వరరావు



ఉత్తమ సహాయనటుడు శ్రీ యస్. వి. రంగారావు.



ఉత్తమ సంగీతదర్శకుడు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు

(ఉమ్మా) సహాయ నటుడు టి యస్ ముత్తయ్య (స్త్రీ హృదయం) హాస్యనటుడు బహదూర్ (ఉమ్మా)

బాల నటుడు తమిళం మాస్టర్ గోపాల్ (విజయపురి వీరన్) ఛాయ తమిళం విన్సెంట్ (మీండస్వర్గం)

ఈ బహుమతి గ్రహీతలలో తమిళ కన్నడ భాషలలో ఉత్తమ బహుమతి పొందినవారిలో ఎస్ వి రంగారావు సౌకార్ జానకి కృష్ణకుమారి దర్శకుడు భీమసింగ్ ఆంధ్రులు కావటం ఎంతైనా హర్షించదగ్గ విషయం

నటీనటులకు తదితర కళాకారులకు మా శుభాకాంక్షలు ★

## వార్తా ప్రపంచం

### జగ్గయ్య చిత్రనిర్మాణం

ప్రసిద్ధ నటుడు శ్రీ కె జగ్గయ్య చిత్ర నిర్మాణానికి పూనుకొన్నట్లు తెలుస్తోంది జాగృతి పిక్చర్స్ అనే సంస్థను స్థాపించి చిత్ర నిర్మాణం ప్రారంభించబోతున్నారట ఈ చిత్రానికి కథ సి వంగయ్య దర్శకత్వం మధుసూదనరావు

### శంభూ ఫిలింస్ ద్వితీయ చిత్రం

సమ్మినబంటు నిర్మాత శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి తమ శంభూ ఫిలింస్ తరఫున ఇంకొక సాంఘిక చిత్రం నిర్మించబోతున్నారు

శ్రీ బి ఎస్ రెడ్డి దర్శకత్వం వహించబోయే ఈ చిత్రానికి వాహినీ ప్రొడక్షన్స్ ఆఫీసులో ఇటీవల పూజ జరిగింది

### డి పి ఎస్ వారి ప్రేమకానుక

సెమశిలా ప్రొడక్షన్స్ పేరిట శ్రీ కృష్ణ పాండవ యుద్ధాన్ని తెలుగు ప్రజానీకానికి సమర్పించిన నిర్మాత శ్రీ డి. పి. నాయుడు త్వరలో 'ప్రేమకానుక' అన్నచిత్రాన్ని నిర్మించబోతున్నారు.



తెలుగులో ఉత్తమ సహాయనటి శ్రీమతి సూర్యకాంతం

డి. పి. యస్. ప్రొడక్షన్ పేరిట నిర్మించ బోయే ఈ చిత్రానికి శ్రీ కృష్ణ రచన ప్రేమకానుక కథ ఆధారం ఇది మెరుపు పత్రికసీరియల్‌గా వెలువడింది

### బికారి రాముడు

సుఖీభవవారి బికారి రాముడు చిత్ర నిర్మాణం క్రమపద్ధతిలో జోరుగా జరుగుతోందని తెలుస్తున్నది

కథారచయిత పి వ దర్శకత్వం నిర్వహిస్తున్న ఈ చిత్రానికి నిర్మాత బి ఆర్ నాయుడు ఛాయ మాధవ బుల్‌బులే అప్పారావు సంగీతం బి గోపాలం నటీ నటులు సి యస్ ఆర్ జి వరలక్ష్మి కాంతారావు నాగభూషణం మీనాకుమారి ఋష్యేంద్రమణి రమణారెడ్డి ప్రభృతులు

### సావిత్రీఫిలింస్ సాంఘిక చిత్రం ప్రారంభోత్సవం

సావిత్రి ఫిలింస్‌వారు తమ ప్రథమ సాంఘిక చిత్రానికి ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు. ఈ చిత్రంలో సావిత్రి కాంతారావు రాజనాల రేలంగి గిరిజ ప్రభృతులు పాల్గొంటున్నారు దర్శకత్వం బంగారు రాజా ★

# మనము-మన రాష్ట్రం

(14-వ పేజీ తరువాయి)

ర్వేషన్ 38% కు పెంచాలని ఆదేశించారు జిల్లా పరిషత్తులలో కూడా ఈ నిష్పత్తి 20 నుంచి 30 వరకు పెంచాలని తాఖీదు పంపినట్లు శాసన సభలో వెల్లడించారు

రాష్ట్ర జనాభాలో దామాషాను బట్టి చూస్తే వెనుకపడినవాళ్ల సంఖ్య ఎక్కువ వయోజన వోటింగ్ పుణ్యమా అంటూ, రాష్ట్ర శాసన సభలో కూడా వారి సంఖ్యాబలం పెరిగింది రిజర్వుడు సభ్యులు దాదాపు 50 మందే గాక వెనుకబడ్డ వర్గాలకు చెందిన మరో పది పది హేను మంది ఉన్నారు ఇటు జనాభాలోనూ, అటు ప్రభుత్వంలోనూ, పైచేయి వారిదే గనుక ఇక ఒకరి సహాయం లేకుండా తమ్ము తాము ఉద్ధరించుకోగలరు యుగయుగాలుగా వెనుకబడి ఉన్నవారు పైకి రావలసిందే తలో చేయివేసి వారిని ఉద్ధరించాల్సిందే ప్రభుత్వాధికారాన్ని అందుకు సాధనంగా ఉపయోగించినా తప్పు పట్టాల్సిన పని లేదు కాని అలా పైకి వచ్చే వెనుకబడిన వారికి ఘగ తీర్చుకోవాలన్న దృష్టి మాత్రం పనికిరాదు కుల వ్యవస్థను తెగన డుతూ, కులం దృష్టితో చూడటం సబుబుగా దనిపిస్తుంది పూర్వ మెప్పుడో వర్ణాశ్రమ వ్యవస్థలో తమవారికి జరిగిన అన్యాయం మనస్సులో మెదులుతున్నట్లు శ్రీ సంజీవయ్య అడపా దడపా చేసిన ప్రసంగాలలో వ్యక్తమవు తూనే ఉంది ఒకప్పుడు అగ్రస్థాయిలో ఉన్న వారు, నేడు అడుగున పడిపోయారన్న సంగతి గ్రహించి వారు కూడా వెనుకపడినవారే నని పరిగణించడం ధర్మం శ్రీ సంజీవరెడ్డి అన్నట్టు, వెనుకబడిన తనానికి కులం కాక, ఆర్థిక స్తోమతు కొలబద్ద కావాలి పేదరికం ప్రధానమాత్రం కావాలి అర్హత, తెలివితేటలు గల యీ బాపతువా రందరు పైకి వచ్చేట్లు చూడాలి కులానికే ప్రాధాన్యం యివ్వాలని పెట్టుకుంటే అది కేవలం వెనుకబడిన ప్రభుత్వమే అనిపించుకుంటుంది

* * *

ఉస్మానియా విద్యార్థుల సమ్మె గౌరవప్రదంగా సమాప్తమైంది విద్యాలయాలు మూసివేసి నందుకు ఆవేశపడక నిగ్రహంగా వ్యవహరించిన విద్యార్థులు, చాకచక్యంగా వ్యవహరించి శీఘ్రంగా ఒప్పందాన్ని కుదిర్చిన మధ్యవర్తులు, ఇందుకు సావకాశం కల్పించిన ప్రభుత్వము, విశ్వవిద్యా లయాధికారులు అభినందనీయులు

ఒప్పందంలో ఆరు అంశాలున్నవి అందులో మూడు ప్రధానమైనవి సంవత్సరానికి 1800, అంతకులోపు ఆదాయం వచ్చేవారి బిడ్డలకు పూర్తిగా లేక సగం జీతం మినహాయించే ప్రతిపా దనలను ఉపాధ్యక్షులు సిండికేట్ ముందుంచాలని, రుసుముల హెచ్చింపు గురించి తెలంగాణా ప్రాంతీయ సంఘం తీర్మానాన్ని సిండికేట్ పరిశీ లించాలని, జీతాల మినహాయింపును విశ్వవిద్యా లయం ప్రతినిధులు, విద్యార్థి సమితి అధ్యక్ష కార్యదర్శులతో కూడిన ఉపసంఘం మంజూరు చేయాలని తుది పరిష్కార బాధ్యతను విశ్వ విద్యాలయ పాలకవర్గానికి వదలినందున అటు వారి గౌరవం కాపాడినట్లుంది జీతాల మినహా యింపు మంజూరుచేసే సంఘంలో తమ అధ్యక్ష కార్యదర్శులను నియమించడంవల్ల ఇటు విద్యార్థు లకు మన్నన యిచ్చినట్లయింది ఇక ఇంతవరకు జరిగిన ఆందోళనను అందుకు దారితీసిన పరి స్థితులను పరిశీలించి, తెలంగాణా ప్రజానాయకుల అభీష్టాన్ని పాటించి, సిండికేట్‌వారూ సముచిత మైన నిర్ణయం చేయగలరనే ఆశించవచ్చు

ఆందోళనకాలంలో ప్రభుత్వసొత్తుకు నష్టం కలిగించినందుకు విచారం తెలిపితే చాలు అని ఒప్పందంలో ఒక షరతు చేర్చినందున, అటు ప్రభుత్వంగాని, విశ్వవిద్యాలయం కాని తప్పుచేసిన విద్యార్థుల్ని నిర్దాక్షిణ్యంగా శిక్షించాలని పెట్టు కోకపోవడం చాలా సమంజసం ఇందువల్ల ఇంత వరకు జరిగినదానిని మరచిపోయి, ఉభయత్రా సద్భావంతో వ్యవహరించడానికి వీలు కల్పించిన ట్లయింది 

# మనము-మన దేహస్థితి

(14-వ పేజీ తరువాయి)

గ్రంధులున్నవి లేరింగ్సులో కేన్సరు అంకురించ గానే యీ గ్రంధి ఉబ్బుతుంది ఫేరింగ్సు వెనుక భాగంలోను ఈ గ్రంధులు ఉన్నవి అయితే వాటిని చేతితో నిమిరి చూడడానికి వీలుండదు కంఠ భాగములో తీవ్రమయిన క్రిమిదోషం యేర్ప డ్డప్పుడు ఈ గ్రంధులన్నీ అంతో యింతో పెద్ద వయి చింతగింజలలాగా చేతికి తగులుతవి

కంఠ వ్యాధులు చాలా ఉన్నవి టాన్సిల్, దానికి ముందూ వెనకా ఉండే తడికెలవంటి నిర్మితులు (వీటిని ఫాసిస్—అంటారు) అంగిలి, ఫేరింక్సు, లేరింక్సు, ఎడినాయిడ్సు, కొంతనాలుక—యివి కంఠ ప్రదేశంలో ఉండే ముఖ్య భాగములు ఈ ప్రదేశంలో ఎక్కడ ఏ రకమయిన వ్యాధి అంకు రించినా, ప్రధానంగా ఏర్పడే లక్షణములు రెండు (1) గొంతు బొంగురుపోవడం (2) గొంతుకలో నొప్పి

గొంతుకలో నొప్పి ఏర్పడ్డదంటే యీ క్రింది వ్యాధులలో ఏదో ఏర్పడుతున్నదన్నమాట

1 ఫేరింజైటిస్ (Pharyngitis)
2 టాన్సిలైటిస్ (టాన్సిలులో ఇన్‌ఫ్లమేషన్)
3 స్కార్లెట్ జ్వరం (Scarlet Fever)
4 డిఫ్తీరియా (Diphtheria)
5 సిఫిలిస్ (Syphilis)
6 ఫేరింగ్సు వెనక ఏర్పడే ఎబ్సెస్
7 గొంతుపూత (Sore throat)
8 కేన్సరు (Cancer)
9 కంఠ భాగములలో ఏర్పడే క్షయ
10 కంఠ భాగంలో యితర క్రిమిదోషమువల్ల ఏర్పడే ఇన్‌ఫ్లమేషనులు

ఈ పై వ్యాధులలో కొన్ని అతిసాధారణములు కొద్ది జాగరూకతతో, గృహవైద్యంతో నివారించ దగిన వ్యాధులు కాని అందుకు పూనుకునేముందు అంగిలినీ, నోటినీ, ఫేరింగ్సులో భాగములనూ పరీ క్షించడం తెలుసుకోవాలి రోగి నోరు బాగా తెరిచి నప్పుడు నాలుకను చెమిచా పిడితోనో, చేతి వ్రే లితోనో నొక్కిపట్టి, టార్చిలైటు గొంతులోకి వేసిచూస్తే ఆ ప్రదేశమును ప్రతివారూ తేలికగా పరీక్షించవచ్చును పెద్దవారిని నోరు తెరిపించి "ఆ, ఆ!" అని, రెండు మూడు సారులు అనిపిస్తే, అన్నప్పుడల్లా కొండనాలుక దానిని—అంటిఉండే అంగిలి వెనుకభాగమూ, పైకి పోతవి అదే సమ యంలో నాలుక వెనకభాగమూ క్రిందికి పోతుంది ఫేరింగ్సులో ఉండే భాగములన్నీ చక్కగా చూడ డానికి వీలవుతుంది కొందరిలో నాలుక వెనక భాగం మందంగా ఉండి, ఎంత అరచినా క్రిందికి పోదు అప్పుడు బద్ద ఆకారం కలిగి, అంచులకు వాడిలేని, చెమిచా పిడిలాంటి సాధనంతో నొక్కి చూడాలి ఈ పరీక్షకు రోగి సహకారం చాలా కావాలి ఆ పరీక్ష క్షణకాలమేననీ, అందువల్ల బాధ గానీ, ప్రమాదం గానీ ఉండదని రోగిని నమ్మిం చాలి నోటిలో ఏదో సాధనం ఉంచగానే, పెద్ద వాళ్లే భయపడతారు దగ్గుతారు చిన్నబిడ్డలు భయపడడంలో ఆశ్చర్యం ఏముంటుంది ఒకప్పు డొకడు బిడ్డ నాలుక నొక్కడానికి వేరే సాధనంలేక వొళ్ళెలు కోసే కత్తితో నొక్కిచూడడానికి ప్రయ త్నించాడు బిడ్డ భయపడి కదిలితే నాలుక తెగింది చిన్నపిల్లల నోట్లో వేలు పెట్టడమూ మంచిది కాదు వాళ్లు కరవవచ్చును చేతివేళ్ల గోళ్లలో ఉన్న క్రిమి సముదాయం నోటిలో ఉన్న క్రిమి సముదాయాన్ని అధికం చేయవచ్చును నోటిలో ఉంచే వేలూ, వేలి గోరూ, అతి పరిశుభ్రంగా ఉండాలి ఎడమచేతితో నాలుకను నొక్కిపట్టి కుడి చేతిలో టార్చి పట్టుకుని, గొంతు పరిశీలించడం మేలు ఆరోగ్యస్థితిలో గొంతుక, గొంతుకలో ఉన్న నిర్మితులూ, ఎల్లా ఉంటవో తెలుసు కొంటే, రోగస్థితిలో ఎల్లా మారుతవో తెలుసు కొంటానికి వీలుంటుంది ఆ మార్పులకు అర్థం నిర్ణయించడం, వాటికి చికిత్స చేయడం వైద్యుల విధి పిల్లలుగాని, పెద్దలు గాని గొంతు నొప్పి అని చెప్పగానే, గొంతు పరీక్షించి అక్కడ ఏదో మార్పు జరిగింది అని తెలియగానే వైద్యసహాయం పొందగలిగితే డిఫ్తీరియా వ్యాధికి బలి అయిపోయే వారిలో సగమందినైనా నిశ్చయంగా రక్షించ డానికి వీలుంటుంది

సాధారణంగా ఫేరింగ్సు పరిసరములు లేత గులాబీ రంగులో ఉంటవి ఫేరింగ్సు వెనుకభాగం లోనూ, నాలుక వెనుకభాగంలోనూ కొన్ని ఎగుడు దిగుళ్లు సహజంగానే ఉంటవి అవి ఎక్కువై ఎరుపుదనం ఎక్కువైనప్పుడు, ఆరోగ్యస్థితి కాదని గ్రహించవచ్చును దానికి తోడు, శిరోభారం, గొంతు నొప్పి, ఆ ప్రదేశంలో తెల్లని మచ్చలు, లేక ఒక కొంత ప్రదేశంలో తెల్లని పొరతో క్రమ్మిఉండడం మెడలో అవైపున ఉన్న లింఫు గ్లాండులు పెద్దవై ముట్టుకొంటే నొప్పిగా ఉండడం, కంఠంలో తీవ్ర మైన క్రిమిదోషాన్ని (Infection) సూచించే లక్షణములు వీటిని ఎంతమాత్రమూ నిర్లక్ష్యం చేయరాదు ఇవి రెండు మూడు రోజుల్లో సమసి పోవచ్చును లేక ముదిరి, వైద్యులు కూడా రక్షించలేని వ్యాధులుగానూ పరిణమించవచ్చును

పైన చెప్పిన విషయములు గుర్తు ఉంచు కొని క్రమంగా కంఠవ్యాధులను వర్ణిద్దాము

# మనమూ-మన దేహస్థితి



1 వ పటము




2 వ పటము

1 ఫేరింజైటిస్ (Pharyngitis)

ఐటిస్ అంటే ఇన్ఫ్లమేషను ఫేరింగ్సు యొక్క ఇన్ఫ్లమేషను ఫేరింజైటిస్ ఏ ఇన్ఫ్లమేషన్కైనా తీవ్రస్థితి (Acute), ఉపస్థితి (Sub acute) దీర్ఘస్థితి (Chronic) అని మూడు దశలు ఉంటవి ఫేరింజైటిస్ విషయంలోనూ అంతే!

కంఠంలో నిర్మితులన్నీ అతిసన్నిహితములైనవి అందువల్ల ఒక నిర్మితిలో ఈ ఇన్ఫ్లమేషను ఏర్పడితే ప్రక్కనవున్న నిర్మితులు కూడా వ్యాధిగ్రస్తము అవుతవి

ఫేరింజైటిస్ కలగడానికి ముఖ్య కారణములు మూడు 1 క్రిమిదోషము (Infection) 2 దోషకర వాయువులు 3 ఎల్లర్జీ (వైకట్యము) ఈ వ్యాధి ప్రధానంగా ఈ వ్యాధిగ్రస్తులు విడిచిన వాయువును పీల్చినందువల్లనూ, కంఠంలో ఉన్న మృదువైన మ్యూకస్ మెంబ్రేనును యిరిటేట్ (Irritate) చేసే వస్తువులలో వాయువులో దానిని తాకినప్పుడూ,, శరీరానికి పడని వస్తువులూ శీతోష్ణస్థితి భేదములు ఏర్పడ్డప్పుడూ ఏర్పడుతుంది చర్మంమీద పొతపోసే జ్వరము లన్నింటిలోనూ ఫేరింజైటిస్ ఒక ఫలితంగా ఉంటుంది ఆ వ్యాధులన్నీ వైరస్ అనే క్రిమి జాతివల్ల ఏర్పడేవి కంఠవ్యాధులతో పీడింపబడే రోగుల నోటినుండి వచ్చే వాయువులనూ, దంత సంబంధమయిన పయోరియాలో నుంచి వచ్చే దుర్గంధమునూ, పీల్చినప్పుడు వెంటనే ఫేరింజైటిస్ రావచ్చును పడనివారు మంచునీరు, మంచుడున్న పానీయములు, ఎవ్క్రీములు తీసుకున్న కొన్ని గంటలలోనే ఫేరింజైటిస్కు గురికావచ్చును పల్లం ప్రదేశములతో ఉండేవారు ఉన్నత ప్రదేశములకు పోయినప్పుడు, ఇది రావచ్చును అల్లాగే ఉన్నత ప్రదేశములలో ఉండేవారు, క్రిందికి వచ్చినప్పుడూ రావచ్చును గొంతు నొప్పి, మింగుతున్నప్పుడు బాధ, గొంతుకలో మంట, ఏదో ఇసకవంటి పదార్థం అక్కడ ఉన్నట్లుగా గరగరలాడడం, అందువల్ల దగ్గు, 100 డిగ్రీల నుండి 104 డిగ్రీలదాకా జ్వరము, ఈ వ్యాధి తీవ్రస్థితిలో ఉన్నప్పుడు ఏర్పడే లక్షణములు ఇన్ఫుయెంజా, ఫేరింజైటిస్ లక్షణములతోనే ఆరంభించవచ్చును

ఈ స్థితిలో ఫేరింక్సుమీద మ్యూకస్మెంబ్రేను ఎ ర్ర బ డి ఉబ్బివుంటుంది కొండనాలుక ఎర్రబడి, ఉబ్బి, సాగిఉంటుంది అంగిలి వెనుక, మెత్తని ప్రదేశమూ అల్లాగే ఉంటవి అక్కడ నుండి యీ వ్యాధి నాసికా రంధ్రములకు ప్రాకిజలుబు చేస్తుంది తరుచు జలుబూ ఫేరింజైటిస్ కలిసి ఏర్పడుతవి లేదా ఒకదానికి ఫలితంగా రెండవది ఏర్పడుతుంది ఎర్రని మ్యూకస్మెంబ్రేను మీద అక్కడక్కడ మ్యూకస్ జీరలు ఏర్పడుతూ ఉండవచ్చును

ఈ స్థితిలో యీ వ్యాధి ఒక రోజు నుండి 5 రోజుల వరకు వుండి పూర్తిగా సమసిపోవచ్చును

అల్లా కానప్పుడు, ఉపస్థితిలోకో, దీర్ఘస్థితిలోకో ప్రవృద్ధి పొందవచ్చును

తీవ్రస్థితిలో రోగులు చలిగాలి సోకనిచోట్ల పరిపూర్ణ విశ్రాంతి తీసుకోవాలి కాచి చల్లార్చిన నీటిని ఎక్కువగా తీసుకోవాలి గొంతుకలో యిరిటేషనుకు ఒక చెమిచా శుద్ధ లవణము (Standerd salt) ఒక గ్లాసెడు వేడినీటిలో వేసి ఇన్ఫ్లేం అయినచోట దానిని వుంచి పుక్కిలించాలి ఉప్పునకు నీటిని గుంజుకునే శక్తి ఉన్నది దీనికి మంచి క్రిమిసంహారక శక్తి ఉన్నది వేడినీరు ఇన్ఫ్లేం అయినచోటిని తాకినప్పుడు అక్కడ రక్తప్రసారం అధికమై, శ్వేత రక్తకణములు (W B C) అధికంగా వచ్చి, శీఘ్రంగా క్రిమి సంహారం జరగడానికి వీలు కలుగుతుంది అతి సాధారణ వస్తువైన ఉప్పుకు ఇన్ని ఔషధ లక్షణములు ఉన్నవి విశ్రాంతి తీసుకుని రోజుకు నాలుగైదు సారులు ఖుల్లా చేస్తేనే యీ వ్యాధి సమసిపోవచ్చును

డినేచర్డ్ స్పిరిట్ (Denatured Spirit)తో కాక పరిశుద్ధమయిన (Tincture) స్పిరిట్తో తయారుచేసిన టింక్చరు బెం జా యి న్ కో (Banzainco) ఒక చెమిచా తీసుకొని చిన్న గిన్నెడు నీళ్ళలో, అవి సలసలా మరుగుతున్నప్పుడే వేసి, ఆ వచ్చే ఆవిరులను పీల్చడం చాలా సుఖకరంగానూ, రోగ నివారకంగానూ ఉంటుంది ఆలహాలులో, ఔషధ వస్తువులు కరిగినప్పుడు ఆ ద్రావణమును (Solution) టింక్చరు (Tincture) అంటారు అయొడిన్ (Iodine) తో తయారయిన టింక్చరును గురించి చాలామందికి తెలిసి ఉంటుంది అయొడిన్, బెంజాయిన్ (సాంబ్రాణి) క్రిమిసంహారకశక్తి కలిగి, చర్మమునకూ, మ్యూకస్ మెంబ్రేనుకూ హాని కలిగించని వస్తువులు స్నానానంతరం చిన్న పిల్లలకు సాంబ్రాణి ధూపం వేయడానికి కారణం యిదే దెబ్బ తగిలినప్పుడు టింక్చరు అయొడిన్ కానీ, టింక్చరు బెంజాయిన్ కానీ రాయడానికి కారణం యిదే కాని, లోపలికి పీల్చడానికి పరిశుద్ధమైన ఆల్కహాలుతో చేసిన టింక్చరు కావాలి

మిగతా చికిత్సాక్రమం వైద్యుల విధి కాని వైద్యులే లేని ప్రాంతాలలో, గృహవైద్యం అవసరం కావచ్చు క్రిమిసంహారక వస్తువు లయిన పెన్సిలిన్ తోనూ, ఆరియోమైసిన్, టెర్రామైసిన్ వంటి ఆధునికౌషధములతోనూ, బిళ్లలు, మాత్రలు తయారుచేశారు ఇవి నోటిలో ఉంచుకొంటే కరిగిపోతవి అవి కరిగిన ఉమ్మినీరు క్రిమిసంహారక ద్రావణంగా తయారవుతుంది ధనవంతులు వీటిని వినియోగించవచ్చును కాని, ఉప్పునీటికన్నా టింక్చరు బెంజాయిన్ కన్నా, యివి ఎంత ఎక్కువ ఉపయోగకరము అన్నది సందేహాస్పదమయిన విషయము జ్వరం, ఒళ్ళు నొప్పులు ఉంటే 'యాస్పిరిన్' (Aspsrin) మాత్రలు పెద్దవారు అయిదు గ్రెయిన్లు, 14 సంవత్సరములవారు మూడు గ్రెయినులు, పిల్లలు రెండు గ్రెయినులు పూటకు ఉపయోగించవచ్చును ఒళ్ళు నొప్పులకు సోడియం శాలిసిలేట్ (Sodium Salycylate) ఇంగ్లీషు వైద్యులు వాడతారు మిరియాలలో యీ వస్తువులు ఉన్నది అందుకని మిరియాల కషాయం మనవారు వాడతారు అది చాలా మంచిది ఏస్పిరిన్ హృదయమును దుర్బలంచేసే వస్తువు అందుకని యాస్పిరిన్ వాడినప్పుడు హృదయమునకు శక్తి కలిగించే వస్తువులు తీసుకోడం అవసరం కెఫీన్ (Caffein) అటువంటిది కాఫీలో యీ వస్తువు ఉన్నది యాస్పిరిన్ తీసుకున్నప్పుడు కాఫీ తీసుకోడం మంచిది 'బేయర్' కంపెనీవారి కేఫియాస్పిరిన్, ఇందువల్ల వాంఛనీయము, క్షేమకరము కూడా ఏమయినా విధిలేనప్పుడు తప్ప స్వంత వైద్యం క్షేమకరమైనది కాదు

తీవ్రస్థితిలో పూర్తిగా ఉపశమించనప్పుడు ఫేరింజైటిస్ దీర్ఘస్థితిని పొందుతుంది అప్పుడు గొంతు బొంగురుపోతుంది బాధాకరమైన, దుర్నివారమైన దగ్గు కళ్ళే ఏర్పడుతుంది పొగాకుని విపరీతంగా సేవించేవారిలో యీ స్థితి యింకా విషమిస్తుంది ఫేరింక్సుమీది మ్యూకస్మెంబ్రేను, గంధ్రయినక పరిచినట్లుగా, గరుకుగా ఉంటుంది ఒకమాటు యీ స్థితి ఏర్పడ్డాక, తీవ్రస్థితి చీటికీ మాటికీ ఏర్పడి బాధ కలిగిస్తూ ఉంటుంది స్కూలు మేష్టర్లు, బిషప్పులు, నిత్యమూ ఉపన్యాసాలిచ్చేవారు అరిచి జీవించేవారిలో మరీ కష్టం ఈ స్థితి చాలాకాలం ఉంటే మ్యూకస్ మెంబ్రేను ఎండి, వాడి అక్కడ పుండు ఏర్పడుతుంది ఈ స్థితిలో వైద్యులు చేయుగలిగింది కూడా స్వల్పమే! అందుచేత, తీవ్రస్థితిలోనే ఫేరింజైటిస్ను నివారించుకోడం చాలా అవసరం ★

కిటికీ దగ్గరగా కూర్చుని బయటి చీకట్లోకి చూశాడు

అన్నీ మళ్లీ జ్ఞప్తికొచ్చాయి

*                    *                    *

ఒకనాడు రాత్రి ఎనిమిది గంటలకు ప్రకాశం ఒంటరిగా గదిలో కూర్చున్నాడు

ఆత్మపరీక్ష చేసుకున్నాడు

తనకు జీవితంమీదుండే అభిప్రాయాలను విమర్శించుకున్నాడు

ఎక్కడో వెలితి కనబడింది

ఒక్కొక్క గాయానికి ఒక్కొక్క మందు అతని గాయానికి మాత్రం మందు లేదనిపించింది

వెళ్లవద్దని హెచ్చరిస్తూ ఆ ఉదయం ఉష అదే అంది

'బావా! బడిపంతులుగా ఉండి ఏం సుఖం అనుభవిస్తావ్? నిన్ను చూస్తే నాకు జాలి వేస్తోంది నిన్ను నువ్వు సంరక్షించుకోలేవు ఎందుకిలా దిగులుగా ఉంటావ్? .. అందరికిమల్లే ఖరదాగా ఎందు కుండకూడదు?'

మావయ్య కన్నుమన్నాడు

'నేను బాధపడేది అందుక్కాదు బడిపంతులుగా ఉంటే తప్పేముంది?'

'వాడినాన్న సంపాదించిన ఆస్తి నాలుగు తరాలకు సరిపోతుంది కాలేజీ చదువు పూర్తయాక అతని జీవితం టీసుకో రెండు నెలలు గుమాస్తాగా ఉన్నాడు నెలరోజులు సేల్స్‌మాన్‌గా తిరిగాడు మరో నెల రోజులు ట్యూటరుగా వెళ్లిగాడు ఇలా రోజుకో అవతారం ఎత్తితే వాడు శ్రీ మహావిష్ణువుని మించిపోతాడు బి ఏ చదివాడు తిన్న తిన్నగా ఉండక 'మిటో భూగోళాన్ని నెత్తిన ఒక్కడే మోస్తున్నట్టు ఏడుపుమొహం—ఇవేం బాగుపడే లక్షణాలు కావు'

'అతన్నని ఏం లాభం' నువ్వు ఫిలాసఫీ ఎందుకు చదివించావు?' అంది ఉష నవ్వుతూ

'చదువు బతుకును సరిదిద్దగలిగితే ప్రపంచం ఏనాడో బాగుపడిపోను ఉషీ! శాసనాలు, చట్టాలు అవసరం లేకపోను' అన్నాడు పెళ్ళికు తాళంవేస్తూ ప్రకాశం

'అయితే వెళ్లటానికే నిశ్చయించుకున్నావన్నమాట?'

ప్రకాశం మావయ్యకేసి ఓమారు చూసి తల వంచుకున్నాడు కోపం, జాలి, విసుగు, విరక్తి—అన్నీ ఒక్కసారిగా మొహంమీద చెట్టాపట్టాలు వేసుకున్నాయి

'అవును' అన్నాడు నిశ్చయంగా ప్రకాశం

మావయ్య జరీ కండువా మెడచుట్టూ వేసుకొని వరచర బయటికిపోయాడు

ఉష ఆలోచించి చివరకు 'ఎలాగూ వెడుతున్నావు గనుక, ఈ వేషంతో ఉండక పిల్లలు బయటికి మోసేస్తారు' అంది

ఉష కాలేజీకి వెళ్లిపోయింది

ప్రకాశం పెరిగిన గెడ్డాన్ని ఓసారి తడిమి చూసుకుని నవ్వుకున్నాడు

నాలుగ్గంటల్లో అతను రామాపురం చేరుకున్నాడు

# కన్నీటిగీత

(9-వ పేజీ తరువాయి)

అక్కడకు రావలసివస్తుందని అతనికి మాత్రం ఏం తెలుసు?

పత్రికలో ప్రకటన వస్తే దరఖాస్తు రాసి పడేశాడు ఇంటర్వ్యూ అవసరం లేదని, వెంటనే వచ్చి జాయిన్ కమ్మని ఆర్డరు వచ్చింది

మావయ్యతో ఘర్షణపడి బయలుదేరాడు

హెడ్మాష్టర్ని కలుసుకుని వివరాలు మాట్లాడిన తరువాత అద్దె గదికోసం బయలుదేరాడు

---

ఒక ప్రముఖ వ్యాపారికి మరణమాసన్నమైంది. భార్యను పిలిచి యిలా అడిగాడు

వ్యా - మన పెద్దబ్బాయి ఎక్కడ?

భా-ఇక్కడే ఉన్నాడు.

వ్యా - రెండోవాడు.

భా -వాడూ యిక్కడే ఉన్నాడు

వ్యా - అమ్మాయి లెక్కడ?

భా -ఇక్కో

వ్యా.- అల్లుడుకూడ ఇక్కడే ఉన్నాడా?

భా - ఆఁ. అదుగో అక్కడ కూర్చుని ఏడుస్తున్నాడు

వ్యాపారిలో సమానం చచ్చిపోయింది అమాంతం ఎగిరి కేక వేశాడు

"మరి షాపులో ఎవరున్నట్టు?—"

ఎ సర్వేశ్వరరావు (కర్నూలు)

---

రామాపురం పల్లెకు పట్నానికి మధ్య త్రిశంకు స్వర్గంలా (లేక నరకంలా?) ఉండిపోయింది రెండు రకాల జీవితాల కూడలిస్థానం రెండెడ్లబళ్ళు బస్సుల్ని చూసి జడుసుకున్నాయి స్కూలు ఫైనలు ప్యాసై నాగరికతమీద ప్రయోగాలు చేసే అమ్మాయిలమీద, చదువురాని సుందరులు కక్షకట్టి అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు రేడియో పక్కనే, గ్రామఫోను 'కనకతార' రికార్డులలో కుస్తీ పడుతోంది విద్యుద్దీపంతో కిరసనాయిలు బుడ్డి పోటీపడుతోంది వూరు మధ్యగా చక్కటి తారురోడ్డు, తతిమా వన్నీ మట్టిదారులు ప్రకాశం గంటసేపు తిరిగి తిరిగి ఇంటి ముందు ఆగాడు. కళ్ళు మెరిశాయి.

'అద్దె కివ్వబడును' అన్న అక్షరాలు పెద్దవై దృష్టిని కప్పివేశాయి అరుగుమీదున్న ఇల్లాలు అభిప్రాయం గ్రహించింది

'రండి! ముందు గది చూసుకోండి' అంది ప్రకాశం ఆమెను వెంబడించాడు

గది విశాలంగా ఉంది పెద్ద కిటికీ ఉండటం వలన గాలిలో గంగాళాలు నింపవచ్చు గోడలు వెల్ల లేక వెలవెలపోయాయి గచ్చు అక్కడక్కడ పగిలి వళ్లికిలించింది పాలెపురుగులు గస్తీ తిరుగుతున్నాయి

'స్నానానికి ఇంటివెనుక నుయ్యి ఉంది బయటి వైపు గుమ్మం ఉంది కనుక ఇంటిలోంచి వెళ్లవలసి వస్తుందేమోనని మొహమాట పడకండి మీరు స్వతంత్రంగా ఉండవచ్చు

ప్రకాశం తల నిలువునా ఆడించి బయటికి వచ్చాడు

ఆ ఇల్లాలు కొంతసేపు వూరుకుని 'అద్దె పది రూపాయలు' అంది

ఆ విషయం అడగాలన్న జ్ఞాపకంఅతనికి లేనేలేదు. ఎక్కడో ఉండాలి ఎలాగో బతకాలి అంతే పరధ్యానంగా కిటికీలోంచి బయటకు చూస్తూ నిలబడ్డాడు

'ఏం నాయనా! అద్దె ఎక్కువని ఆలోచిస్తున్నావా! ఈ చుట్టుపక్క లెక్కడా నీకు గదులు దొరకవు చూడు బాబూ! నిజం చెప్తున్నా—డబ్బు గడిద్దామని కాదు మా కుటుంబ పరిస్థితి అలాంటిది మాకున్న ఆస్తల్లా ఈ ఒక్క ఇల్లే! వచ్చిన ఇద్దరు, ముగ్గురు కుర్రాళ్ళు గది బాగాలేదని వెళ్లిపోయారు పది ఇవ్వక్కర్లేదు తగ్గించుకో—గది ఎలావున్నా ఇంటి వెనకాల పెద్ద తోట ఉంది'

ప్రకాశం ఆశ్చర్యంతో ఆమెకేసి చూశాడు ఇంతవరకూ ఆమెను సరిగ్గా గమనించనేలేదు నిజంగా ఆమె కెన్నేళ్లో తెలియకపోయినా, చూట్టానికి యాభై సంవత్సరాలు దాటినట్టే ఉంటుంది ఆకుపచ్చరంగు ముతకచీర, చిరుగులు, కుట్లు, ఎముకల్ని కనపడకుండా దాచటానికి ప్రయత్నించే ముడతలుపడిన చర్మం

అతని గుండె చివుక్కుమంది పది రూపాయలు అడ్వాన్సు ఇచ్చాడు

అందుకుంటుంటే ఆమె చేతులు వణికాయి

'రేపుదయం వస్తాను' అన్నాడు

'రేపు మంచిరోజు కాదండి ఎల్లుండి చక్కటి రోజు'

అతను పెద్దగా నవ్వాడు ఆ యిల్లాలు ఉలిక్కిపడింది కూడా

'రోజులేం చేస్తాయండి? పాపం! అవన్నీ మంచివే! ఎటొచ్చీ మనిషి తన జాతిని భ్రష్టం చేయటంతో తృప్తిపడక వాటిక్కూడా మంచి చెడ్డలు ఆపాదించాడు పోనీ ఈవేళే వచ్చేస్తాను,

సామాను తీసుకుని చీకటిపడుతుండగా వచ్చేశాడు కొంత దూరంలో ఉన్న హొటల్లో భోంచేసి వచ్చి కూర్చున్నాడు

ఆ గదిలో కూర్చుని ఆలోచనలు సాగించాడు గత రెండు మూడు సంవత్సరాలుగా అతని కిదో అలవాటు.

'ఏమండోయ్! ఎంతసేపు అమ్మ, నాన్న మీకోసం తపస్సు చేయగలరు'' అనడిగాడు వేలెగ్గా కుర్రాడొకడు

ప్రకాశం ఉలిక్కిపడ్డాడు పొట్టి పంట్లాం తొడుక్కొని అతనికేసే చిత్రంగా చూస్తున్నాడు ఆ కుర్రాడు

'ఏమీ అనుకోకండి కొంచెం దుడుకుతనం ఎక్కువ—మా అబ్బాయి మీ స్కూల్లోనే ఫస్టు ఫారం చదువుతున్నాడు కాస్త కనిపెట్టండి' అంటూ రామయ్య గడపదగ్గర కూర్చున్నాడు అతని వెనకాలే ఇంటావిడ నిలబడింది రామయ్య వస పిట్టలా ఏవేవో మాట్లాడాడు ప్రకాశం గురించి వివరాలు సేకరించాక తన్ను గురించి చెప్పుకున్నాడు

రామయ్య చెప్పిన కథలో కొత్తదనం ఏమీ లేదు చిన్నతనంలో 'పసేమిరా' చదువుకోవని బడి ఎగ్గొట్టి గోలీలు ఆడి కాలాన్ని వృథా చేశాడు పెద్దయ్యాక తప్పిదం తెలుసుకుని పశ్చాత్తాప పడ్డాడు వంటపని నేర్చుకుని పెద్ద పెద్ద పెళ్ళిళ్లకు, పార్టీలకు వంట చేసేవాడు అతని భార్య కూడా అక్కడక్కడ పైపనులు చేసి తృణమో, పణమో సంపాదించేది ఆమె వంటలక్కగా వెడతానన్నా రామయ్య అడ్డుపడ్డాడు లావుగా పొట్టిగా వున్న రామయ్య నవ్వుతూ, అభినయంతో తన జీవితవిశేషాలను వర్ణించాడు

'కాని ఏం లాభం? రెండుచేతులా గడించి నాలుగు చేతులా ఖర్చు పెడుతున్నాను నా గురించి అసలు బెంగ లేదు కాని రాధమాటేమిటి?' అని ఆగిపోయాడు

'రాధంటే మీకు తెలియలేదు గామోలు! మా అక్కయ్య!' అన్నాడా కుర్రాడు

ప్రకాశానికి అతన్ని చూస్తే ఎందుకో భయం వేసింది

'ఆ అవును రాధ మా అమ్మాయి ఆమెకున్న తెలివితేటలకు, చురుకుదనానికి రాజాధిరాజు మెళ్లో తండ వేయాలి కాని దరిద్రుల కడుపున పుట్టింది. అయినా ఒక్క ఆశ మాత్రం ఉందండోయ్! నాలుగురోడ్ల కలిసేచోట ఓ హోటలు పెట్టాలి వందలు, వేలు గడించాలి రాధ పెళ్లి దివ్యంగా జరిపించాలి'

'మీ ప్లాను చాలా బాగుందండి' అన్నాడు ప్రకాశం

'ప్లాను కేమండి—బాగానే ఉంటుంది కాని పెట్టుబడి కనీసం నాలుగువందలన్నా ఉండాలి హోటలన్ని చూడగానే అయస్కాంతంలా ఆకర్షింపబడాలి ఆదినం కోసం ఎదురుచూస్తున్నా అలా ఎదురుచూసి ఓనాడు చచ్చిపోతాను రాధ అనాథైపోతుంది ఈ గోపి అడుక్కుంటాడు నా దగ్గర ఐదు దమ్మిడీలు కూడా లేవు'

ప్రకాశం రామయ్య మొహంకేసే చూస్తూనే ఉన్నాడు అతను వర్ణించిన దృశ్యం భయంకరంగా ఉన్నా చిగురంతైనా చింతలేదు ఎప్పటికీ మళ్లీ నవ్వుతూనే ఉన్నాడు మనిషి తన చావుగురించి ఎప్పుడూ సరదాగా మాట్లాడతాడు తనకు భయం లేదంటాడు కాని మృత్యువు మందహాసం విసరగానే హాలాహలాన్ని మింగేవాడిలా గడగడ లాడుతాడు అంటే, అంతవరకూ తనకు చావు రాదన్న ధైర్యం ధీమాతో ఉంటుంది.

# కన్నీటి గీత

కొంపతీసి తనను ఆనాలుగు వందలూ ఇమ్మంటాడేమోనని ప్రకాశం కొద్దిగా కంగారుపడ్డాడు కూడా

ఆనాటిచర్చ అంతటితో ముగిసింది

ఒకేరకం జీవితాన్ని అనుభవించిన ప్రదేశానికి ఈ కొత్తరకం వ్యక్తుల్ని చూడగానే ఓ రకమైన ఉత్సాహం వచ్చింది ఎదురుగా తుపాకీగుండు వస్తున్నా నిర్లక్ష్యంగా మాట్లాడే రామయ్య అతనన్న ప్రతి మాటకూ, వాక్యానికీ తాళంవేస్తున్న భార్య అపరాధపరిశోధకుడిలా చూపులో ప్రతికదలికను గమనించే గోపి

మరో అర గంటలో అంతా మరచి అతను నిద్దర్లో మునిగిపోయాడు

*   *   *

మర్నాడుదయం నిద్ర లేచేసరికి చీకటి రాజ్యం చేస్తూనే ఉంది కిటికీలోంచి చల్లటి గాలి రాగానే మనసు కదుటబడి 'ప్రాణం 'హాయి, హాయి'



టీచరు- ఒరే! గోపీ! లాలాజలముయొక్క ఉపయోగ మేమిటా?

గోపీ -కవర్లమీద స్టాంపులు అంటించుకొనుటకు, పలకలు తుడుచుకొనుటకు, కాగితములు లెక్కపెట్టుటకు ఉపయోగించును సార్

నిమ్మగడ్డ లలిత ప్రసాద్ (విజయవాడ)



అంది భయంకర నిశ్శబ్దాన్ని చీల్చుకుని 'మేలుకో! మేలుకో! మేలుకో శ్రీరంగ మేలుకోవయ్యా!' అన్న పాట గాలిలో తేలిపోయింది తెల్లవారకుండానే రేడియో సంగీతం వస్తున్నందుకు ఆశ్చర్యపోతూ అరుగుమీదికి వచ్చాడు అతనికి పొరపాటు అర్థమైంది ముగ్గులు పెడుతూ పాడుతూన్న ఓ అమ్మాయి కనబడింది మసకచీకట్లో ఆమె ముఖం సరిగ్గా కనబడలేదు పాడుగాటి జెడ మాత్రం ఒకటి రెండు సార్లు అటూ కదలిన ట్టయింది పాటలో మాధుర్యం ఉండేందుకు చక్కటి గొంతు ఉంటే చాలదు భావాల హెచ్చు తగ్గులు, తృప్తి, ఆనందం ఉండాలి

'ఈ అమ్మాయి కీ లక్షణాలన్నీ ఉన్నాయి కామోలు! అందుకే తేనెచిలుకులా పాడగలుగుతోంది' అనుకున్నాడు ప్రకాశం అతను కూడా ఎన్నోసార్లు గొంతెత్తి పాడా లనుకున్నాడు కాని మనోవ్యథ, అకారణంగా జనించే విరక్తులు ఆ కంఠాన్ని నొక్కివేశాయి

పాట ఆగిపోయింది

ఆ అమ్మాయి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఇంట్లోకి పోయింది ఇంటిముందు తామరపువ్వు తెల్లగా విరిసి నవ్వింది

ఆమె రాధ కావచ్చు ' అనుకున్నాడు మరో అరగంటలో అంతా మరచి నిద్దర్లో మునిగి పోయాడు

కళ్లు తెరిచేసరికి ఏడున్నరైంది మొహం కడుక్కుని, సబ్బు, తువ్వాలు తీసుకుని నూతివైపు వెళ్లేసరికి ఆ అమ్మాయి ఎదురైంది ప్రకాశం పరస్త్రీ వంక చూడడు ఎందుకో తన్ను తాను మరచి ఒక్కనిమిషం, బిందెనిండా నీరు నింపుకొని నడచివస్తున్న ఆమెకేసి చూస్తున్నాడు

నిశ్చలంగా ఉన్న నీటిని కెలికివేసినట్టు అతని కేసి చిత్రంగా చూసింది ఆమె ప్రకాశం ఆలో చిస్తూ నిలబడ్డాడు

'ఇంతసేపూ మీరు అదేపనిగా చూస్తూ నిలబడ్డ మా అక్కయ్య ప్రస్తుతం అక్కడ లేదు మీరు పొరబడుతున్నారు' అని గోపి మేల్కొలిపాడు

ప్రకాశం అర్థంలేని ఆలోచనలకు స్వస్తిచెప్పి స్నానం ముగించి స్కూలుకు బయలుదేరాడు అతనికి ఉపాధ్యాయుడిగా అనుభవం లేదు పాఠాన్ని ఎలా మొదలుపెట్టాలో, ఎలా ముగించాలో తెలియదు ఏదో చెప్పుకుపోయాడు కొందరు పకపక నవ్వారు కొందరు నిలబడి ఏవేవో ప్రశ్నలు వేశారు కొందరు బల్లలమీద మద్దెల వాయించారు అతను పీరియడయ్యాక బయటకు వెడుతుంటే 'బూచి! బూచి!' అనరిచారు అందరూ కలిసి అతనికి సరిగ్గా అర్థం కాకపోయినా, తనకూ 'బూచి' కి ఏదో బంధుత్వం ఉందని మాత్రం వూహించుకున్నాడు

తుఫానులోంచి బయటపడి ఎలాగో సాయంత్రం గది చేరుకొన్నాడు ఇంట్లో ఎవరో ఏడుస్తున్నారు ప్రకాశం శ్రద్ధతో విన్నాడు

'ఆ వెధవ లందరూ ఏదో అంటారు—ఏదో చేస్తారు వాళ్లకు గౌరవాభిమానాలు లేవు సిగ్గుబిడియాలు అసలు లేవు నువ్వుకూడా అన్నీ వదలుకున్నావా? అందుకని నువ్వుకూడా ఆయన్ని ఆక్షేపిస్తావా? చేసింది చాలక సిగ్గులేక నాతో గొప్పలు చెప్పుకుంటున్నావా?'

రాధ అరుస్తోంది మరో రెండు దెబ్బలు పడ్డ చప్పుడు గోపి ఏడుస్తున్నాడు ప్రకాశానికి ఆద్యంతాలు అర్థంకాలేదు బట్టలు మార్చుకుని కిటికీదగ్గర కూర్చుని ఆలోచనలు సాగించాడు ఆనాటి అనుభవం అతన్ని మరింత పిరికిపందగా చేసింది స్కూలు పేరెత్తితేనే జడుసుకునే స్థితిని చేరుకున్నాడు ఈ జీవితం ఒక్క రోజులో అసంతృప్తిని రెచ్చగొట్టింది వెళ్లిపోదా మనుకున్నాడు కాని ఎక్కడికి? ఉష దగ్గరకు, మావయ్య దగ్గరకు

'నాకు ముందే తెలుసు నువ్వు అరగంట కూడా అక్కడ ఉండలేవని ' అని ఉష మొదలెడుతుంది

'వాడికీ, నాకూ ఉద్యోగ మేమిటి? తిని తిరగటం బాగా అలవాటైంది' అంటాడు మావయ్య. ఇదంతా తను వింటూ కూర్చోవాలి

ఎటూ తెగని సమస్యలు ఉచ్చులా బిగించి వేశాయి

'మేష్టారూ !'

ప్రకాశం ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు గోపి గడపదగ్గర నిలబడున్నాడు కళ్ళు ఎర్రగా ఉన్నాయి బుగ్గలమీద నీటి చారలు

'నన్ను క్షమించండి !' అన్నాడు

'ఎందుకు ? నువ్వు ఏం నేరం చేశావ్ ?' అనడిగాడు ప్రకాశం

గోపి రెండు నిమిషాలు మాట్లాడలేదు

'మిమ్మల్ని బూచి అని క్లాసులో పిలిచినందుకు, అందరూ అంటుంటే ముందు వెనుకలు చూసుకోక నేనూ తొందరపడ్డాను అక్కయ్య అందుకే శిక్షించింది మీరు మన్నించానని చెప్పేదాకా అక్కయ్య అన్నం పెట్టదు' అతనిలో కొంటెతనం ఏ కోశానా లేదు

ప్రకాశం నవ్వుతూ అతని భుజం తట్టాడు

'మరేం ఫర్వాలేదు చేసిన తప్పు తెలుసుకున్నావు ఇంక బాధపడకు మీ అక్కయ్యతో నేను చెప్తానులే'

అతని వాక్యం ముగిసేలోగా రాధ బయటికొచ్చి అరుగుమీద నిలబడింది గోపిని దండించవద్దని ఏమేమో చెబుదామనుకున్న ప్రకాశం నోట మాటరాలేదు ఆమెను చూస్తూ ఉండిపోయాడు

పొద్దున్న రాధను సరిగ్గా గమనించనే లేదు 'ఎవరో స్త్రీ' అని మాత్రం అర్థం చేసుకున్నాడు పొడుగ్గా, ఠీవిగా ఉన్న రాధ మనసులో కలకలాన్ని కలిగించింది చీకటిని తరిమికొడుతున్న పొడుగాటి కళ్ళు— వెన్నెల్ని పొదరుగా అద్దుకున్న బుగ్గలు— గూర్ఖావాడిలా కాపలాకాసే పొడుగాటి జెడ— అనురాగాన్ని, ఆదేశాన్ని మేళవించి బోధించే చిరునవ్వు, పువ్వుల రవిక—గులాబీరంగు చీరలోంచి తెల్లటి దారం వంకరగా పరుగెత్తుంది

'అన్నింటికంటె ఆ కళ్ళూ, వాటిలో ఏదో మహత్తర శక్తి, ఆదేశాన్ని చెప్పకుండా అందజేసే శక్తి' అనుకున్నాడు ప్రకాశం

'మేష్టారూ ! చెప్పండి అదుగో అక్కయ్య! లేకపోతే రాత్రంతా ఆకల్తో మాడిపోతాను కావాలంటే లెంపలు వేసుకుంటా' అన్నాడు గోపి

'ఇదుగో ! మీ తమ్ముణ్ణి ఏమీ అనకండి రాత్రి ఏడు కావస్తోంది అన్నం పెట్టండి' అన్నాడు జంకుతూ

రాధ అతనికేసి చూసింది

'మీ సలహా ఏం బాగాలేదు తప్పు చేసినప్పుడు శిక్ష అనుభవించి తీరాల్సిందే పశ్చాత్తాపపడితే అది మాసిపోతుందని నే ననుకోను ఎందుకంటే శిక్ష అనుభవించేదానికన్న పశ్చాత్తాపపడటం చాలా తేలిక మనిషన్నవాడు శ్రమలేని పనే చేస్తాడు అదతని సహజతత్వం'

ప్రకాశం గుడ్లప్పగించి చూశాడు వంటలు చేసే రామయ్య కూతురని నమ్మలేకపోయాడు

'పోనీ, తమ్ముడిమీదుండే ప్రేమతో అతన్ని క్షమించి వదిలేయండి' అన్నాడు ఏదో అనాలి కదాని

'ప్రేమకు అవధంటూ ఉంది మీ రూరుకోండి వాడి సంగతి మీకు తెలియదు వారం రోజులు అన్నం పెట్టకుండా ఉంటేకాని దారిలోకి రాడు' అంటూ అతని చెవి పట్టుకుని ఈడ్చుకుపోయింది

ప్రకాశానికి ఓవంక కోపం, మరోవంక తలవంపు తను ఇంతగా మెట్టు దిగినా ఆమె బెట్టు సరి చేసింది చెట్టుకొమ్మెక్కి కూర్చుంది కొమ్మమీది కోయిల తిన్నగా పాడినా వినకూడదు చెవులు మూసుకోవాలి తన గదిలోకి పోయి తలుపులు వేసుకున్నాడు

మరో అరగంటకు నిద్ర పట్టేసింది

* * *

భయంతో తెల్లారింది ప్రకాశం అద్దంలో మొహం చూసుకున్నాడు గెడ్డం బాగా పెరిగింది దువ్వెనకు వంగని జుత్తు చిత్రంగా మెలికలు తిరిగి అతన్ని 'అడవి మనిషి' గా మార్చివేసింది రేజరు తీసి మళ్ళీ యథాస్థానంలో పెట్టేశాడు అతని కిదంతా అనవసర మనిపించింది ఎక్కడో దాగిఉన్న నిరాశ, నిస్పృహ మళ్ళీ తలెత్తాయి ఎక్కడికైనా పారిపోదా మనిపించింది నాలుగు చేదల నీళ్ళు పోసుకుని స్కూలుకు బయలుదేరాడు దారి పొడుగునా అతన్ని చూసిన విద్యార్థులు ఏవో గుసగుసలాడుకున్నారు

ఆరోజు తిరుగుబాటు మరీ తీవ్రతరమైంది 'బూచీ'ల శబ్దంతో గదంతా నిండిపోయింది గోపి మాత్రం నోరు మెదపకుండా కూర్చున్నాడు తతిమా ఉపాధ్యాయులు అతని కేవేవో సలహాలిచ్చారు



ప్రకాశం విరక్తిగా సాయంత్రం ఇల్లు చేరుకున్నాడు

'అవునక్కయ్యా ! అందరూ కలిసి, పాపం, ఆయన్ని ఏడిపిస్తున్నారు జాలిగా క్లాసుకేసి చూస్తారు గట్టిగా నాలుగు కేకలైనా వెయ్యరు రేపు గోడలమీద, బోర్డులమీద ఏవేవో బొమ్మలు గీసి ఆయన్ని గురించి ఏమేమో రాస్తారట

గోపి చెప్పుకుపోయాడు

'అవును మరి ఏడిపించక ఏంచేస్తారు ? ఇలా వెర్రివెంగళాయుడిలా వాళ్లముందు నిలబడమని ఎవరన్నారు ? అల్లరి చేస్తున్న నలుగుర్ని పట్టుకుని నాలుగు వడ్డించమను—రోగం కుదురుతుంది గడగడలాడుతూ పాఠం వింటారు మిమ్మల్నందరినీ కాళ్లకింద తొక్కి ఉంచాలి'

ప్రకాశం అరుగుమీదే నిలబడి ఆమె మాటలు శ్రద్ధతో విన్నాడు

'అంతేకాదు సబ్జక్టు బాగా తెలిసినా బోధించటం తెలియాలి అందుకే పాఠం ఎలా ప్రారంభించాలి, ఎలా ముగించాలి, అర్థమైంది, లేనిది కనుక్కోటం ఎలా—ఇవన్నీ ముందే ఆలోచించుకుని ఓ ప్లాను తయారు చేసుకోవాలి అంతేకాని నోటికి వచ్చిందల్లా వాగితే అంతేమరి'

గది తాళంతీసి లోపలి కొచ్చాడు బట్టలు మార్చుకుని మొహం కడుక్కోవాలన్న ఆలోచన లేనేలేదు రాధ మాటల్ని పదేపదే మననం చేసుకున్నాడు అందులో ఉండే నిజానిజాల్ని త్రాసుతో వేసి తూచాడు జీవితం సుఖవంతం కావాలంటే ఓ నిశ్చితమైన పథకం వేసుకోవాలంటుంది రాధ అతను గత ఏడాదిలో చేసిన అయిదారు ఉద్యోగాలు వాటిలోఉండే మంచి చెడ్డలు జ్ఞప్తికొచ్చాయి తన కెంత తోస్తే అంతేకాని, ఎదుటివాడి ఆలోచనలు, అభిప్రాయాలు తను గమనించలేదు రాధ దీపం వెలిగించింది కాంతి తక్కువ వున్నా చీకటిని కొద్దిగా ఎదుర్కొంది ఆ అమ్మాయికి అన్నీ తెలుసుగామోలు ! పూర్తిగా అన్నీ అడిగి తెలుసుకుందామని గబగబా బయటికి వచ్చాడు

'ఏమండి ? ' అని పిలిచాడు

రాధ, ఆమె వెనుక గోపి వచ్చారు

'ఏంకావాలండి ? ' అన్నాడు గోపి

ప్రకాశానికి గతుక్కుమంది ఏమైనా తను ఉపాధ్యాయుడు తనకు ఆత్మగౌరవం, విద్యార్థుల మీద ఆధిక్యత అన్నీ ఉన్నాయి మెట్రిక్ కూడా చదవని ఓ అమ్మాయిని తను సలహా అడగటమా? గోపి ఏమనుకుంటాడు ?

'మరేం లేదు కలం ఉంటే ఓసారిస్తావని' అన్నాడు

'ఆయన జేబులో కనిపిస్తున్నది కలం కాదా ?' అనడిగింది రాధ

ప్రకాశం సిగ్గుపడ్డాడు వెకిలిగా నవ్వుకుంటూ తన గదిలోకి వచ్చి కూర్చున్నాడు అతన్నెవరో బంధించి, గొలుసులతో కట్టేసి, స్వేచ్ఛను అపహరించినట్టనిపించింది మాట్లాడేముందు జాగ్రత్తపడవలసి వస్తోంది ముఖ్యంగా రాధ చూపుల్ని ఎదుర్కోవటం తేలిగ్గా జరిగేపని కాదు

ఆరాత్రి ఇంగ్లీషు పుస్తకం ముందుంచుకొని, నోట్సు తయారుచేయసాగాడు ఆ గదినిండా పిల్లలున్నట్టు, తను పాఠం బోధిస్తున్నట్టు మనసులో రిహార్సలు చేసుకున్నాడు

'అబ్బ ! రోజూ కథలు చెప్పమని చంపుకు తింటారు ఎలా చెప్పేది ? ఎంతమంది రాజుల్ని, రాణుల్ని సృష్టించేది ?'

ప్రకాశం అరుగుమీదున్న రాధను చూశాడు గదిలోఉన్న లాంతరు వెలుతురులో ఆమె చెంప మాత్రం కనిపిస్తోంది చుట్టూ అయిదారుగురు పిల్లలున్నారు కథ చెప్పితీరాల్సిందని పట్టుపట్టారు

'ఇదే ఆఖరు కథ—మరి నన్ను చంపుకుతినకండి అనగనగా ఓరాజు అతను వట్టి అమాయకుడు తెల్లనవన్నీ పాలనీ, నల్లనవన్నీ నీళ్లని అనుకునే రకం. ఎప్పుడూ దిగులుగా ఉంటాడు గెడ్డం గీసుకోడు బట్టలు సరిగ్గా వేసుకోడు తల దువ్వుకోడు'

'అదేవిటక్కయ్యా ? ఆరోజుల్లో రాజులకు గిరజాల జుత్తు ఉండేదిగదా ! ఎందుకు దువ్వుకోటం? అని అడ్డు తగిలాడు గోపి రాధ అతన్ని వినిపించుకోలేదు

'అతన్ని ప్రజలందరూ ఏడిపించేవారు అది తల్చుకుని మనసులో కుమిలిపోయేవాడు అలా కొంతకాలానికి చిక్కి సగమైపోయాడు'

పిల్లలెవరికీ ఈ కథ నచ్చలేదు రాక్షసుడు, జిత్తులమారి నక్క, మాంత్రికుడు వగైరా లేని








# కన్నీటి గీత

ఇందులో ఉన్నట్టు లేవు ఒకరి ... ఒకరు చూసుకోడం, గుసగుసలు

'అలాంటప్పుడు ఆ రాజు సుఖంగా ఉండాలంటే ఏంచేయాలి ?' అనడిగింది రాధ ఎవరికి తోచిన సమాధానాలు వారు చెప్పారు

'గెడ్డం గీసుకోవాలి అది గుచ్చుకుని బాధ పెట్టడంవల్లనే అతను సుఖంగా లేడు' అంది వో బుల్లి అమ్మాయి

'కొరడా తీసుకొని రెండేసు అంటించాలి' అన్నాడు గోపి

'రైట్—అంతే ? మర్యాదగా వుండనివారి కదే మందు "

ఉన్నట్టుండి గోపి గడప దగ్గరకు వచ్చి 'మేష్టారూ ! వో కథ చెప్పరూ ?' అనడిగాడు తతిమ్మా పిల్లలు అప్పుడే గదిలో టిష్టవేసి కథ కోసం చెవుల్ని సిద్ధంగా ఉండమన్నారు

ప్రకాశం పంచతంత్రంలో కథలు మొదలు పెట్టాడు రాధ లోపలికి వెళ్లిపోయింది గొలుసు కట్టులా అంతు, దరీ లేకుండా సాగిపోతున్న ఆ కథాప్రవాహాన్ని ఎక్కడ ఆపుచేయాలో తెలియక 'అయిపోయింది' అన్నాడు అసంతృప్తిగా అందరూ గోల చేశారు నయానా, భయానా చెప్పి చూశాడు ఎవరూ వినిపించుకోలేదు ఈ గందరగోళం విని రాధ బయటకు వచ్చింది గోపి పరిస్థితి వివరించాడు

'ఒరేయ్ ! తొమ్మిది కావస్తోంది అందరూ ఇళ్లకు పొండి రేపు చూసుకుందాం' అంది రాధ!

మాట వినపడలేదు అందరూ నిష్క్రమించారు పది నిముషాలు పోరాడినా కదలని గుంపు ఒక్క వాక్యంలో చెల్లాచెదరైంది ఇంతకూ రాధ కోప్పడలేదు కూడా గంభీరంగా అంది

ప్రకాశం ఈమారు రాధ కేసి ధైర్యంగా చూశాడు

కళ్లు అందంగా ఉన్నా, అధికారాన్ని, ఆక్రమణ శక్తిని చూపించాయి ఆమె మాటల్లో, చేతల్లో, చూపుల్లో—సూక్ష్మంగా ఆమె చేసే ప్రతి పనిలోనూ ఏదో ఆకర్షణ కనిపించి ఆదేశించింది

రాధ చెప్పిన రాజుకథను తిరగతోడుకుంటూ పడుకున్నాడు ఇదివరకటికి మల్లే అన్నీ మరచి సుఖనిద్రను వరించలేకపోయాడు ఒంటిగంట దాకా రాధ తన జీవితాన్ని ఎలా సరిదిద్దగలుగుతుందని ఆలోచించాడు

మర్నాడు ప్రకాశం హుషారుగా స్కూలుకు వెళ్లాడు పిల్లలు అతని కళ్లల్లో వెలుగును గమనించకపోలేదు వోడిపోతామేమోనన్న భయంలో 'ఇవేళ బూచి మహదానందంతో ఎగిరి గంతు లేస్తున్నాడు ! అన్నాడు నాయకుడు ప్రకాశానికి రాధ పరోక్షంగా విసిరిన సలహా జ్ఞప్తికొచ్చింది అంతేకాదు ఆమె సలహాను ఆచరణలో ఉంచటానికి అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు ప్రకాశం నాయకుణ్ణి చిత్తం వచ్చినట్టు హింసించాడు చెవులు పిండాడు వీపుమీద గుద్దాడు మొట్టికాయల వర్షం కురిపించాడు తన్ను అడిగే

వాళ్ళు ఎవరికీ లేదని సవాలు విసిరాడు ఉప్పు లేని కూరలా చప్పగా ఉండే ప్రకాశం ఒక్క సారి సింహంలా విజృంభించి అందర్నీ గడగడ లాడించేశాడు

'బూచీ నిజంగా బూచీ అయిపోయాడు' అనుకున్నా రందరూ

మిగిలిన పది నిముషాల్లో రాత్రంతా కూర్చుని వేసుకున్న పథకం ప్రకారం పాఠం బోధించాడు అతని వేషం విజ్ఞానాన్ని దాచలేదు 'ప్రకాశం మేష్టారు గొప్పగా ఇంగ్లీషు చెప్తా' రన్న వార్త మరుక్షణం స్కూలంతా పాకిపోయింది

'రాధ అభిప్రాయం సరైంది మంచి మాటల్తో మనవిచేస్తే వినే మనస్తత్వం పిల్లల కింకా అలవడలేదు మెదడు బాగా పక్వానికి వచ్చాక కాని ఆ స్థితికి రారు అందుకే దండన ఈ వయసులో అవసరం' అనుకున్నాడు

విజయగర్వంతో గదికి తిరిగి వచ్చేసరికి తలుపులు తెరచి ఉన్నాయి తాళంచెవులు జేబులో ఉన్నాయి కంగారుగా లోపల అడుగు పెట్టే సరికి ఆశ్చర్యం అతన్నెదుర్కొంది చిందరవందరగా పడిఉన్న పుస్తకాలు—వోమూల దువ్వెన, మరో మూల బట్టలమూట, చింపిన కాగితం ముక్కలు, క్రమశిక్షణను ధిక్కరిస్తూ గదిలో వస్తువులన్నీ సత్యాగ్రహం చేశాయి ఉదయం అతను వెళ్లినప్పుడు గది స్వరూపం అలా ఉంటే తిరిగి వచ్చేసరికి అందుకు విరుద్ధంగా ఉంది పుస్తకాలన్నీ టేబులుమీద చక్కగా అమరి కూర్చున్నాయి గదంతా కడిగి శుభ్రం చేయబడింది బట్టల మూట కనబడనేలేదు

'తమాషాగా ఉంది కదండి ? అక్కయ్యే అంతా శుభ్రం చేసింది'' అన్నాడు గోపి

'అలాగా ! ఆమెకు నా కృతజ్ఞత కాని గోపి ! తాళం చెవులు నాదగ్గ రుండగా గది తలుపు లెలా తెరుచుకున్నాయి ?'

'మీరు తలుపులు బార్లా తెరచివుంచి వెళ్లారండి మతిమరుపు పనికిరా దంది అక్కయ్య గదిని శుభ్రంగా ఉంచుకుంటేనే మనం ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటాం పెంటకుప్పలా ఉంటే మన మనస్తత్వం కూడా అలాగే ఉంటుంది మనిషి మంచిగానూ, చెడుగానూ ఉండటానికి అతను ఉండే చోటు కూడా చక్కగా ఉండాలి చెడుగా ఉండాలి ఇవన్నీ నా మాటలుకావు సుమండి అక్కయ్య బోధించింది'

'ఎవరికి ? ఆ బోధన నీక్కాదు నాకోసం' అందామనుకున్నాడు ప్రకాశం

ఆ తరువాతి నెల రోజుల్లో ప్రకాశం ఎన్నో మార్పుల్ని చూశాడు అతను చేసే ప్రతి తప్పునూ రాధ పరోక్షంగా ఎత్తి చూపేది సరిదిద్దుకోమనేది ఒక్కోసారి, తన స్వంతవిషయాల్లో జోక్యం వద్దని హెచ్చరిద్దా మనుకునేవాడు ఆమెను చూడగానే మాటలు మంచులా కరిగిపోయేవి రామయ్య తీరిక దొరికినప్పుడల్లా వూహాలోకంలో మెదిలే తన హోటలు గురించి మాట్లాడేవాడు రాధ తల్లి అతని వెనక నిలబడి ప్రతి మాటకు 'వూ' కొట్టేది

ప్రకాశం చిత్రమైన మనుష్యుల మధ్య పడ్డాడు కదలికలేక నిర్జీవంగా పడివున్న అతని మనసు చటుక్కున మేల్కొని చురుగ్గా పని చేయ నారంభించింది పట్నంలో మనుష్యులందరూ స్థూలంగా ఒకేరకంగా కనిపిస్తారు వారి అభిప్రాయాలు, అభిలాషలు, పరస్పరానురాగాలు— అన్నీ ఒకేవిధంగా ఉండి జీవించటానికి చోటు లేకుండా చేస్తాయి తప్పును ఒప్పుగా తియ్యటి మాటల్తో బోధించి నమ్మిస్తారు ఇక్కడి మనుష్యులలాకాదు గెడ్డం గీసుకోని ప్రకాశం కనపడగానే "బాబీ" అన్నారు పరాయిమగాడని కూడా గమనించక రాధల్లాంటి వ్యక్తులు పొరపాట్ను చూపి సరిదిద్దుకోమంటారు అతనిలో ఎక్కడ లేని ఉత్సాహం పొంగుకొచ్చింది

ఉన్నట్టుండి రాధ తల్లి కనపడటం మానేసింది రెండురోజులు పోయాక రామయ్య నడిగాడు

"దానికి నాలుగైదు రోజులుగా వంట్లో బాగా లేదు. ఒకటే జ్వరం, దగ్గు'

'డాక్టరుకు చూపించారా ? ఏమన్నాడు ?'

రామయ్య ఏదో గొప్ప హాస్యాన్ని కనుక్కున్నట్టు విరగబడి నవ్వాడు

'డాక్టరు వూరికే వస్తాడటండి ? వచ్చి పరీక్ష చెయ్యటానికి ఐదు రూపాయలు అది ఏ రోగమో నిర్ణయించే ముందుగానే రెండు ఇంజక్షన్లు, అందుకు పది రూపాయలు, ఆపైన మందులు, ఏవేవో అర్థంకాని పేర్లు లేని రోగాన్ని కూడా ఈ అద్భుతమైన మందులతో రప్పించి పెద్ద డాక్టరు దగ్గరకు వెళ్ల అంటారు అందుకని ఆచారిగారి వైకుంఠ మాత్రలు మింగమన్నాను" అని మళ్లీ నవ్వసాగాడు

రాధ పిలవగానే రామయ్య వెళ్లిపోయాడు

సంభాషణ అంతటితో ఆగిపోయింది

ఆమర్నాడు ఆమె కెక్కువైందని గగ్గోలు పడ్డారు నలుగురూ చీవాట్లు వేయగా, రామయ్య డాక్టర్ని తీసుకువచ్చాడు ఇన్నాళ్లూ వూరుకున్నందుకు అక్షింతలు వేసి, ప్రాణాపాయం లేదని అభయహస్త మిచ్చాడు

రామయ్య నా గదిలో వచ్చి కూర్చున్నాడు

'అదింక బతకదనే నా అభిప్రాయం !' అన్నాడు

నేను మౌనంగా ఉన్నాను

'ఇలా బాధలుపడుతూ బతికేకంటే చావే మెరుగు ఒక్క లోటు మాత్రం ఉండి పోయింది రాధ పెళ్లి దాని కళ్లారా చూడలేక పోతోంది వన్నడిగితే ఆ మనోవ్యథ దాన్ని క్రుంగదీసి ప్రాణాన్ని బలిగా కోరుతోంది నా హోటలు కలలో మాత్రమే నిజమైంది చిన్నప్పుడు చదువుకోనందుకు అనుభవిస్తున్నా నా మూలంగా దాని కేలాంటి సుఖమూ లేదు వంటలుచేసే నన్ను— కావిగుడ్డలు కట్టుకుని సన్యాసిలా తిరిగే నన్ను అది అసహ్యించుకోలేదు పళ్లెత్తుమాటైనా అనదు నేనే అప్రయోజకుణ్ణి—అప్రయోజకుణ్ణి'

రామయ్య చిన్న పిల్లాడిలా వెక్కివెక్కి ఏడ్చాడు

ప్రకాశం గుండె కరిగిపోయింది

'నేను హో సలహా చెప్తాను వింటారా ?' అనడిగాడు

# కన్నీటి గీత

రామయ్య ఏమిటన్నట్టు చూశాడు

'హోటలు మొదలెట్టటానికి మీకు నాలుగు వందలేగా కావల్సింది ? ఆ సొమ్ము నే నిస్తాను మీ ఆవిడ మనస్సు శాంతిస్తుంది అనారోగ్యంనుండి కోలుకుంటుంది కూడా ఈ సాయంత్రం బండికే వెడతాను'

రామయ్య చేతులెత్తి నమస్కరించబోతుంటే ప్రకాశం వారించాడు

ప్రకాశం కాకినాడ చేరుకునేసరికి రాత్రి తొమ్మిదయింది మావయ్య ఏదో పనిమీద వెళ్లాడు మర్నాడుకాని రాడు

---

ఆమెకు పోస్టులో ఒక ఉత్తరం వచ్చింది కవరుచించి హాడావిడిగా దగ్గరలో వున్న మందులషాపు వ్యక్తికి ఆ వుత్తరా న్నిచ్చి చదవమంది అతడు కొంతవరకు చదివి హఠాత్తు దాన్ని మడిచి ఆమె చేతికిచ్చేశాడు "ఇదేమిటమ్మా! మీ భర్తగారు మీకు రాసిన ఉత్తరాన్ని నాకిచ్చారు." "అందుకేనండి, మావారు డాక్టరు ఆయన దస్తూరి నేనెంత మాత్రం చదవలేను ఫరవాలేదు, మీరు చదివి ఏం రాశారో చెప్పండి" అందామె.

ఫరదౌసి (భీమవరం)

---

'బావా ! పూర్తిగా మారిపోయావు సుమా ! ఇదివరకటిమల్లే నీ నవ్వులో ఏడుపు లేదు చూపుల్లో బాధ లేదు ఉంగరాల క్రాపింగు, టిప్‌టాప్‌గా దుస్తులు భలే ! భలే !' అని చప్పట్లు చరిచింది ఉష

ప్రకాశం తృప్తిగా నవ్వాడు

'కొంపతీసి ఏ అమ్మాయినైనా ప్రేమించావా ఏమిటి ?' అనేసి విరగబడి నవ్వింది

'అలా ఎందుకనుకోవాలి ఉషా ?'

'ఎందుకనా ? మగవాణ్ణి మార్చే శక్తి ఒక్క ఆడదానికే ఉంది ఆమెకోసం అతను ఏమైనా చేస్తాడు'

'తప్పు ఉషా ! మనిషిలో మార్పు కలగటానికి ఒక్కటే మూలకారణం ఉంది తనలో ఏదో లోపం ఉందని గుర్తించటం ఆ లోపాన్ని భర్తీచేయటానికి వెంటనే మారిపోతాడు'

'సరే ! వేషం మారింది కాని, వేదాంతం మారలేదు'

ప్రకాశం స్కూలు విషయాలు చెప్పాడు రాధ గురించి చెప్పాలనుకున్నా, ఎలా చెప్పాలో తెలియక వూరుకున్నాడు చివరికి తను వచ్చిన సంగతి వివరించి నాలుగువందలిమ్మ నడిగాడు

'తప్పకుండా తీసికెళ్లు మావయ్య ఏమంటాడో నని భయపడుతున్నా, నేన సర్ది చెప్తాను. తీసికెళ్లు' అంది

ఆ మర్నాడు రామాపురం బయలుదేరుతుంటే ఉష అడిగిన ప్రశ్న జ్ఞాపకాని కొచ్చింది 'కొంపతీసి ఏ అమ్మాయినైనా ప్రేమించావా ఏమిటి ?' అని ఆ ప్రశ్నే బయట నిలబడి తన్ను తానే వేసుకున్నాడు సరైన సమాధానం రాలేదు తన అభిప్రాయాలను అణువులుగా విడదీసి పరిశీలించుకున్నాడు

'రాధంటే నా కెంతో యిష్టం భయం కూడా ఆమెలో అసాధారణ ఆకర్షణ ఏదో ఉంది ఆమెను చూడకుండా ఉండలేను పరోక్షంగానైనా, ఆమె ఇచ్చే సలహాల్ని తప్పకుండా అనుసరిస్తాను ఆమెకు ఐశ్వర్యం ఉన్నది—నాగరికత ఉన్నది—నా కక్కర్లేదు ఇవే ప్రేమకు లక్షణాలైతే నేను ఆమెను ప్రేమిస్తున్నాను' అని నిర్ణయించుకున్నాడు ప్రకాశం

ప్రకాశం రామాపురం చేరుకునేసరికి చీకటి పడుతూవుంది ఉరకలు వేస్తున్న ఉత్సాహంతో అడుగులు ముందుకు పడ్డాయి మనసంతా మళ్ళీ పూలు పూసింది మొదటిసారిగా ఈవూరు వచ్చేటప్పుడు మనసు బరువుగా ఉంటే, ఇప్పుడు గాలిలో తేలిపోయేటంత తేలిగ్గా ఉంది

గది చేరుకునేసరికి ఇంట్లో అలికిడి లేదు లోపల ఎక్కడో వెలుగుతున్న దీపం తాలూకు సన్నటి వెలుతురు మాత్రం కొద్దిగా బయటకు వచ్చి తొంగిచూసింది ఈపాటికి రాధ పిల్లల్ని పోగుచేసి కథలు చెప్పవలసింది గోపి అడ్డు ప్రశ్నలు వేస్తూ ఆమెను విసిగించవలసింది రామయ్య దంపతులు తనతో వె్రిగా ఏవో మాట్లాడవలసింది అటువంటి సమయంలో ఏదో భయంకర నిశ్శబ్దం అంతటా వ్యాపించింది

ప్రకాశం గదిలో దీపం వెలిగించి కూర్చున్నాడు వెలుగు చూసైనా, చీకటిలోంచి ఎవరైనా వస్తారేమోనని ఎదురుచూశాడు పావుగంట అతని సహనం పరీక్షకు గురైంది

'రామయ్యగారూ !' అని పిలిచాడు గుమ్మం దగ్గరకు వెళ్లి జవాబులేదు మరి రెండుసార్లు పిలిచేసరికి వచ్చాడు

'ఏమండి ! ఇంట్లో ఏమూల ఉన్నారు ? మీకోసం ఎంతసేపట్నుంచి పిలుస్తున్నానో తెలుసా' నాలుగు వందలు తీసుకొచ్చాను తీసుకోండి హోటలు వెంటనే ప్రారంభించండి మీ నిశ్చయం నెరవేరాలి ఈమాట ఆవిడ చెవిని వేయండి చాలు ఆమాంతం లేచి కూర్చుంటుంది' అంటూ నాలుగు వందలూ ఆయన చేతిలో ఉంచాడు

'ఆ అదృష్టం నాకు లేదండి అది నిన్న రాత్రి చచ్చిపోయింది '

రామయ్య ఇంటోకి వెడుతుంటే ఎర్రగా ఉన్న కళ్ళు, కారుతున్న నీటి ఛాయలు కనిపించాయి

'ఒక్కరోజులో ఎంత మార్పు' అని ఆశ్చర్యపోయా డతను

* * *

తల్లి పోయినందుకు రాధలో ఎలాంటి మార్పులు కనపడలేదు ఆమె ఎప్పటిలాగే గంభీరంగా నవ్వుతూ, అందర్నీ గదమాయిస్తూ తిరిగేది మధ్య మధ్య ప్రకాశం ఎలా ఉంటున్నదీ కనుక్కునేది ఆ కుటుంబంలో ప్రతి వ్యక్తీ చిత్రంగా కనిపించారు డబ్బు తీసుకున్నా రామయ్య హోటలు ప్రారంభించే సూచనలేవీ కనపడలేదు ఆర్థికంగా ఎవరూ యిబ్బంది పడుతున్నట్లే కనపడలేదు రామయ్య ఏం గడిస్తున్నాడో ఏమో భగవంతుడికే తెలియాలి

ఆ ఉదయం ప్రకాశం స్కూలుకు పెందలాడే వెళ్ళాడు ఇంకో గంటకు కాని పిల్ల లెవరూ రారు ప్రశాంతంగా పోయి కూర్చుందామని క్లాసు గది లోకి వెళ్లేసరికి ఓ కుర్రాడు నల్ల బల్లమీద ఏదో రాస్తున్నాడు నగిషీలు చెక్కడానికి టేబిలుమీద రంగురంగుల సుద్ద లున్నాయి అతను దూరం నుండి చదివాడు అతనికీ రాధకూ లేనిపోని సంబంధాలు అంటగట్టి అందంగా రాస్తున్నాడు కుర్రాడికి పదేళ్లకంటే ఉండవు అతని కింతటి ధైర్యం విజ్ఞానం ఎక్కడనుండి వచ్చాయి ? ప్రకాశానికి వళ్ళు భగభగమండింది రెండు అంగల్లో వెళ్లి చెవి పట్టుకున్నాడు ఆ కుర్రాడు గడగడలాడాడు

'నాకేం తెలియదండీ' అన్నాడు ఏడుస్తూ

'ఇదంతా నిన్నెవరు రాయమన్నారు ?' అని గద్దించాడు

'సైన్సు మేష్టారండి ఆయనో ఈ విషయం చెప్పకండి మీ కాళ్ళమీద పడతాను అనలే ఆయన కోపిష్టి ఈసారి నన్ను తప్పకుండా ఫెయిల్ చేస్తారు '

ప్రకాశం అతన్ని వదిలేశాడు

గబగబ అడుగులు వేస్తూ వెయిటింగ్ రూం చేరుకున్నాడు ఆ కుర్రాణ్ణి దండించి ఏం లాభం ? సంస్కారం ఉండి చదువు చెబుతున్న ఓ మేష్టరు ఇంతటి నీచత్వానికి ఒడిగట్టినప్పుడు పదేళ్ల కుర్రాడు అహంకారానికి తలవంచక ఏంచేస్తాడు ? లోతుగా ఆలోచిస్తే అందులో తన తప్పుకూడా లేకపోలేదు వయసు వచ్చిన అమ్మాయితో చనువుగా ఉంటున్నట్టు నలుగురికీ అభిప్రాయం కలిగించటం అపరాధం కదూ ? రామయ్య అమాయకుడని అందరికీ తెలుసు అందుకని రాధను తేలిగ్గా వలలో వేసుకున్నానని అందరూ అనుకుంటున్నారన్నమాట యుగయుగాలుగా అవినీతిని, అసూయను, జాడ్యాలను వదలగొట్టడానికి ప్రయత్నిస్తూ భగభగ మండుతూన్న అగ్ని శాలూకు ఓ చిన్న కణం రాధ కళ్ళల్లో ఉందని ఆ 'అందరి' కి ఏం తెలుసు ?

ప్రకాశం అలా ఆలోచిస్తూ చాలాసేపు గడిపాడు మూడో గంట కొట్టటం మాత్రం అతని చెవిని పడింది కదలి క్లాసుకు వెళ్ళ అనుకున్నాడు కాని, కాళ్ళు కదలలేదు మనసంతా బరువుగా ఉండిపోయింది నెమ్మదిగా వెళ్లి హెడ్మాష్టరుకు సెలవుచీటీ రాసిచ్చాడు

'మళ్లీ ఏమొచ్చిందయ్యా ? ఇలా వారాని కోరోజు బడి మానేస్తే పిల్లల చదువు సంగతేమిటి ?' అని విసుక్కున్నా డాయన

ప్రకాశం సైన్సు మేష్టారు గురించి చెబుదామనుకున్నాడు కాని ఎలా ప్రారంభించాలో, ఒక వేళ ఎదురు ప్రశ్నలు వస్తే సమాధానం ఎలా చెప్పాలో నిర్ణయించ కోనందున ఆ ప్రయత్నం మానుకున్నాడు

నూరు మాట్లాడక గది చేరుకున్నాడు అతను చేస్తున్న ఏ పనికి ముగింపంటూ కనపడలేదు అసంపూర్తిగా ఉండిపోయాయి ఆ క్షణంలో ఏంచెయ్యాలో తెలిసిందికాదు

రామయ్య వచ్చి కూర్చున్నాడు

'మీరు ఏమీ అనుకోకుండా ఉంటే వో సంగతి చెప్పాలి' అన్నాడు

ఏమిటన్నట్టు చూశాను

'ఈ నాలుగు వందలూ తీసుకోండి' అన్నాడు

'మీరు హోటలు పెట్టరా ?' అన్నాను ఆశ్చర్యపోతూ

---

బిచ్చగాడు - బాబూ! ధర్మం
తల్లితండ్రులు లేరు
పెద్దమనిషి - గుర్తు ఏమిట్రా?
బిచ్చగాడు - నా వేషమేనండి

షేకుఖాజా (నందిగామ)

---

'లేదు ... మరి మరి ఏం లేదనుకోండి' అని నవ్వేసి కంఠస్వరం తగ్గించి చెప్పాడు

'మా రాధ ఉంది చూశారూ ! అది అగ్గిబరాటా! ఆమె మాటను ఇంట్లో ఇంతవరకూ ఎవరూ ధిక్కరించి ఎరుగరు కుటుంబవిషయాలు ఆమెవద్ద నుండి దాచివుంచలేం కూడా మీరు డబ్బిచ్చారని విన్నాక ఎగిరిపడింది తిరిగి ఇచ్చేయమని శాసించింది ఏంచేయను మరి !'

'మరి ఆమె పెళ్లి ఎలా జరుగుతుంది ? యోగిన్నై పోతుందా ?' అన్నాను కసిగా

'ఇల్లు తాకట్టుపెట్టి అప్పు తెమ్మంటోంది'

'అక్కయ్య పిలుస్తోంది' అన్నాడు పరుగెత్తు కొచ్చి గోపి

రామయ్య వెళ్లిపోయాడు

ప్రకాశానికి ఉన్నట్టుండి రాధమీద ఏవిధమైన వెగటు కలిగింది తననుకున్నట్టు ఆమె హృదయం విశాలమైంది కాదు ఏ మూలో సంకుచితత్వం ఉంది మరోమూల అసూయాద్వేషా లున్నాయి సాధారణంగా ప్రతిమనిషిలోనూ ఉండే రాగ ద్వేషాలు ఆమెకూ ఉన్నాయి

రాధ గురించి ఆలోచించటం మానుకున్నాడు గబగబ లేచి గదికి తాళంవేసి స్కూలుకు బయలుదేరాడు స్వేచ్ఛ మళ్లీ తలెత్తసాగింది ఆవూరు విడిచి ఎక్కడికైనా పోవాలన్న కోరిక బలతరం కాసాగింది

హెడ్మాష్టర్ని కలుసుకుని సైన్సు మేష్టారి దురంతాన్ని వర్ణించాడు

ఆయనకు తగిన విధంగా వార్నింగు ఇవ్వాలని కోరాడు

హెడ్మాష్టారు అర్థపూరితంగా నవ్వారు

'చూడు ప్రకాశం ! నువ్వు వయస్సులో చిన్నవాడివి మంచి చెడ్డలు తెలియవు యౌవనం ఉద్రేకం మీద మాత్రమే ఆధారపడి ఉంటుంది సైన్సు మేష్టారు చేసిన పని తప్పని ఒప్పుకుంటాను ఆయన్ని మందలిస్తాను కూడా బోర్డు మీద తప్పుడు రాతలు రాసిన ఆ కుర్రాణ్ణి నా దగ్గరకు పంపు వివరాలు కనుక్కుంటాను కాని అంతకంటె మరో ముఖ్యమైన సంగతుంది నీ గురించి నేను కూడా ఎన్నో వింటున్నా పెద్దవాణ్ణి కనక దాపరికంలేక సూటిగా చెబుతున్నా ఆ రామయ్య కూతురికి, నీకు ఏమిటి సంబంధం ? ఈ ప్రశ్నకు సమాధానంగా రకరకాలైన కథలు, వదంతులు బయలుదేరుతున్నాయి అవన్నీ నిజమని నేననను కాని అందర్ని ఒప్పించగలమా ? వయస్సొచ్చిన ఆడపిల్లలు మన స్కూల్లో చాలమందున్నారు మనస్కూలు పరువుప్రతిష్టలు దెబ్బతింటాయి అందరికి మనం మార్గదర్శకులుగా ఉండాలి అదే మన కర్తవ్యం కనక ఆ గది వెంటనే మార్చేయ్ లేకపోతే నేను నీకు నోటీసు యివ్వవలసి వస్తుంది ఇదంతా నీ మంచికోసం '

ప్రకాశం రెండు నిమిషాలు ఆలోచించాడు

రాజీనామా యిచ్చేసి బయటి కొచ్చేశాడు

అతనిలో ఎలాంటి అనుభూతి లేదు తను త్వరలో తిరిగి వస్తాడని ఉష అన్న మాటలు చెవిలో గింగురుమన్నాయి మళ్లీ దేశదిమ్మరిగా కొంతకాలం తిరిగి, మరో కొత్త ఉద్యోగంలో చేరవలసి వస్తుందని అతనికి బాగా తెలుసు గబగబ అడుగులు వేసుకుంటూ గది చేరుకున్నాడు

అరగంటలో సామానంతా సర్దాడు అనవసరమైన కాగితాలు పెద్ద మూటగా కట్టి మూల ఉంచాడు ఎందుకో ఆ గది వదలి వెళ్లడమంటే అతనికి దిగులుగా ఉంది రాధ కూడా అతని మంచితనాన్ని గుర్తించలేకపోయింది ఆమె భవిష్యత్తు బాగుపడాలని పాటుపడితే అర్థంలేని ఆత్మాభిమానంతో తిరస్కరించింది ఒకవేళ రాధ తనను గ్రహిస్తే తను అన్నీ సహించివుండేవాడేమో ! తన నిర్ణయం సరైందని బుజువు చేసుకోవటానికి ప్రకాశానికి మరో కారణం కూడా కనపడింది మొండిపట్టుగా తను ఆ ఊళ్ళోనే ఉంటే రాధకు మాయని మచ్చ ఏర్పడి బతుకు తెల్లవారుతుంది కనుక ఆమె శ్రేయస్సుకోసం తను వెళ్లితీరాలి

'గోపీ ! మేష్టారు జెండా ఎత్తేస్తున్నారు గాబోలు !'

ప్రకాశం ఉలిక్కిపడి వెనక్కి తిరిగిచూశాడు గుమ్మందగ్గర నిలబడుంది రాధ అత నింతవరకూ గమనించనేలేదు

'అక్కయ్య, నేను పావుగంటనుండి ఇక్కడే

ఉన్నాం మీరు గమనించలేదు వెళ్లిపోతున్నారాండి?' అనడిగాడు గోపి

'అవునోయ్ !' అన్నాడ నిర్లక్ష్యంగా

'ఎందుకండి ? మీకేం కష్టం వచ్చింది ?'

"గోపి ! నువ్వు చిన్నపిల్లవాడివి నీకు చెప్పినా అర్థంకాదు చెప్పకూడదు కూడా చక్కగా చదువుకో బుద్ధిగా ఉండు ఇదే నా ఆఖరు సలహా'

రెండు నిమిషాలు ఎవరూ మాట్లాడలేదు మౌనంగా ఉన్నారు

'పోనీ పెద్దదాన్ని నేనున్నాను నాతో చెప్ప కూడదూ ?'

ప్రకాశం ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు ఏనాడూ లేనిది ఆమె మొహం వాడిపోయింది ముఖాముఖిని ఆమెతో మాట్లాడటం ఇది మూడో సారి గోపి ఏదో పని ఉందని అక్కణ్ణించి వెళ్లి పోయాడు

'చెప్పాలనే ఉంది రాధా ! కాని ఎలా చెప్పాలో తెలియటంలేదు ఇలా వచ్చి కూర్చో' అన్నాడు రాధ లోపలికొచ్చి నిలబడింది

'నేను ఉద్యోగానికి రాజీనామా చేశాను'

ఆమె నమ్మనట్టు కళ్లు చిన్నవి చేసింది

'నిజంగా చెబుతున్నా నేను న్యాయంగా బతుకు దామనుకున్నా ఎవరూ హర్షించలేరు నా మంచి తనాన్ని వాడికత్తిగా చేసి గుండెలో పొడిచారు'

'మీ మాటలు నా కర్థం కాలేదు డొంకతిరు గుళ్లు లేకుండా చెప్పండి మీరు వృథాగా ఏవేవో లేనిపోని కారణాలు కల్పించుకుని బాధపడుతున్నారని మాత్రం నాకు తెలుసు'

# కన్నీటి గీత

ప్రకాశం కొద్దిగా జంకాడు

'మనిద్దర్ని గురించీ అందరూ చెడుగా చెప్పు కుంటున్నారు నీ పేరు నలుగురి నోట్లోనూ పడటం నా కిష్టంలేదు అందుకని నేనే తప్పు కుంటున్నా'

రాధ ఫక్కున నవ్వింది చిన్నపిల్లాడు ముద్దుగా మొదటిసారిగా 'అమ్మా ?' అన్నంత తియ్యగా నవ్వింది

'అలా అందరూ అంటారు ఇందులో కొత్తేముంది నేనూ విన్నాను కాని మీలా పిరికి పందలా జడిసి పారిపోవటంలేదు ధైర్యంగా ఉంటున్నా కనక అన్నీ మర్చి మళ్లీ వెళ్లండి హెడ్మాష్టరు చాలా మంచివారు మీ రాజీనామా ఉపసంహరించుకోండి'

ప్రకాశం మౌనంగా ఉన్నాడు

'ఏం ? ఇంకా మిమ్మల్ని ఎవరు ఏం చేశారు ?'

'నువ్వుకూడా నా అభిమానాన్ని చిన్నచూపు చూశావు'

'తెలుసు మీరు నాన్నగారికి నాలుగు వందలిస్తే తిరిగి ఇచ్చెయ్యమన్నాను అంతేనా ? మరో తోవ ఉన్నప్పుడు యాచించటాని కెందుకు వెళ్లాలి ? ఇల్లూ, వాకిలీ లేదనుకోండి అప్పుడు తప్పదు అంతే కాని మిమ్మల్ని అవమానించేందుకు కాదు'

ఎన్నో అనాలనుకున్నా ఆమెన ఎదిరించలేక పోయాడు

'కాని రాధా ! మళ్లి స్కూలుకు వెళ్లలేను ఇవేళ బోర్డుమీద ఇద్దర్ని గురించి రాశారు రేపు గోడలమీద రాస్తారు ఎల్లుండి నాకు తెలియ కుండా వీపుమీదే రాసి అంటిస్తారు ఈ బా(ధ) నేను పడలేను వద్దు'

రాధ చిన్నగా నవ్వింది

'పోనీ, నన్ను పెళ్లి చేసుకుంటానని అందరిలోను చెప్పండి నోళ్లు మూతలు పడతాయి'

'అలా అంటే మాత్రం ఏం లాభం ? ముందు చేసుకో అంటారు'

'సరే! అయితే చేస కోండి'

ప్రకాశం ఏదో వెర్రిఆవేశంలో ఉక్కిరి బిక్కిరి అయ్యాడు చటుక్కున ఆమె చేతులు రెండూ పట్టుకున్నాడు

'తప్పకుండా నిన్ను చేసుకున్నాక స్కూలు మాష్టారుగా మాత్రం ఉండను చక్కటి ఉద్యోగం చేసి రెండుచేతులా సంపాదిస్తాను నిన్ను మహారాణిలా పూజిస్తాను రేపు ఉదయమే బయలు దేరి మావయ్య దగ్గరకు వెడతాను' రాధ కళ్ల నుండి నీటిధారలు ప్రవహించాయి

* * *

ప్రకాశం వూహించని సంఘటనలు జరిగాయి. మావయ్య దగ్గరకు వచ్చి సంగతి సందర్భాలు వివ రించి పెళ్లికి ఏర్పాట్లు చెయ్యా లనుకున్నాడు కాకినాడ చేరుకున్న మర్నాడే అతనికి జ్వరం వచ్చింది క్రమంగా టైఫాయిడ్‌లోకి దిగింది ఉషతో మాత్రం రాధ గురించి చెప్పాడు అలా నెలరోజులు మనోవ్యథతో గడిపాడు

ఉన్నట్టుండి రాధ దగ్గర్నుండి ఉత్తరం వచ్చింది

'మీకు జ్వరంగా ఉందని తెలిసి చాల బాధ పడుతున్నా ఈపాటికి కోలుకునుంటారని ఆశి స్తున్నా ఇక్కడకు మీరు ప్రస్తుతం రానక్కర లేదు మద్రాసు, బెజవాడ అలా ఎక్కడికైనా వెళ్ళండి మంచి ఉద్యోగం దొరుకుతుంది సెలవు దొరక గానే రండి పెళ్లి చేసుకుందాం ఈ ఉత్తరం ఎవరూ చూడకూడదు మనిద్దరి మధ్య అతి రహస్యం'

ప్రకాశం ఆమెకోసం, ఆమె సలహాను పాటించి తిన్నగా మద్రాసు వెళ్లాడు మొదట్లో ఎక్కడా ఉద్యోగం దొరక్కపోయినా 'రాధకోసం' కాళ్లరిగే టట్టు తిరిగి చివరకు విజయం పొందాడు ఏడాది గడిచాక సెలవులకు బయలుదేరాడు

*          *          *

ఆలోచనలు ఆగిపోయాయి రాధను చూడాలని మనసు ఉరకలు వేస్తోంది ఆమెలో ఎలాంటి మార్పు ఉండదు ఎప్పటికిమల్లే గంభీరంగా నవ్వుతూ ఎదు రవుతుంది ఎక్కడో ఓమూల చిరునవ్వుతో కూడిన సిగ్గు ఉండక తప్పదు ఆనాడు ప్రకాశం ఆమెకు పరాయివాడు జడత్వం చూసి జాలిపడి సరిదిద్దింది ఈనాడు ఆమె కాబోయే భర్త అధికారంతో సరిదిద్దుతుంది

ప్రకాశం కాకినాడ చేరుకునేకసరికి మావయ్య ఇంట్లో ఎవ్వరూ లేరు ఉషతో కలిసి సినిమాకు వెళ్లాడని పనిమనిషి చెప్పింది స్నానంచేసి ఉష గదిలోకి వచ్చాడు దొంతరగా అమర్చబడ్డ పుస్త కాలు అతన్ని ఆకర్షించాయి లావుగా ఉన్న ఏదో పుస్తకాన్ని బయటకు లాగేసరికి ఏవో ఉత్తరాలు కిందకి జారి పడ్డాయి దస్తూరీ చూడగానే రాధ రాసినవని తెలిసిపోయింది ఆశ్చర్యంతో తీసి చది వాడు

'అభిమానం అందరికీ ఉంటుంది ఒక్కొక్క ప్పుడు దాన్ని కాపాడుకోలేకపోతాం ఆనాడు మీర నాలుగువంద లిస్తే వద్దన్నాను ఈనాడు దాని అవసరం వచ్చింది నాన్నగారి కెవరూ అప్పివ్వలేదు 'హోటలు పెట్టితీరాలని ఒంటికాలుమీద తపస్సు చేస్తున్నారు కనుక మీరు ఆ నాలుగు వందలూ పంపండి మా శక్తికొలది కొంచంకొంచెంగా తిరిగి ఇచ్చేస్తాం'

ప్రకాశం కొయ్యబారిపోయాడు రాధ ఇంతగా మారిపోతుందని అతను వూహించలేదు ఏడాది క్రితం వచ్చిన ఆ ఉత్తరం అతను చూడనేలేదు కాదు ఎవరూ చూపలే దతనికి

రెండో ఉత్తరం—

'ఉష అక్కయ్యక నమస్కారం నీ ఉత్తరం అందింది చదువుకుని ఆశ్చర్యపోయాను నువ్వు ప్రకాశంగారిని ప్రేమిస్తున్నావని తెలియదు నాకు తెలిస్తే ఆశ చూపెట్టకపోదును నువ్వు కోరిన ప్రకారం ఇక్కడకు రావద్దని ఆయన కివాళే రేస్తున్నా'

పళ్ళు పటపట కొరికాడు గదిలో పదిసార్లు అటూ యిటూ తిరిగాడు బలంగా బల్ల గుద్దాడు ఉష ఎదురుగా ఉంటే పీక పిసికేసి ఉండేవాడు ఆమె మౌనం అర్థమైంది తన్ను ప్రేమిస్తోందట

ప్రకాశం ఆలస్యం చేయకూడదని సామాను తీసుకుని వెంటనే రామాపురం బయలుదేరాడు. పెట్టెనిండా రాధకు చీరెలు, రవికెగుడ్డలు, టాయిలెట్ సామగ్రి ఉన్నాయి ఉషను మెప్పించ టానికి అలా రాసిఉంటుంది కాని, రాధ తనకోసమే ఎదురుచూస్తోందన్న నమ్మకం అతనిలో స్థిరపడి పోయింది కాని మనసంతా అల్లకల్లోలంగా ఉంది చివరకు రాధ కనపడకపోతే ఏం చేయటం ? అంత వరకూ ఎందుకు ? 'మరో అమ్మాయిని ప్రేమించా వని ఆరోపించి తిరస్కరిస్తే ?

రామాపురం స్టేషను రాగానే దిగి పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ త్వరగా రామయ్య ఇల్లు చేరుకున్నాడు ఇంటో ఎవరూ ఉన్న అలికిడి లేదు రాధను చూడాలని కళ్ళు వెయ్యి కళ్ళుగా మారాయి

కావిగుడ్డలు కట్టుకొని బొద్దుగా ఉండే ఓ వ్యక్తి బైటకు వచ్చేసరికి ప్రకాశం తృప్తి పడ్డాడు మసకచీకట్లో ముఖం సరిగా కనబడక పోయినా ఆకారాన్ని బట్టి అది రామయ్యేనని నిర్ణ యించుకున్నాడు

'ఎవరు కావాలి మీకు ?' అనడిగా డా వ్యక్తి

'రామయ్యగారు ? ' అని సగంలో అనుమా నంతో ఆగిపోయాడు ప్రకాశం

'ఆయన ఈవూరు వదలి ఏడాది కావస్తోంది మీకు ఆయన బంధువులా ?'

అతి కష్టంమీద 'కాదు' అన్నాడు ప్రకాశం



'ఆయన ఎక్కడ ఉన్నారో మీరు చెప్పగలరో ?

'నేనేకాదు ఎవరూ చెప్పలేరు ఎందుచేత నంటారా ? ఎక్కడో అప్పుచేసి నాలుగు వందలు తీసుకొచ్చాడు గొప్పగా హోటలు ప్రారం భించాడు వ్యాపారానికి ప్రతినాయనమ్మ పనికి రాదు అందు క్కావలసిన లక్షణాలు చాలా ఉన్నాయి ఈ బోళామనిషికి, నాకు వ్యాపారమేమిటి ? హోట లంటే ఎంత డాబుసరిగా ఉండాలి? మీరే చెప్పండి ! నాలుగైదు పొడుగాటి బల్లలు, ఈగలు ముసిరే పెట్టెలో తినుబండారాలు, పొగ వాసన కొట్టే కాఫీ, రేడియో లేకపోతే పోయె కనీసం గ్రామ ఫోనయినా ఉండాలా ? సప్లైయరు, సర్వరు అన్నీ అతనే లక్షలు గడించి కూతుర్ని కోటీశ్వరుడి కివ్వా లనుకుంటున్నాడు తండ్రి, కూతురు రాత్రీ, పగలు కష్టపడ్డారు కాని ఫలితం సున్న దివాలా తీసింది ఆ నాలుగు వందలూ తీర్చలేక ఇల్లు అమ్ము కున్నాడు పాపం ! తాతలనాటి ఆస్తి సుమండీ నేను మూడువందల యాభైకి కొన్నాను ఎక్కవే ఖరీదు చేస్తుంది అర్జంటుగా అమ్మాలనుకుంటే మీకు సగం ధర కూడా రాదు పాపం ! ఉన్న ఒక్క ఇల్లు వదులుకుని, ఆ ముగ్గురు చిన్నచిన్న మూటల సామానులతో నడచిపోతుంటే జాలేసింది కాని చేత కాని పనులక దిగితే ఇంతే వసపిట్టలా వాగు తూనే ఉన్నాడు 'మీకు అతను ఏం కావాలి ? . ఏమైనా బాకీ ఉన్నాడా ?'

ప్రకాశం కళ్ళు చెమ్మగిల్లాయి బలవంతాన ఏడుపు దిగమింగుకున్నాడు

'ఆయన కూతురికి పెళ్ళయిందో లేదో తెలుసా ?' అని అర్థంలేని ప్రశ్న వేశాడు

'దాన్నెవరు చేసుకుంటాడండి ? ఇక్కడున్న ప్పుడే ఏవో స్కూలు మేష్టారితో సావాసం ఉండే దట అక్కడ మరోణ్ణి పట్టుకుంటుంది' అంటూ విరగబడి నవ్వసాగాడు

ప్రకాశం అక్కడ నుండి కదిలాడు రాధ అతని కోసం వేచిఉంటుంది కాని ఎక్కడ ? ఆమె ఉనికి కనుక్కోట మెలా ? ఈ చుట్టుపక్కల గ్రామా లన్నీ తిరిగి చూస్తే ? పత్రికల్లో ప్రకటన వేయిస్తే ? అతనికేం అర్థంకాలేదు అసలు రాధ జీవించిఉందో లేదో కూడా అతనికి తెలియదు. కొండంత ఆశతో వస్తే నిరాశ మేఘంలా ఆవ రించి ముంచివేసింది స్టేషను చేరుకున్నాడు

పావు గంటకు రైలు వస్తే ఎక్కి కూర్చు న్నాడు గమ్యస్థానం తెలియదు టిక్కట్టు కొను క్కోలేదు పెట్టె కాళ్ల దగ్గర ఉంచుకున్నాడు రాధను తల్చుకుంటే అతని గుండె ఏవిధమైన గౌరవంతో నిండిపోయింది బతుకుమీద విసు గెత్తి ఉపాధ్యాయుడిగా చేరగానే అందరూ 'బూచి' అన్నారు గడగడ వణికిపోయాడు ఒక్కరోజైనా ఆ పదవిలో ఉండటం దుర్భర మనిపించింది రాధ మొదట్లో గోపి ని శిక్షించింది అవునుమరి వూళ్లో పిల్లలందర్ని ఆమె ఎలా శిక్షించగలుగు తుంది ? 'తప్పు చేసినవాడు శిక్ష అనుభవించి తీరాల్సిందే !' అంటుంది ఉపాధ్యాయుడిగా రాణించ టానికి ఆమె చెప్పిన చిట్కాలు అతన్ని గాలి వానకు కదలకుండా నిలబెట్టాయి మగవాడై ఉండీ అల్లరిమూకను గదమాయించలేక సతమత మవుతుంటే, ఒక్క చూపులో తరిమేసింది. గదిని, వస్తువుల్ని శుభ్రంచేసి చూపించింది విసు గెత్తి పారిపోతున్న తనకు ధైర్యం చెప్పింది

అదీ రాధ దూరంగా ఉన్నా హృదయంలోనే కాపురం పరోక్షంగా మాట్లాడినా మనస్సుతోనే ఐక్యం అలాంటి రాధను మర్చిపోయి జీవించటం ఎలా ? ఆమె లేకపోతే తను యథాప్రకాంగార మారిపోతాడు ఆమెకోసం వెతికితీరాలి ఏదో ఒక నాడు కనుపించక మానదు ప్రకాశం ఏ నిర్ణ యానికి వచ్చాడు

ఏదో జంక్షన్‌లో బండి ఆగింది ఆకలిగా ఉంటే కాంటీన్‌వైపు బయలుదేరాడు

'నాన్నా ! ఎందు కంత కంగారు పడతావ్ ? బండి అరగంట ఆగుతుంది'

ప్రకాశం ఆగాడు ఆమెకేసి చూశాడు ముందుగా నడిచిపోతున్న వ్యక్తికేసి చూశాడు గట్టిగా పిలుద్దా మనుకుని చటుక్కున ఆగాడు. రామయ్య, రాధ చరచర ముందుకు సాగిపోతున్నారు

విద్యుద్దీపాల వెలుతురులో రాధ మెళ్లో మంగళ సూత్రం తళుక్కున మెరిసింది ప్రకాశం కన్నీరు ఆపుకుందుకు ప్రయత్నిస్తూ అక్కడే బెంచీమీద కూలబడ్డాడు రైలుతోపాటు అతను రాధకోసం కొనుక్కొచ్చిన చీరలు, టాయిలెట్ సామగ్రి అన్నీ కదలి వెళ్లిపోయాయి రాధ కూడా వెళ్లిపోయింది

అతను మాత్రం మిగిలాడు ★

# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

విశ్వవిద్యాలయం కోరవచ్చు ఈ పద్ధతివల్ల తప్పుడు అంచనాల ప్రమాదం తప్పిపోతుంది విద్యార్థులన ప్రత్యక్షంగా పరిశీలించి, పంజాబ్, ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చేవారిని ప్రవేశానికి అనర్హులుగా చేయాలి ప్రాధాన్య మనేది మొట్టమొదటగా ఢిల్లీ విద్యార్థులకే ఇవ్వాలి ఆడపిల్లల విషయం వీళ్లలో చాలామంది వృత్తికోసం చదివేవాళ్లు కారు ఇవన్నీ పెళ్లి చదువులే తృతీయశ్రేణి విద్యార్థినులను పట్ట పరీక్షకు చదివేందుకు ప్రోద్బలం చేయటం వట్టి దండుగ తప్ప ఏమీలేదు అలాంటి వాళ్లు ఒక కళాశాలలోనే పదిహేనుమంది ఉన్నారని పరిశీలనలవల్ల తేలింది పరీక్ష తప్పినందువల్ల వారి



నందరిని పై పరీక్షకు పోకుండా ఆపివేయాల్సి వచ్చింది ఇలాంటి భారీ నిరుత్తీర్ణతలవల్ల ఆ కళాశాలకు చెడ్డపేరు వచ్చింది తమ బిడ్డలను వివాహయోగ్యులుగా తయారుచేసేందుకు తలిదండ్రుల తమ కష్టార్జితమంతా వ్యయం చేశారు చివరకు అంతా వ్యర్థపు ఖర్చుగా తయారైంది

కట్నానికి మారు రూపంగా కళాశాల చదువు తయారైవుంటే, ప్రభుత్వం కేవలం వివాహయోగ్యత సంపాదించేందుకు చదివే ఈ తృతీయ శ్రేణి బాలికలకు 'వైవాహిక కళాశాల' ఏర్పాటు చేయటం మంచిది అర్థంలేనివి, ఆ పిల్లకు వంటబట్టనివి చదువులు చదివించే బదులు ఈ కళాశాలలో ఆదర్శగృహిణికి, మాతృమూర్తికి, కావలసిన బాధ్యతలను బోధిస్తే బాగుంటుంది ఆ! ఏమిటో ఇదంతా మహాబధిర శంఖారావం

*   *

భారతదేశానికి నమూనా అనదగ్గ అశోక్ హొటల్ తరచుగా అప్రతిష్ఠపాలౌతుంటుంది భోజనశాలకున్న ఎయిర్ కండిషనింగ్ యంత్రం చెడిపోయిందని వదంతిగా ఉంది అసలు సంగతి ఏమిటంటే భారతదేశ నిజస్వరూపాన్ని ఎయిర్ కండిషన్ గదుల్లోంచి కాదు చూడటం—అని కాంగ్రెస్ పాలకులు విలాస యాత్రికులకు చెప్పదల్చుకున్నారన్న మాట ఆ యంత్రం పనిచేయక పోవటానికి ఇదీ కారణం ఇందువల్ల ఆ హొటల్లో ఉండేవాళ్లకు, అతిథులకు ఢిల్లీలోని ఆవిరి స్నానపు వాతావరణం అనుభవించే యోగ్యత పడుతుంది చెమట సన్నబడటానికి మంచిది కూడా

హొటల్ బ్యాండుమేళం గోలగా ఉంటుందని ఒక ఆరోపణ ఇది శుద్ధ తప్పు బ్యాండు సహజీవనానికి నిదర్శనమైతే! వీళ్ళకి ఇటు తూర్పు సంగీతం అటు పడమట సంగీతం రెండూ రావు వీళ్ళు ఇది వాయించేది, బోల్పూర్ తయారీ సంగీతం కావచ్చు (బోల్పూర్ లెండి శాంతినికేతన స్థావరం)

ఇంక మూడో ఆరోపణ సప్లయి గూర్చి ఇక్కడ అసలు సంగతి ఈ హొటలు నిర్వాహకులు అతి తాజా ఆహారంతో భోజనం ఏర్పాటు చేస్తారు అతిథి తన స్థానంలో ప్రవేశించగానే ఒక సర్వరు వచ్చి వారికి ఏమేం కావాలో అతి జాగర్తగా, భద్రంగా వ్రాసుకుంటాడు ఆ వెంటనే సేవకులు బజారుకు పరుగెత్తి సామాన్లు తీసుకొచ్చి, వండి వడ్డించాల్సి ఉందాయె! ఇదంతా నిమిషాలమీద జరుగుతుంటే ఇది తెలియని అజ్ఞానులంతానేమో దీన్ని అసమర్థత కింద లెక్కేస్తారెందుకో?

ఇంక చివరి ఆరోపణ ఏమిటంటే, ఆహారం చాలినంత వుండదని, ఇది కూడా అజ్ఞానాత్మకమైందేలెండి తమ అతిథుల జీర్ణశక్తిని గూర్చి, అతిథుల సంఖ్యను గూర్చి, నిర్వాహకులు ఎంతో జాగ్రత్త తీసుకుంటారు 'అసాధారణమైన' కుక్షికి ఆకలి అనిపించటానికి తగినంత ఆహారం మాత్రమే వాళ్లు వడ్డిస్తారు

ఇప్పుడు ఈ హొటలుపని భాభంలోనే ఉంది ఇవుడిది విండుగా కూడా ఉంటోంది కారణం ఇదేదో దివ్యమైనచోటని కాదు ఇంతకన్నా గతిలేక ★

# గళ్లనుడికట్టు-64



## అడ్డం

1 ఇక్కడ ఓటమి కాదు !
3 చెలి మిక్కిలి స్నేహము కలది
5 ధాన్యకటకములో తోట శకటములో కూడా ఉంది
7 తునకలవటము
8 ఆటవెలది పదములు కలది
9 క్షమకు ముందు మార్చి కోపం.
12 తలక్రిందులుగా క్రిందకు దిగు
14 చిన్నచెట్ల గుంపు
15 మధ్యాహ్నానికీ రాత్రికీ మధ్య సమయమా ?
16 హైదరాలీ కొడుకు
17 వడ్లు దంపితే వచ్చేది
20 కలగాపులగమైపోయిన ఘనపరిమాణం
24 అయిదు సంవత్సరాల కొకసారి వీటిని గురించి వింటూ ఉంటాము
25 చేపలు పట్టేదాని గర్వము చుట్టబడినది!
26 బుట్టనిండా ! (ఆశను సూచించేదా ?')
27 చిందరవందర అయిపోయిన మొన
28 సంతోషము—రెండువైపులా

## నిలువు

1 సంతోషం, గెలిచిన విడిదిలో దొరుకుతుంది
2 సురపొన్న, కలువ, ఇంద్రుని ఏనుగు వగైరా
3 చెరుకు మురికికాలవలో కాదు కాని, నిప్పు తయారుచేసే రాయి కావాలి
4 సురనది (ఆకాశగంగ తెలుగులో)
5 తాబేళ్లు
6 నవ్వుని సూచించే రెండు మాటలు!
10 మాట నోరు మండినా చమత్కారము కద్దు
11 క్రింద నుంచి ధాన్య విశేషము ఊరికే ఆదరము చూసి తెలుసుకోండి!
13 వాటికయినా తోట కావాలి మర్రి
18 సముద్రుడు
19 విప్రలంభం, సగంలో ఆసనాలకు సంబంధించి పది చేర్చినా అదే !
20 మాటలు ముక్కలవునా ?
21 ఉప్పు
22 అనుకోకుండా జరిగేది
23 28 అడ్డంతోబాటు జిడ్డు పదార్థము ★

### 63-వ గళ్లనుడికట్టుకు జవాబు



ఒక యువకుడు ఒక సినిమా తారతో, మీ స్నేహితులంతా మిమ్మల్ని గూర్చి ఏమను కుంటు న్నారో తెలుసా?

సి తార' నాకు ఆపొగడ్త లన్నీ వినడానికి టైములేదు. టూకీగా చెప్పండి నాకు పనుంది

యువకుడు - మరండీ, మీరు చచ్చిపోతేగాని సబ్బులు, పౌడర్లు, బీడీలు చవకగా మాకు రావుట.

పద్మ, (విశాఖపట్నం)

అది కంబైన్డ్ క్లాసు. అమ్మా యిల నుద్దేశించి మేష్టారన్నారు "అమ్మాయిలూ' మీ రంతా నా కుమార్తెలవంటి వారు" తర్వాత అబ్బాయిలవైపు తిరిగి "అబ్బాయిలూ, మీరంతా నా కుమారులవంటివారు." అని వాక్యం పూర్తిచేయకుండానే వెనక బెంచిలోంచి ఒకబ్బాయి "కాదు మామయ్యోయ్" అని అరిచాడు

జి ఈశ్వరవర్మ (జాలాపుట్)

# పొట్టికథలు

దేశమంతటా ఎన్నికల హడావిడి ఎక్కువగా ఉన్నది. రోజుకో పార్టీవారు వచ్చి ఓట్లిమ్మని అడుగుతున్నారు.

ఒక ఉపన్యాసకుడు మంచి నీళ్ళయినా త్రాగకుండా మూడుగంటలు ఉపన్యాసం యిచ్చాడు. ప్రజలు చాలా శ్రద్ధగాఆలకించారు. వాళ్లంతా తన బుట్టలో పడిపోయినట్లు ఉపన్యాసకుడికి బాగా నమ్మిక కుదిరింది.

"అయితే మా ఓట్లన్నీ మీాకే వేస్తామని మీా పెద్ద ఎవరో, వచ్చి నాకు వాగ్దానం చెయ్యాలని విజ్ఞప్తి చేస్తూ ఉన్నాను" అన్నాడు.

ఊరి పెద్ద లేచి బుఱ్ఱగోక్కున్నాడు. "ఇప్పు డెట్టాగండీ! మీారు ఒకరోజు ముందరే వచ్చి ఉండాల్సింది. నిన్ననే ఆ పార్టీ వారికి మాటిచ్చామండి"

"సింగినాదంకాదూ! మాట యిస్తే ఇప్పుడేం మునిగిపోయింది." అంటూ కసురుకున్నాడు ఆయన, "మాట యిస్తేమటుకు వాడికే వెయ్యాలని ఏ 'లా'లో ఉంది చెప్పు."

ఊరి పెద్ద సంకటంలో పడ్డాడు ఒక నిమిషం ఆలోచించుకొని అన్నాడు. "సరేలే బాబూ! అట్టయితే తమరికే వేస్తాంలే!"

వి శివరామయ్య (బాపట్ల)

## వచ్చే వారం

## పిల్లలకు ప్రత్యేకం!

* చతురంగతురంగం—పిలకా గణపతిశాస్త్రి
* బుడుగు—ముళ్లపూడి వెంకటరమణ
* బియోవుల్ఫ్ - బాలసాహితి సీరియల్ ప్రారంభం
* సంధ్యాతారక
* డిట్రిక్
* ఊమెన్ - ప్రత్యేక కార్టూన్‌లు

## వెల: 25 నయాపైసాలు

### "గాడిది"

మా ఊళ్లో కార్తీక శుద్ధ ఏకాదశికి శ్రీకృష్ణజననము నాటకం వేశారు. నాటకం బాగానే జరుగుతున్నది. అందులో దేవకి పోర్షను వచ్చేసింది. కంసుడు ఆడపిల్లను నరికేసమయంలో దేవకి "అన్న. శమింపుమన్న. తగదల్లుడు. గాడిది... .మేనకోడలా" అని అనేసరికి హాలులోవున్న వారంతా ఘొల్లున నవ్వారు. దేవకి తలదించుకొని లోపలకు వెళ్ళిపోయింది. తెర వేశేశారు.

గంబలి జగన్నాథస్వామి
(చాకరావల్లి)

* * *

ఒక వితంతువు లాటరీ వేసింది ఆవిడకి స్టీలుసామానుల బదులు పాపం దువ్వెన్నలు వచ్చాయి ఆవిడ కోసంగా నాకివెందుకు నాయన, మరేమన్నాయియ్యి

వర్తకుడు:- అమ్మా, పక్క పిన్నులు పాకెట్లు ఇమ్మంటారా?

పద్మ, (విశాపట్నం)



Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1 Chief Editor. S Sambhu Prasad.

